# చతుర

జనవరి 1979

సంపుటి 1 సంచిక 12


## ఈ నెల సమగ్ర నవల

ఆ గది ఏర్‌కండిషన్డ్‌దే అయినా సిగరెట్లూ, విస్కీల వాసనల్తో పిచ్చిపిచ్చిగా పరవళ్ళు తొక్కుతోంది; లోపల ఇద్దరు మగాళ్లూ, ముగ్గురు అప్సరసల్లాంటి అంగనలూ ఉన్నారు. అంతా దాదాపు దిగంబరంగానే ఉన్నారు. రెండు జతలు ఆలింగనాల్లో, ఆంగ్లంలో ముద్దుముద్దుగా తిట్టుకుంటున్నారు. అందరూ తాగిన మైకంలోనే ఉన్నారు. ఎదురుగా కొన్ని పాశ్చాత్య బూతు బొమ్మల పుస్తకాలున్నాయి. ప్రక్కన 8 యం.యం. ప్రొజెక్టర్లో బ్లూ ఫిల్మొంది...ఆ ముగ్గురమ్మాయిల్లో ఒకామె ఒక కోటీశ్వరుడి కూతురు. మరొకామె ప్రముఖ సంఘ సేవిక. ఇంకొకామె పాశ్చాత్య వనిత...వారిలో ఒకాయన పోలీస్ ఆఫీసర్, మరొకాయన మరో రాష్ట్రపు పెద్ద ఆఫీసర్, మూడో ఆయన కోటీశ్వరుడు...

అక్కడ మరింకేం చూసి, ఆ తర్వాత మరేం అనుభవించి...

# దిగిరండి...దిగిరండి ధృతరాష్ట్రభువికి

అంటున్నాడు...కథానాయకుడు! ఎవరా కథానాయకుడు...? ఏమిటా ధృతరాష్ట్రభువి...??

## ఎన్.ఆర్.నంది

తాజా నవల 'దిగిరండి దిగిరండి ధృతరాష్ట్రభువికి' ఈ నెల చతుర సమగ్ర నవల.

## ఈ నెల ముఖపత్రం

నమ్మకాలనేవి దేశ దేశాల్లో వివిధ రకాలుగా ఉన్నా, చాలా సందర్భాల్లో వాటి మధ్య సారూప్యత కనుపిస్తుంది. మనం చంద్రునిలో కనుపించే మచ్చలను చూసి 'అదిగో కుందేలు' అని కథలల్లుకున్నాం. అలాగే చైనీయులు కూడా చంద్రునిలో కుందేలు ఉందనీ, ఓ చెట్టు క్రింద నిలబడి 'పిండి' దంచుతూ ఉంటుందనీ అర్థం చెప్పుకున్నారు. అలాగే ఆకాశాన్నావరించు కుని ఉండే మేఘాకృతులను చూసి రాక్షసులుగా భావించు కున్నారు. ఆ భావాలను 18వ శతాబ్దపు చైనీస్ చిత్రకారుడు చేసిన వర్ణ రూపకల్పనే ఈ నెల చతుర ముఖ పత్రం. ఈ చిత్రం ప్రస్తుతం లండన్ మ్యూజియంలో ఉన్నది.

## రెండవ కవరు

యువకోత్సాహానికి ప్రతీక. తెలుగు నాట ప్రతిచోటా ఆదరింప బడే అందరికీ తెలిసిన 'హై జంప్' ఆట.

## మూడవ కవరు

'కూటికోసం వెలసిన కోటి విద్యలలో ఎంద్రజాయలను వేటాడటం కూడా ఒకటి. అదే వృత్తిగాగల వారెందరో.

## నాలుగవ కవరు

న్యూ జార్జియా ప్రాంతపు సాలమన్ దీవి ఆటవికుల సాంప్రదాయిక దారు శిల్పం. ప్రకృతి శక్తులు, సంపదలు అన్నింటిని ఇముడ్చుకున్న ఆ పక్షి తమను రక్షిస్తూ ఉంటోందని వారి నమ్మకం.

*'చతుర'కు నవలలు పంపేవారు దయచేసి ముందుగా ఈ సంచికలోనే మరొక చోటగల 'రచయితలకు సూచనలు' పరిశీలించి, వాటిని పాటించగోరుతున్నాం.*

చతుర

ఈనాడు కాంపౌండ్

సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# దోమలు పారిపోయాయి...హాయిగా నిద్ర పట్టేసింది

ఓడొమాస్ ఏర్పరచే కవచం
దోమలను దగ్గరికి రానివ్వదు గనక మీరు రాత్రంతా నిశ్చింతగా, హాయిగా నిద్ర పోవచ్చు. ఓడొమాస్ మీ చర్మానికి కూడా సురక్షితమైనది.




దోమల పాలిట శత్రువు-బల్సారావారి

# ఓడొమాస్

కిడ్డీ బ్యాంక్

**5 సంవత్సరాలు నిండిన బేబీ గీత తన పుట్టినరోజు కానుకగా తాను చూచిన ఒక చక్కటి బొమ్మను ఇమ్మని నాన్నను కోరింది.**





## ఆమె తండ్రి ఒక అద్భుతమైన బొమ్మను గీతకు కానుకగా ఇచ్చాడు. అదే ఆంధ్రా బ్యాంక్ వారి కిడ్డీ బ్యాంక్. అదే గీత అడిగిన బొమ్మ.

అంతకు ముందు కిడ్డీ బ్యాంక్ బొమ్మను గీత చూసింది బ్యాంక్‌లో కాదు. ఆమె నేస్తందగ్గర చూసింది. ఆనేస్తం రోజూ బొమ్మలో డబ్బులు వేయడం చూసి ముచ్చటపడింది. తనకూ ఓ కిడ్డీ బ్యాంక్ కావాలనుకుంది. తనుకూడా రోజూ కొంత పొదుపు చేయాలని నిశ్చయించుకుంది. ఆడుతూ పాడుతూ పిల్లలు పొదుపు చేయడానికి సరైన సాధనం ఆంధ్రా బ్యాంక్ వారి కిడ్డీ బ్యాంక్. అది గ్రహించిన చిన్నారి బాలలు లక్షలమంది ఉన్నారు. బేబీ గీత వారిలో ఒకతె.

దాదాపు 55 సంవత్సరాల అపారమైన అనుభవం గడించి, 640 కి పైగా శాఖలతో, దేశమంతటా విస్తరించిన ఆంధ్రా బ్యాంక్, అనేక యితర పథకాలను కూడా ప్రవేశపెట్టింది అవే - కల్పతరువు, భాగ్యలక్ష్మి, సంరక్ష, సంక్షేమ, గృహకల్ప, జనసహాయ, కర్షక సహాయ, మరియు మహిళా సంక్షేమ పథకాలు. ప్రతి పథకం ప్రత్యేకమైనదే. ఒక్కొక్క సమస్యను తీర్చడానికి ఒక్కొక్క పథకం.

అంతేకాదు, కీలక రంగానికి, బలహీన వర్గాలకు కూడా ఆంధ్రా బ్యాంక్ ఆర్థిక సహాయం చేస్తోంది.

ప్రజావసరాలకు తోడ్పడేదే-ఆంధ్రా బ్యాంక్



**ది ఆంధ్రా బ్యాంక్ లి.**

కేంద్ర కార్యాలయం, సుల్తాన్ బజార్,
హైదరాబాద్-500 001.

ఓ. స్వామినాథరెడ్డి : ఛైర్మన్

KIRON/AB/78

# రాజు కొండ ఎక్కేందుకు వెళ్లాడు

రాజు, శంకర్ ఐదిపిల్లలతో కొండఎక్కేందుకు వెళుతున్నారు




శంకర్ రాజుని ఏడిపిస్తున్నాడు




వాళ్ళు విశ్రాంతికోసం కాసేపు ఆగుతారు




కాసేపటికి. రాజుని తోయబోయి శంకర్ జారిపడతాడు







శంకర్ సిగ్గుపడి పోతున్నాడు




రాజు వరుస తప్పకుండా న్యుట్రామల్ హాయిగా తాగుతాడు, న్యుట్రామల్ అమల్ వారి ఆరోగ్యాన్నిచ్చే, రుచికరమైన పానీయం. న్యుట్రామల్ బలవర్ధకమైన, మీగడగల అమల్ పాలతోపాటు, అసలైన కోకో, మాల్ట్, పంచదార కలసిన మిశ్రమం.

అరే, ఆశ్చర్యం! న్యుట్రామల్ ఖరీదు కూడా తక్కువే. 500 గ్రాముల న్యుట్రామల్ మీకు అందుబాటయే వెల రూ. 12.21. స్థానిక పన్నులు, సెంట్రల్ సేల్స్ ట్యాక్స్, రవాణా ఛార్జీలు అదనం.

రాజుకి, , ఇప్పుడిక శంకర్‌కి, ఇంకా దేశమంతటా వేలాది మందికి రోజూ న్యుట్రామల్ తాగడం అంటే ఎంతో ఇష్టం.

**అమల్ వారి న్యుట్రామల్**

**ప్రతి కప్పూ మీకు పోషణను ఇచ్చు**



daCunha/N/3 TEL

మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే
అందరి నోట ఒకే మాట...



ఇది తప్పక

# డెట్

డిటర్జెంట్
బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel

# విపుల భాషా భూషణులు

'విపుల' చేతిలో ఉన్నవారికి భాషా సమస్యే లేదు. ఏ దేశమైనా సునాయాసంగా సందర్శించగలరు. ఏ భాషా ప్రాంతంలోనైనా హాయిగా పర్యటించి రాగలరు. భాషా పరమైన హద్దులను, ఆటంకాలను అధిగమింపజేసే ఏకైక సాధనం 'విపుల' మాసపత్రిక.

వివిధ భారతీయ భాషలలోని, ప్రపంచ భాషలలోని అత్యుత్తమ కథలను సేకరించి సరళమైన తెలుగులో సమర్పిస్తోంది విపుల. 'విపుల' చదవటం అంటే కేవలం మానసికోల్లాసం మాత్రమే కాదు... విశ్వ కథా సాహితీ గగనంలో సునాయాసంగా విహరించగలగటం కూడా. అది కూడా కేవలం **125** పైసల ఖర్చుతోనే.

జనవరి సంచికలో వివిధ భాషల ప్రసిద్ధ కథారచయితల 17 కథలున్నాయి. ప్రతి కథకూ రెండురంగుల భావస్ఫోరక చిత్రాలు...రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో కనువిందైన 132 పేజీల మాసపత్రిక 'విపుల'.

సదా నూతనత్వాన్ని కోరే తెలుగు పాఠకులకు ఊహాతీతమైన విశిష్ట కానుక 'విపుల'.

## విపుల

**కేవలం 125 పైసలే**

ప్రతి నెలా 1వ తేదీకి వెలువడే విశ్వకథావిపంచి 'విపుల'



Marketed By

**Margadarsi Marketing**

PRIVATE LIMITED **Eenadu Compound, Hyderabad-500 004**

# భారీమిత్రులు

ప్రపంచంలో అతి పొడవైన యువతిగా పేరు పొందిన 26 ఏళ్ళ కుమారి శాండి ఎత్తు 7 అడుగుల 7 అంగుళాలు. బరువు మాత్రం 440 పౌన్లు.

ఆవిడ ఓ పేద కుటుంబంలో పుట్టింది. ఆమెకు బాల్యంలోనే పొడగరి తనం లక్షణాలు కనిపించాయి. పదేళ్ళ వయసులో ఆమె ఎత్తు 6 అడుగుల 3 అంగుళాలు వుండేది.

శాండీని ఆ గ్రామంలో అందరూ వెక్కిరిస్తూ "జాలీ గ్రీన్ జయింట్" అనే పేరుతో పిలిచేవారు. రెండేళ్ళ క్రితం ఆమె పొడవు పెరగకుండా శస్త్ర చికిత్స చేయడంతో ఆమె అవయవాలలో జరిగే వింత మార్పు నిలిచిపోయి శాండి ఎత్తు 7 అడుగుల 7 అంగుళాల వద్దనే ఆగిపోయింది.

పొడగరి తనం వల్ల ఆమె జీవితంలో ప్రశాంతత లేక విషాద పూరితమై పోయింది. తగిన స్నేహితులు, మనసు విప్పి మాట్లాడే వారూ దొరక్క ఒంటరి తనాన్ని అనుభవించి నరకాన్నే చవి చూసింది. ఆమె బయటి ప్రపంచంలోకి వచ్చి హోటళ్ళకు, సినిమాలకు వెళ్ళటానికే భయపడేది. అక్కడ కుర్చీల్లో కూర్చునేందుకు సిగ్గుపడేది.

కుటుంబ పోషణ బాధ్యత ఆమె మీద వున్నందున ఉద్యోగం కోసం ప్రయత్నం చేస్తే టూరిస్టు-బస్సులో ఉద్యోగం దొరికింది. యాత్రికుల వినోద కాలక్షేప విశేషాల్లో ఆవిడ ఒకర్తె అయింది.

ఆమెను చూసి మొదట్లో చిన్న పిల్లలు "జయింట్ ... జయింట్" అని గేలి చేసినా, ఆ తర్వాత ఆమె మంచితనాన్ని అర్థం చేసుకుని స్నేహం చేయటం సాగించారు.

మరో విశేషం ఏమిటంటే ఆమె ఉద్యోగం చేసేచోటే 'క్రిస్ గ్రీనెర్'అనే 7 అడుగుల 6 అంగుళాల ఎత్తు గల యువకుడు కూడా పనిచేస్తున్నాడు. గ్రీనెర్ కుమారి శాండి కంటే ఒక్క అంగుళం పొడవు తక్కువ. అతను తన జీవితంలోనూ మొదట్లో శాండిలాగే ఎన్నో ఇబ్బందుల్ని ఎదుర్కొన్నాడు.



సంతోషంలేని బ్రతుకుని గడిపాడు. లోకుల వెక్కిరింపులూ, వేళాకోళాలకు గురి అయ్యాడు.

ఒకేచోట ఉద్యోగం చేస్తున్న ఆ ఇద్దరికీ మంచి స్నేహం కుదిరింది. తమ సమస్యల్ని, బాధల్ని ఒకరికొకరు మనసు విప్పి మాట్లాడుకొనేవారు. కాని, తాను గ్రీనెర్ ప్రేమలో మాత్రం పడలేనంటుంది శాండి.

# పాషాణభక్షకి

తమిళనాడులోని రత్నవేల్‌లో ఓ మిల్లు కార్మికుడి ఏడేళ్ళ కూతురు 'సెల్వి' చాలా చురుకైన పిల్ల. ఉన్నట్టుండి ఆమె పొట్ట పెరుగుతున్నట్లు తలిదండ్రులు గమనించారు. పొట్ట పెరగటంతోపాటు బాధ కూడా మొదలై తీవ్రతరం కాసాగింది.

అజీర్తివల్ల పొట్టఉబ్బరించి ఉండొచ్చని ఆమెను ఆసుపత్రికి తీసికెళ్ళారు. అక్కడ డాక్టర్లు కూడా అజీర్తికే మందులిచ్చి ఆ పిల్లని పంపేశారు. కానీ, సెల్వి కడుపులో అధికమవుతున్న బాధకు తట్టుకోలేక కేకలు వేస్తూ, మెలికలు తిరిగిపోసాగింది. ఆమె తల్లిదండ్రులు భయపడి ఆ పిల్లను మరో ఆసుపత్రికి తీసికెళ్ళి పరీక్ష చేయించారు.



అక్కడ డాక్టర్లు ఆపిల్లకి 'ఎనీమా' చేసేసరికి రెండు చిన్న చిన్న రాళ్ళు ఆ పిల్ల కడుపులోంచి బయటికి వచ్చాయి. దాంతో ఇంకా ఆపిల్ల కడుపులో చాలా రాళ్ళుండ వచ్చునని డాక్టర్లు ఆమెకు ఆపరేషన్ చేశారు. అంతే ఆమె పొట్టలోంచి అరకిలో బరువుగల రాళ్ళు బయటపడ్డాయి.

'ఆ పిల్ల తెలియని తనంలో రాళ్ళు, మట్టి తిని ఉండటం వల్ల ఈ విధంగా సంభవించిందని ఆమెకు ఆపరేషన్ చేసిన డాక్టర్ గుణశీలన్ వ్యాఖ్యానం.

# కిలో కూరగాయలు 2 రూపాయలా?

గల్ఫ్ దేశాల్లో యువకులకు అద్భుతమైన జీతాలతో ఉద్యోగాలు దొరుకుతున్నాయనీ, అక్కడివారు దేనికీ లోటులేకుండా సుఖజీవితాలను గడుపుతున్నారనీ అక్కడికి వెళ్తే తాము సుఖపడవచ్చునని చాలామంది కుతూహలపడుతుంటారు. కానీ అవన్నీ దూరపు కొండలే! అక్కడ లభించే జీతాల గురించే ఆలోచిస్తారు గానీ, ఆకాశాన్నంటే ధరల గురించి ఎవరూ పట్టించుకోరు. 'కువైట్'లోని కొన్ని విశేషాలను తెలుసుకుంటే విస్మయం కలగకుండా ఉండదు.

బొంబాయి నుంచి 'కువైట్'కి విమాన ప్రయాణం 3½ గంటలు. అయినా అక్కడికి వార్తా పత్రికలు సాయంత్రం మాత్రమే వస్తాయి.

ఇళ్ళలో పనిచేసేందుకు మనుషులు దొరకరు. ఇళ్ళు శుభ్రపరుచుకోవటం, బట్టలుతుక్కోవటం అంతా ఎవరికి వారే చేసుకోవాలి. అది చాలా పొడి





ప్రదేశం. ఇల్లు శుభ్రపరిచిన గంటలో అరచేతి మందాన మళ్ళీ దుమ్ము పేరుకుంటుంది. టి.వి.లో ఒక కార్యక్రమాన్ని చూడటం పూర్తి చేసేలోగా బోలెడు దుమ్ము పేరుకుపోయి ఉంటుంది.

కలగూరగంపగా ఉన్న కూరగాయలు కిలో 21 రూపాయలు. కొబ్బరిచిప్ప ఒక్కటి 15 రూపాయలు. అయితే ఆసక్తి కలిగించే విషయం ఏమిటంటే 'కువైట్'లో ఉచిత చికిత్సా



సౌకర్యం ఉంది. పేదా, గొప్ప వ్యత్యాసం లేకుండా అందరికీ మంచి చికిత్స ఏర్పాట్లు ఉంటాయి. ఖరీదైన మందులేకాక, శస్త్రచికిత్స కూడా ఉచితమే!

వంటగ్యాసు ఉచితంగా లభిస్తుంది పెట్రోలు చాలా చౌక.

విదేశాలనుంచి వచ్చినవారు అక్కడ ఆస్తుల్ని కొనుగోలు చేయరు. స్వంత వ్యాపారాలు ప్రారంభించరు. స్థానిక వ్యాపారాలలో భాగస్వామ్యాన్ని మాత్రం తీసుకుంటారు. అంతకుమించి అవకాశం లేదు. 'కువైట్'లో బిచ్చగాళ్ళు లేనే లేరు.

# టీకప్పులో తుఫాన్

జోహన్నెస్‌బర్గ్‌లో ఒక పోలీసు కానిస్టేబులు ఓ రోజున దూరాన ఉన్న భార్యామణికి ఉత్తరం రాసి, పోస్టు చేసేందుకు కవర్ దొరక్క, అందుబాటులో ఉన్న ఆఫీసు కవర్లో ఆ లేఖను పెట్టి పోస్టులో పడేశాడు.

తీరా ఉత్తరం ప్రయాణం సాగించే సరికి పోస్టల్ శాఖవారికి అనుమాన మొచ్చింది. కవర్‌మీద పోలీస్ డిపార్ట్‌మెంటు ముద్ర ఉన్నది. కానీ ఉత్తరం మాత్రం ఏ ఆఫీసుకూ, ఆఫీసరుకూ వెళుతున్నది కాదు. ఓ అనామకురాలి చిరునామా ఉంది ఆ కవర్‌మీద. అయినా యధావిధిగా కానిస్టేబుల్‌గారి భార్యకి అందజేశారా ఉత్తరం.

ఆ తర్వాత పోస్టల్‌వాళ్ళ సమాచారాన్ని అందుకుని, ఆ ఊళ్ళో ఉన్న పోలీసు శాఖవారు ఆమె ఇంటికి వెళ్ళి, "పోలీసు శాఖనుంచి మీకో ఉత్తరం వచ్చింది. అందులో ఏవైనా ఆదేశాలు వచ్చాయా ?" అని అడిగారు. ఆమె అదేమీ కాదనీ, అది తన భర్త రాసిన ఉత్తరమేననీ చెప్పింది.

విషయం వెంటనే జోహన్నెస్‌బర్గ్ పోలీసు స్టేషన్‌కి తెలియజేయబడింది. ఆఫీసు ఆస్తిని స్వంతానికి వాడుకుని దుర్వినియోగం చేసిన నేరంపై వెంటనే ఆ కానిస్టేబుల్‌మీద కేసు నమోదు అయింది. వ్యవహారం కోర్టుకెక్కింది.

కేసులో సాక్ష్యమిచ్చేందుకు ఒక

పోస్టల్ అధికారి పది రోజులపాటు ఆఫీసు పని వదిలిపెట్టి, మూడు వేల మైళ్ళ దూరంనుంచీ జోహన్నెస్‌బర్గ్‌కి ప్రభుత్వం ఖర్చుమీద రావాల్సి వచ్చింది. అతని ఖర్చు దాదాపు 30 పౌండ్లయితే, కోర్టు వ్యవహారం క్రింద మరో వంద పౌండ్లు ఖర్చయింది.



ఇదిగాక, కేసు దర్యాప్తుకి సంబంధించి చేతిరాత నిపుణులు, పోలీసులు, డిటెక్టివ్‌లు మొదలైనవారి అలవెన్సులకింద విపరీతమైన వ్యయం జరిగింది. కోర్టులో కొన్ని నెలలపాటు కేసు నడిచింది. చిట్టచివరకు జడ్జిగారు 'ఇది టీకప్పులో తుఫాను' లాంటి స్వల్ప విషయం. దీనికింత రాద్ధాంతం అనవసరం' అని కేసు కొట్టిపారేశారు.

## వేశ్యల ఉద్యమం

మన దేశంలో వేశ్యావృత్తిని ప్రభుత్వం నిషేధించింది. కానీ, జపాన్‌లో ఇలాంటివారు చట్టపరంగా తమ వ్యాపారం కొనసాగించుకోవచ్చునట. అక్కడ వేశ్యలను 'గెయిషా'లు అని వ్యవహరిస్తారు. 180 మంది 'గెయిషా'లు ప్రమాదాలనుంచి రక్షణ కల్పించాలనీ, ఇన్సూరెన్స్ అవకాశాలు కలుగజేయాలనీ, తమ జీవన విధానాన్ని దృష్టిలో ఉంచుకొని నిరుద్యోగభృతి ఇవ్వాలనీ ఆందోళన చేస్తున్నారు. దేశంలో బాధ్యతగల పౌరులుగా తాము ఆ సౌకర్యాలను పొందటానికి అర్హులమేనని వారు వాదిస్తున్నారు.

తాము చేసే వృత్తిలో మత్తుపదార్థాలు విశేషంగా సేవించే అవకాశం ఎక్కువగా ఉంటుందనీ, ఫలితంగా తమ ఆరోగ్యం దెబ్బతినే ప్రమాదం ఉన్నదనీ, ఉద్యోగాలను సంపాదించగలగటంలో ఇబ్బందులు ఎదురవుతున్నాయనీ, అందువల్ల తమకు ప్రమాదాలకు ఇన్సూరెన్సు, నిరుద్యోగ భృతి సౌకర్యాలు కల్పించాలని వారు అంటున్నారు.




'గెయిషా' వృత్తిలో జీవిస్తున్న వీరందరిపై సాధారణంగా ఎవరికైనా సానుభూతి ఉంటుంది. ఆ సానుభూతిని ఆసరాగా తీసుకుని వారు ఆ కోర్కెలను తీర్చుకోదలచుకొన్నారని కొందరు




విమర్శకుల అభిప్రాయం. బహుశా ఆ రెండు కోర్కెల విలువనూ వాళ్ళదగ్గరి కొచ్చే కష్టమర్లే తీరుస్తారేమో!

## చిక్కు తెచ్చిన చిట్టెలుక

తమిళనాడులో 'నల్లతంబి'అనే ఓ పెద్ద మనిషి తనకూతురు పెళ్ళికి ఇంటిముందు బ్రహ్మాండమైన పందిరి వేయించాడు. బంధుమిత్రులతో కళ్యాణ మంటపం కిటకిటలాడ్తోంది. విందులో వడ్డించేందుకు లడ్లూ, జిలేబీలు కూడా సిద్ధంగా ఉన్నాయి.



పెళ్ళికి ఓరోజు ముందే తయారయిన పిండి వంటల సువాసనకి ఓ చిట్టెలుక అవి ఉన్న స్టోర్ రూమ్‌లోకి ప్రవేశించి, కడుపునిండా వాటిని భోంచేసి,హుషారుగా గంతులేయసాగింది. దాని గల్లంతువల్ల ఆ రాత్రి పక్కగదుల్లోవారికి నిద్ర పట్ట లేదు. వాళ్ళ ఇబ్బందిని చూసి ఆవేశంతో ఇంటాయన ఒక ఎలకబోనును స్టోర్ రూమ్‌లో పెట్టాడు.

పుష్టిగా లడ్లు, జిలేబీలు భోంచేసి హుషారులో ఉన్న చిట్టెలుక బోనులో పడింది. ఆ తర్వాత తన పరిస్థితిని తెలుసుకుని ఉన్న ఓపికా, తిన్న ఓపికా అంతా కూడగట్టుకుని మరింత గొడవ చేసింది.

ఇంటాయన వెంటనే బోనుతోసహా చిట్టెలుకను ఆరుబయట తోటలోకి తీసి కెళ్ళి, కసితీరా అరలీటరు కిరసనాయిలు దానిమీద బోర్లించి, నిప్పంటించి బోను లోంచి దాన్ని వదిలాడు.

ఆ మంట సెగలకే అది చచ్చి ఊరు కుంటుందని భావించిన ఆయన ఆలోచన తలకిందులైంది. ఆ చిట్టెలుక వళ్ళంతా మంటలతో అటూ ఇటూ పరుగెత్తి పెళ్ళి పందిరెక్కి గంతులేసింది.

అంతే, పందిరికి నిప్పంటుకుంది. బంధు జనాలు హాహాకారాలు చేస్తూ, చేతి కందిన పాత్రలతో నీళ్ళు పైకి విసరారు. క్షణాలమీద ఫైరింజన్లూ అక్కడికి వచ్చాయి. అప్పటికే పందిరి పూర్తిగా భస్మీపటలమైపోయింది అదృష్టం బాగుండి ఎవరికీ ప్రాణాపాయం కలగ లేదు. చిట్టెలుక ఎంత చిక్కు తెచ్చి పెట్టిందీ!

## ఆత్మరక్షణ సంస్థ

ఫ్రాన్స్‌లో దొంగతనాలు చాలా ఎక్కువ. రోజూ కనీసం 500 ఇళ్ళలోనైనా ఈ దొంగతనాలు జరుగుతూ ఉంటాయని ఓ సర్వేలో వెల్లడైంది. దొంగలు సాయుధులై ఉండటం వల్ల సామాన్య ప్రజానీకం వారిని ఎదు

ర్కోవటం, ఎదుర్కొని తట్టుకోగలగటం అసాధ్యమవుతోంది. అందువల్ల దొంగతనం జరుగుతోంటే కళ్లప్పగించిచూడటం తప్ప గత్యంతరం లేకపోతోంది.



కానీ, ఈమధ్య కొందరు గృహస్థులు తమ ఇంటికి కన్నం వేసే దొంగలను ఎదుర్కొంటున్నారు. వియెనెల్ వీగ్రే ఇంట్లో 12సార్లు దొంగలుపడ్డారు. అతను కారు మెకానిక్కు. దొంగతనాలతో విసిగిపోయిన వీగ్రే తన ఇంటి అలమార తలుపులకు పైన ఓ పుర్రెను అమర్చి 'తలుపులు తెరిస్తే ప్రాణాలు పోతాయ్' అనే హెచ్చరిక రాశాడు. అతను బయటకు వెళ్ళిన సమయంలో దొంగలు వానే వచ్చారు. అలమారపై ఉన్న హెచ్చరికను లక్ష్యపెట్టకుండా తలుపులుతీశారు. అంతే! పెద్ద శబ్దంవచ్చింది. ఇద్దరు చోరులు అక్కడికక్కడే మరణించారు. మరొకడికి కళ్ళుపోయాయి.

హత్యానేరంపై వీగ్రేను పోలీసులు అరెస్టు చేశారు. దిగువ కోర్టులో అతనికి శిక్షపడింది. కాని ఫ్రాన్స్‌లో గొప్ప పేరు ప్రఖ్యాతులున్న రోమెరో, హెన్రీ రెనీ గెరా అనే ఇద్దరు న్యాయవాదుల సాయంతో పై కోర్టుకు అప్పీలు చేసుకున్నాడు. అక్కడ ఆ కేసు కొట్టేశారు.

ఇదే విధంగా దక్షిణ ఫ్రాన్స్‌లోని ఓ ఎలక్ట్రిక్ షాపు యాజమాని ఇంట్లో దొంగ ప్రవేశించినపుడు అతనిని కాల్చి చంపేశాడు. మరో చోట కొంతమంది పౌరులు ముగ్గురు దోపిడీదారుల్ని మట్టుబెట్టారు. ఈ కేసులు కూడా రోమెరో, హెన్రీలు చేపట్టి వారికి శిక్ష పడకుండా చూశారు.

ఇపుడు ఆ న్యాయవాదులిద్దరూ సక్రమ ఆత్మరక్షణ సంస్థను స్థాపించారు. ఇది ఫ్రాన్స్ ప్రజలను బాగా ఆకర్షించింది. దాదాపు 25 వేల మంది ఈ సక్రమ ఆత్మరక్షణసంస్థలో సభ్యులయ్యారు. రోమెరో ఇదివరలో జడ్జిగా పనిచేశాడు. నేరస్థులు జైల్లో ఉన్నపుడు సౌకర్యవంతమైన జీవితం గడపాలంటాడు రోమెరో. ఇపుడు ఫ్రాన్స్ జైళ్ళలో ఖైదీలు దుర్భర జీవితాన్ని గడుపుతున్నారు.

సక్రమ ఆత్మరక్షణ ద్వారా ఎవరికి వారే న్యాయపరిపాలన చేస్తుండటం ఫ్రాన్స్ ప్రభుత్వానికి గొప్ప తలనొప్పిగా పరిణమించింది. ఎప్పటికైనా దీనివల్ల పౌర జీవనం అధ్వాన్నమవుతుందని ఫ్రాన్స్‌ప్రభుత్వం అభిప్రాయపడుతోంది.

# ప్రేమే నేరమౌనా

అమానుషమైన, అంధకార బంధురమైన బందిఖానాలో 29 సంవత్సరాలుగా

మగ్గిపోతున్న హెలెనీ క్యారోటి అనే 47 ఏళ్ళ గ్రీకు వనితకు గ్రీకు పోలీసులు ఇటీవలే విముక్తి కల్పించారు.

హెలెనీ నిర్బంధంలో ఉన్న ఆ చీకటిగది, మధ్య గ్రీసులోని లామియా సమీపంలోగల 'కొస్టాలెక్సి' అనే మారు మూల గ్రామంలో ఉన్నది.



హెలెనీ ఒక స్థానిక యువకుణ్ణి ప్రేమించి, అతనితో సంబంధం పెట్టు కున్న కారణంగా వారి ప్రేమ గిట్టక, ఆమె కుటుంబ సభ్యులే అమెను ఒక చీకటి గదిలో బంధించారు. ఈ సంఘ టన 1949లో జరిగింది. అప్పటికి హెలెనీ వయసు 18సంవత్సరాలు. ఆ యవ్వనప్రాయం నుంచీ ఆమె మొన్నటి వరకూ-అంటే 29 సంవత్సరాల పాటు బాహ్య ప్రపంచంతో ఏ సంబంధమూ లేక, ఒక్క వెలుగు కిరణానికి నోచు కోక, ఆ చీకటి గదిలో దుర్భరమైన జీవితాన్ని గడిపింది.

ఈ 29 సంవత్సరాల అంధకార జీవి తాన్ని ఆమె ఒకేఒక్క బట్టతో గడి పింది. తను విసర్జించిన మలమూత్రాల మధ్య ఓ కుళ్ళు పురుగులా ఆమె దారుణ మైన బతుకు గడిపింది. గదిలో గల్లం తుగా తిరిగే ఎలుకల్ని తప్ప ఆమె మరో ప్రాణిని కంట చూడలేదు.

అమానుషమైన ఈ బందిఖానా విష యం గాలి వార్తలా వ్యాపించి పోలీసు లకు అంది, వారు వచ్చి చూస్తే ఆ చీకటి గదిలో హెలెనీ శల్యావస్థలో కనిపించింది. ఆమె శరీరమంతా వణికి పోతున్నది. కాలి కండరాలు శక్తిహీన మైపోయి, నిలబడలేక పోతోంది. మాట కూడా చిన్నగా సణుగుడు మాదిరిగా మారిపోయింది. ఆ దుర్భర ఏకాంత వాసం మూలంగా ఆమెకి మతి స్థిమితం తప్పింది.

పోలీసులు వెంటనే 'హెలెనీ ని ఆసుపత్రిలో చేర్చారు.

ప్రస్తుతం హెలెనీ తల్లి దండ్రులు చనిపోయారు. ఆమె అన్న, అక్కలు దాదాపు 50-60 సంవత్సరాల వయసు వాళ్ళు.

హెలెనీని చావకుండా, జీవచ్ఛ వంలా ఉంచేందుకు వారు రోజూ గోడ కన్నంలోంచి ఒక ఎండిపోయిన రొట్టె ముక్కని గదిలో పడేసేవారు. కొస్టా లెక్సి గ్రామంలోని మేయర్‌కు, స్కూలు టీచర్‌కు, పూజారికి హెలెనీ ఇరవై తొమ్మిదేళ్ళ సుదీర్ఘ బందిఖానా గురించి తెలుసు. కానీ ఎవ్వరూ ఏనాడూ నోరు మెదప లేదు. పోలీసులు హెలెనీ అన్ననూ, ముగ్గురు అక్కల్నీ అరెస్టు చేశారు.



# దిగిరండి...దిగిరండి
# ధృతరాష్ట్రభువికి

చీకటి సందు దగ్గర నిలబడ్డాను. రిక్షా వచ్చింది.

"రిచ్చా కావాలేంటి బాబూ?"అన్నాడు 'రిక్షావాలా' వినయంగా.

"రిక్షా వద్దుగాని, ఏం తోచడంలేదు. ఎక్కడికన్నా తీసికెళ్తావా?"

రిక్షావాడు రిక్షా దిగాడు. సన్నగా నవ్వుతున్నాడు.

"ఎక్కడికెళ్దామంటారు?"

"నీకు తెలియాలి".

"మస్జీదుపూరు కాదా?"

"కాదు".

"అయితే కూకోండి. ఇయ్యాలే మురమండనించి కొత్తపిల్లొచ్చింది"

"ఎక్కడుంటోంది" నాకిష్టం లేక పోయినా ఉత్సుకతతో అడిగేను.

"ఎక్కడంటే ఏం తెలుసుద్ది మీకు? రండి నేను సూపిత్తా"

"పోలీసులు రారుకదా?"

"ఆళ్ళొచ్చేకాడికి తవర్ని తీసికెళ్తానా బాబూ?"

రిక్షా ఎక్కాను. ఆర్టీసీ పాసింజర్ బస్‌లా కాస్సేపు డాన్స్‌చేసి కదిలింది రిక్షా.

"ఈ రిక్షా నీ సొంతందేనా?" అని అడిగాను ఏదో ఒకటి మాట్లాడాలని.

"కాదండి. పాతూర్లో ఓ మారాజు వున్నాడు. అతనిచ్చాడు".

"అద్దెంత?"

"పగలైతే రెండున్నర. రోజంతా తీసుకుంటే నాలుగు".

"అతనికెన్ని రిక్షాలున్నాయేమిటి?"

"సాలా వున్నాయండి – అయినా అతగాడి రిచ్చాల లెక్క నాకెందుకండి?"

"నువ్వు సొంత రిక్షా కొనుక్కో లేదా?"

"ఏటి! సొంత రిచ్చాయా? బాబూ! తిండానికే కుండలు డింకీలు కొడు తున్నాయ్. మాకిక సొంతరిచ్చా ఒకటా?" అన్నాడు ఉస్సురంటూ!

"బ్యాంకులు అప్పులిస్తున్నాయి కదయ్యా?"

"ఇత్తున్నాయి. కానీ మా దగ్గర ఇంతుందని, ఏదో ఓటి సూపించాలంట! ఆ, ఏదో 'ఓ'టుంటే మాకీ కర్మేటి బాబూ?"

అక్కడేదో ఎత్తొచ్చింది. వాడు తొక్కలేక దిగాడు. నేనూ దిగాను.

"తమరెందుకు దిగటం? కూకోండి బాబూ లాక్కుపోతాను".

"ఫర్వాలేదు లేవయ్యా" అని వెనక నించి నేనూ రిక్షా తోశాను.

"ఇక కూకోండి బాబూ!"

రిక్షా ఎక్కాను.

"ఏమయ్యా! ఈ వూళ్ళో ఇలాంటి పిల్లలు ఎందరున్నారేమిటి?"

"నానేం సెప్పగలను బాబూ! నాకో పాతిక్కొంపలు తెల్సు. ఇంకా సాలా సాలా వున్నాయిగాని అయ్యి-ఛా! ఛా! వొద్దు!"

"అన్నీ ఇలాంటివేనా?"

"ఆఁ"

"దీనిమీదే బతుకుతారా?"

"బతుకుతారో సత్తారోగాని, ఇప్పుడీ యాపారం, బాగా లాబసాటి యాపారమై పోయింద బాబూ! ఈళ్ళని సూసి, సంసారోళ్ళు కూడా మొగుళ్ళకి తెలీకండా పైపేటుగా యాపారాలు పెట్టేశారు?"

"నిజంగానా?"విస్తుపోతూ అడిగాను.

"కావాలంటే సూపిత్తా"

"అయితే ఆ మురమండ పిల్లొద్దు. సంసారి కొంపకే పో. వాళ్ళదగ్గరయితే రోగాల భయం వుండదు".

"బాబోయ్! రోగాలు ఆళ్ళదగ్గరేనండీ ఎక్కువుంటాయి".

"మరి వాళ్ళ భర్తలకి తెలిసిపోదూ?"

"ఎల్లా తెలుసుద్ది? ఆడూ ఓ పుండాఖోర్ నాకొడుకే. తనే ఆ రోగం తగిలించుకొచ్చానేమోనని దొంగకి తేలుకుట్టినట్టు డాకటేర్లదగ్గరకి పోతుంటాడు!"

"మరి వాళ్ళు సంసార్లన్నావ్-వాళ్ళకిదేం బుద్ధి ?"

"సంసారోళ్ళయితే, ముండ దగ్గర కెళ్ళ గూడదని వుందేంటండీ ఎక్కడన్నా? ఇంట్లో కట్టుకున్న పెళ్లాం ముసల్దొత్తయి పోయిందని, కుర్రదాన్దగ్గరకు పోతారు. అదిఅప్పటికే ఎందర్నో ఆస్పటలుకు పంపించేసుంటాది. ఈడికి అయ్యేం తెలవ్వుగా? నవనవ లాడుతోందని ఎల్తాడు. అంతే! మర్నాడు డాకటేరు గది ముందు చెప్పాలేకా, బాధ పడాలేక, సావు బతుకుల మద్దెన వూగులాడ్తూ వుంటాడు"

"అవును! నాకు తెలీకడుగుతాను! సంసారులంటే ఎవరని నీ వుద్దేశం ?!

"సంసార్లంటే తెలవదేటండీ? లచ్చనంగా పెళ్లాడి, పెళ్లాం పిల్లల్తో కాపరం సేసే వోళ్ళు"

"వీళ్ళు సాధారణంగా ఏ వుద్యోగాలు చేస్తుంటారు ?"

"ఉద్దోగాల మాటే అడిగారూ? సవాలచ్చ ఉద్దోగాలు సేసే వోళ్ళున్నారు. ఏ వుద్దోగం లేకపోయినా, పదేసి తరాలు కాలుమీద కాలేసుకుని కూకుని తిన్నా తరగని డబ్బున్న వోళ్లున్నారు. గుమాస్తాలున్నారు. బడి పంతుళ్లున్నారు. కాలేజీ మేస్టేర్లున్నారు. మీర్నమ్మతారో నమ్మరోగాని బాబూ, డాకటేర్లూ, కోరుటు పీడర్లు కూడా ఎల్తా వుంటారండి!"

"పోలీసులు వెళ్తుంటారా ?"

"పోలీసులా? ఆళ్లు 'ఎప్పెస్' గేంగండి. లంజల్ని పట్టుకుంటావని సెప్పి గుడిసెల్లోకీ, ఇళ్ళలోకి దూరి, ఆళ్ళకుతి తీర్చుకుని ఆళ్ళ దగ్గర్నుంచే డబ్బు లాక్కుని పోతారండి."

"వీళ్ళనందర్నీ నువ్వు తీసికెళ్తుంటావా ?"

"తప్పదు కద బాబయ్యా! ఇలాంటి బేరాలు తగిల్తే, మామూలు కన్నా పావలా, అర్దా ఎక్కువే ముడతది. అందుకని మేం యిలాంటోళ్ళ కోసమే సూస్తా వుంటావండి."

"అంటే మామూలు మనుషులొస్తే కట్టరా ?"

"అమ్మమ్మ! ఎందుక్కట్టవండి? దాందారి దాందే! దీందారి దీందే!"

"అంటే ?"

"మామూలు మనుషులు, సాదార్నంగా పొగలే ఎక్కుతారండి. మొదటాట యిడిసి పెట్టే వరకూ ఆళ్లనే మోస్తామండి, అక్కణ్ణుంచి ఈ బేరాలు తగుల్తాయి."

"మీ రిక్షాల్లో మంత్రులెప్పుడన్నా ఎక్కారా ?"

"మంతురులెవరండి ?"

"మన్ని పాలిస్తున్నవాళ్ళు."

"అంటే మినిస్టర్లా? ఆళ్ళెందుకు రిచ్చా లెక్కుతారండి? ఎక్కినా, ఒకేల ఇలాంటి కొంపలకెందు కెల్తారు ?"

"అంటే మినిష్టర్లు వెళ్ళరంటావా ?"

"నాకేం తెలుసండి? నాకు తెలిసిం

దల్లా, యిదుగో మీలాటోళ్ళు, కాసో కూస్తో సదూకున్నోళ్ళూ, కాలేజీ కుఱ్ఱాళ్ళూ! కానండి బాబూ! ఈ కాలేజీ కుఱ్ఱాళ్లు మా మంచోళ్ళండి. పాపం! ఆళ్ళకేం యిలాంటి యిసయాలు తెలవ్వు కదా? అంతా కొత్త. బయం, అందుకని మమ్మల్నట్టుకుని, ఎంతడిగితే అంతా యిచ్చేత్తారండి. అయితే అందరు కుఱ్ఱాళ్ళూ అలాంటోళ్ళు కారండోయ్! కొందరు రవుడీ సన్నాసులుంటారు. అళ్ళు నిజంగా కాలేజీ కుఱ్ఱాళ్ళో, రవుడీ ఎదవలో తేల్చుకోలేం. రెండు మైళ్లు తొక్కి తీసికెళ్తే, అర్ధరూపాయి సేతిలో పడేస్తారు. అదేంటని మేం నిలేసి అడిగితే, పోలీసోళ్ళకి అప్పజెప్తామంటారు.

"ఒకసారిలాగే, ఒకడు నా రిచ్చా ఎక్కాడు. మద్దెలో మరోడు కలిసాడు. ఇద్దరూ సేవితులే లాగుంది. ఇంగిలీసులో గడగడా ఏదేదో మాటాడేసుకుంటున్నారు. నేను ఓ యింటికి తీసికెళ్ళి ఆపాను. అళ్ళు రిచ్చా డబ్బు లివ్వకుండా వెల్లిపోతుంటే 'బాబూ డబ్బులు' అని ఎనకాలెల్లి అడిగాను. అంతేనండి నేను అడిగింది. అందులో ఒకడు మొల్లోంచి కత్తి తీసి పొడిసి పారిపోయాడు. నాకు బూమ్మీద నూక లుండి పోయి బతికి పోయానుగాని, నేనే ఆ చెణంలో సచ్చుంటే, నా కుటుంవఁవంతా రోడ్డున పడి అడుక్కే తినేదో, లేక ఈ ఎదవ బతుక్కే దిగిపోయేదో! ఎవర్నీ నమ్మలేం బాబూ! రోజులు మారిపోతున్నాయి. మేం పొట్ట కూటికే కదా ఈ ఎదవ పన్లకి దిగింది? ఆళ్లు వొళ్ల తీట తీరడానికి ఎల్తారు. మరి ఎందుకిలాగ మమ్మల్ని ఏడిపిస్తారో అర్ధం కాదు. మా బతుకులింతేనేమో బాబు! మల్లీ ఏ దేవుడో కలికావతారమెత్తి, ఈ పురుగులన్నిట్నీ నాసనం సేసేస్తే తప్ప, మనుసులకి యిముక్తి లేదు."

నా నోట మాట రేదు.

"ఇంటున్నారా బాబూ?"

"ఆఁ చెప్పు"

"ఇందాక సంసార్లు గురించి అడిగారు కదా బాబూ! ఆళ్లు రేత్రిళ్లు ఈ ఏపారం సెయ్యరండి!"

"ఏం?"

"ఇంట్లో మొగుడుంటాడు. పిల్లాపిచికా వుంటారు. ఊసులాడ్డాని కొచ్చే అమ్మలక్క లుంటారు. ఎంతయినా లంజెరికఁవంటే బయవేఁ కదా? ఒకేల మొగుడికి తెల్సి పోయిందనుకోండి — అడు ఎదవైతే, బాగా నాలుగు దొల్చేసి, మల్లా ఏలుకుంటాడు. కొంచెం సిగ్గూ సెరవూఁ వున్న వోడైతే, వాత లెట్టేసి, బయటికి తగిలేస్తాడు. లేదూ అడు దీనడబ్బు మీదే బతికేవోడైతే. సూసి సూణ్నట్టు పోతాడు. ఇంకా సవట్నాకొడుకైతే, ఆడే బేరాలు తెస్తావుంటాడు— ఇరుగు పొరుగోళ్ళకి తెలవకుండా. ఎవరైనా తప్పేజారి సూసినా, ఆ వచ్చినోడు దాని అన్ననో, బాబనో సెప్పేసి బయట మంచవేఁసుకు తొంగుంటాడు! ఈళ్ళు బతకలేక రోజూ సచ్చే నా కొడుకులండీ! కాని బాగా బతికే వోళ్ళ ఆడోళ్ళు కూడా ఈ లయన్లోకి దిగిపోతున్నారండీ."

"ఎందుకంటావ్?"

"ఒంట్లోగులు; సోకులు; సినిమాలు. నాకు తెల్సిన ఓ మారాజుండే వోడండీ! ఆ మార్రాజు, ఏదో పెద్దుద్దోగవేఁ సేసే




పోడు. పెల్లాం కూడా మంచి కుటుంబం నించే వొచ్చింది. మరి దానికేం పాడు రోగం వచ్చిందో, రోజూ మద్దేనప్పూట, ఎవరింటికో ఎల్తున్నానని వొంకెట్టి, ఎక్కడో, ఎవడ్తోనో తొంగొని వచ్చేది."

"బహుశః ప్రేమించిన వాడేమో ?"

"ప్రేవా(! వొల్లకాడా ? అంత ప్రేవు(న్నదైతే ఆడ్తో లేచిపోవాలి. కాని ఈ మారాజుని మోసం సెయ్యడమేంటి? అది పేవ( కాదండి. డబ్బు కక్కుర్తి. రోజుకో యాభై రూపాయాలు గల్లిన సంపాయించు కొచ్చేది. ఆ మారాజు నెలకి ఆరొంద లిచ్చేవోడట జీతం."

"ఇంత డబ్బూ ఆవిడేం చేసేది?"

"సెప్పాను కదు బాబూ సోకులు. అయ్యేయో యిదేశాల సెంట్లట. రేడియో లట. టేపులట. ఐదేసి వందలు కరీదు చేసే సీరలు, వొంటినిండా నగలు, రోజూ ఒక సినిమాకి - పెద్ద టిక్కటు కెళ్ళేది. అసలీ సినిమాలొచ్చి ఈ ఆడోళ్ళని సాలా పాడుజేస్సాయి బా బూ-మీరేవంటే అనండిగాని."

"సరే! ఇన్ని విషయాలు చెప్పావ్. మరి నన్ను ఎవర్దగ్గరికి వెళ్ళొద్దంటావా?"

"రామ రామ! నే నెందుకంటానండి! ఎవరి సర్దా ఆళ్ళది! కాని సంసారాడోళ్ళు సెడిపోతున్నా రంటేనే బాధగా వుంటాంది. కూటికి లేంది పసుసుకుందంటే ఓ మాట ! అందులో ఎంత పాపవు(న్నా, నాయమే వుందనాలి. కాని అన్నీ వుండి, లచ్చనమై(న సంసార వుండి, ఈ పన్లేంటి బాబూ!ఆ(! ఇందాక ఆ మారాజు సంగతి: ఆ యమ్మ అలాగ ఎల్లి డబ్బులు తెచ్చుకునేది గదా ! రంకుతనం, దొంగ తనం ఎంతకాలం దాగుద్ది ? మూతేస్తే పడుండడానికి యి దేవ న్నా సిన్న యిసయవా( సిటకదా ? ఆ యమ్మ బాగోతం, ఈ నోటా ఆ నోటా పడి, సివరికి ఆ మారాజుకి తెల్సిపోయింది. నిజవో( కాదో అని, సిగా ఏసి సూసు కున్నాడు ! నిజం తేలిపోయింది. 'సీ' అనుకున్నాడు. 'ఇలాంటి జెస్టదాంతో సంసారవేం'టని తన్నలుగురి పిల్లలకీ యిసవెట్టి సంపేసి, తనూ ఆకర్ని యిసం తిని పోయాడు."

"మరి ఆవిడ ?"

"ఆవిడకేం ? మారాణి, ఈ పూర్నిం చెల్లిపోయి, ఎక్కడో మళ్ళీ పాత కద మొదలెట్టిందట. అల్లా యిన్నానుగాని నే నేవ(న్నా ఎల్లి సూడగల్నా? అడగ్గల్నా ?"

"నాకో చిన్న అనుమానం..."

"ఏటి బాబూ?"

"అసలు ఈ సంసార స్త్రీలు యిలా ఈ లైన్లో, ఎలా పడి చిక్కుకుంటున్నా రంటావ్ ?"

"అబ్బో సాలా పెద్ద కతే అది. ఎవర్తో ముందు, ఎలాగో, ఇది రుచి మరిగుంటాది. దానాపారం అది చేసు కుంటూ వుంటాది. అయితే కాలం వూరు కోదుగా ? మనిసి బిగువు, వొంపూ సొంపూ ఎంతకాలం వుంటాయి ? అయ్యి సడిలిపోతున్నాయని తెలుసుకుంటారు ! మెల్లగా ఈ పక్కింటోళ్ళనీ, ఆ పక్కింటోళ్ళనీ, ఆ ఈదిలో వాళ్ళనీ, ఈ ఈదిలోవాళ్ళనీ, మా టల్తో కదిపి సూస్తాది. పడే రకాలుంటాయనుకోండి-ఆళ్ళని మద్దేనపేళ, మొగుళ్ళుందరుగా-అప్పుడు దానింటికి తీసికెళ్తాది. అక్కడికి దానికి తెలిసిన పాత నాకొడుకులు

వొస్తారు. ఆళ్ళకి మెల్లగా, ఈళ్ళని తగి లించేస్తాది! అళ్ళు యిచ్చే డబ్బులో సగం పైనే అది తీసుకుని, ఒకటీ, రెండూ ఈ పిల్లదాని సేతిలో పెట్టి, పంపించేస్తాది. ఇలాగండీ సంసారపోళ్ళు నాసనవైఁ పోతున్నారు! ఇది ఒకసార్తో ఆగిపోయే వొరదకాదు. ఆ పిల్లలు కాస్త కళ్ళు తెరిసి, 'సగం దానికెందుకియ్యాలని, సాయంగానే రగస్యంగా సొంత యాపారం పెట్టుకుంటారు. ఆళ్ళ వొళ్ళు సడిలిపోతోందని ఆళ్ళ కనిపించిందను కోండి, అప్పుడాళ్ళు - దాని గురువమ్మ చేసినట్టు, యిరుగు పొరుగువాళ్ళని లైలుగా లాక్కుపోతారండి. ఇదండీ లోకం! ఇది ఆగదండి బాబయ్యా! మల్లా ఆ దేవుడే కలికావతారం ఎత్తాలి."

"మరి పోలీసులకి ఈ విషయాలు తెలీవా?" అన్నాను.

"ఎందుకు తెలవ్వు? పోలీసోళ్ళకి తెలుసు, డాకటేర్లకి తెలుసు, పీదర్లకి తెలుసు, జెడిజీలకి తెలుసు. ఇందాక మీరన్నారే మినిస్టర్లు, ఆళ్ళకీ తెలుసు. కాని ఆళ్ళేం సెయ్యగలరు? 'ఇలాంటి ఎదవపన్లు జరక్కుండా సూడండ్రా' అని ఈళ్ళందర్నీ ఉద్దోగాల్లో పెడితే, ఈళ్ళే గడ్డి తింటావుంటే, ఆళ్ళేం సెయ్యగలరు?"

"అవునూ నీ పేరేమిటన్నావ్?"

"ఏవఁన్లేదే?"

"ఏం పేరు?"

"గురువులండి."

"చూడు గురువులూ! ఆడపిల్లల్ని పై వూళ్ళనించి తీసుకొచ్చి యిక్కడ వ్యభిచారగృహాల్లో అమ్మేస్తుంటారట. నిజమా?

"నిజవాఁ నిజవున్నర?"

"ఎలాఁ అమ్మతారయ్యా?"

"అబ్బో! అయ్యా ఓ పెద్ద కత ల్లెండి."

"నీకు తెలుసా?"

"తెలుసా ఏంటండీ? నా యింట్లోనే జరిగింది."

"నీ యింట్లోనా? ఎలా? ఎప్పుడు?" విస్తుపోతూ అడిగాను.

"సాన్నాళ్ళకితం లెండి. సెప్పు కుంటే సిగ్గుకూడా! అయినా యిప్పుడు సెప్పుకున్నా పర్వాలేదనుకోండి."

"ఏం?"

"అల్లాగ సేసినందుకు నాకు అయి దేళ్ళ సిక్స పడింది."

"నువ్వే చేశావా ఆ పని?"

"కాదు. ఎవడో ఎదవ! ఆ ఏడా తర్వాత దొరికాడు. దొరికినోణ్ణి దొరికి నట్టే రిచ్చా చైనెట్టి బాది బాది సంపి పారేశాను. అలా నేను సెయ్యకూడదట! అందుకని వురి సిక్సెయ్యబోయి, జెర్జి గారు అయిదేళ్ళు ఏసి వొదిలేశారు."

"నీకు అభ్యంతరం లేకపోతే చెప్ప గలవా ఇదెలా జరిగిందో?"

"అబ్బెంతర వేవుందండి? ఇన్ని సెప్పినోణ్ణి అది సెప్పలేనూ? అయినా కుక్కల్లాగా, పందుల్లాగా బతికే జాతి మాది. సిగ్గూ సెరవూఁ లేనోళ్ళం, సెప్పు కున్నా సిగ్గుపడం. సెప్పకపోయినా పడం. కాని బాబూ! మేం ఎంత పందులం కుక్కలమైనా మాలో పందుల రకతం, కుక్కల రకతం లేదండి. మనిసి రక తమే వుంది. అది ఏడెక్కిందంటే, ఒకణ్ణి కాదు, లచ్చల మందిని నిలువునా సంపేసి సవ్వగల్లు! సెప్తానుండండి" అని రిషా




ఆపి షోడాకొట్టు దగ్గర కెళ్ళాడు.

అక్కడ ఏదో డబ్బులు వాడికిచ్చి చీటీ రాయించుకుని వచ్చాడు.

"ఏమిటది ?"

"బ్రేకెట్టు బాబూ !"

."ఎందుకు ?"

"ఆఁ. ఏవోఁ తగిలిందనుకోండి. రేపు ఎనిమిది రూపాయలొస్తాయి."

"అంటే?"

"ఈ బ్రేకెట్టాట గురించి మీకు తెల్దా!" అని 'మీరింకేం రంతు చెయ్య గల్రు?' అన్నట్టు చూశాడు!

"విన్నాను గాని, ఎలా ఆడతారో ఏవిఁటో సరిగా తెలీదు"

"తెలుసుకోవొద్దు లెండి ఇదీ మీకు అలవాటయిందా, క్లోజింగే."

"అంటే?"

"లంజరికం ఓపినింగయితే, బ్రేకెట్టాట క్లోజింగు. ఇక్కడ గుడిసేటి యాపారం తరవాత, లాబసాటి యాపారం యిదే లచ్చలమంది లచ్చాదికార్లు బిచ్చాది కార్లయి పోయారు! బిచ్చాలెత్తుకునేవోళ్ళు, మరింత బిచ్చా లెత్తు కుంటున్నారు."

"మరింత మంది ఇన్ని లక్షలు పోగొట్టు కుంటున్నారు కదా ! ఈ డబ్బంతా ఎక్కడికో ఒక చోటికి వెళ్తూ వుండాలిగా!"

"ఏమో ! అదెక్కడి కెల్తాదో మాకు తెలవదుగానీ, ఈ వూళ్ళో యిలాంటి కంపెనీలు నాకు తెలిసి ఏభై వరకూ వున్నాయి. ఈ యాభై మందీ మేళ్ళు కట్టుకున్నారు, కార్లు కొనుక్కున్నారు; లాంచీలు తిప్పుతున్నారు. కొందరు పెద్ద పెద్ద ఒట్టేళ్ళు కట్టు కుంటున్నారు."

"అదంతా మీరిచ్చే సొమ్మే కదూ?"

"అవునండి."

"నీ కెప్పుడైనా బ్రాకెట్ తగిలిందా?"

"నాలుగుసార్లు వొచ్చిందండి."

"ఎంతెంత?"

"ఎంతొస్తాదండి? ఒకసారి పదహారు; ఒకసారి ఎనిమిది; మరోసారి; ఎనిమిది; మరోసారి ఇరవై."

"ఎన్నాళ్ళ నుంచీ ఆడుతున్నావ్?"

"నాకు వూగా తెల్సిం దగ్గర్నుంచండి మీుప్పై నలభై ఏళ్ళ అనుకుంటా."

"రోజు కెంతాడతావ్ ?"

"అద్దానికి డబ్బేందండి? అర్థ పావలా."

"అంటే ఈ నలభై ఏళ్ళల్లో దాదాపు ఏడెనిమిది వేలు తగలేశావన్న మాట."

"అదేలా? ఎలాగవుద్దండి?"

"లెఖ్ఖవెయ్. నీకే తెలుస్తుంది అది సరే ఈ బ్రాకెట్లు కూడా అందరూ ఆడ తారా?"

"ఓ! ఆడోళ్ళు కూడా ఆడతారండి, ఇప్పుడు లాట్రీ లొచ్చాయి-దానికి అంతా ఎగబడ్తున్నారండి."

"పోలీసులు పట్టుకోరూ?"

"ఆళ్ళకి మామ్మూళ్ళుంటా యండి."

క్షణం ఆగాను.

"ఇందాక అమ్మాయిల అమ్మకం గురించి చెప్తూ ఆపేశావ్. అదేవిఁటి ?"

"అది మరీ గోరవండి. ఎవడో ఒక ఎదవో, ఎదవనంజో వుంటారండి. ఆళ్ళ ఇందాక చెప్పలేదూ? అల్లాగే ఇరుగు పొరుగు పిల్లల్నీ, వూళ్ళో కూస్తంత ఎర్రగా బుర్రగా వున్న పిల్లల్నీ సేవిఁతం చేసుకుంటారండి. ఆళ్ళని సినిమాలకనీ, ఈట్లికనీ, ఆట్లికనీ తిప్పితిప్పి, తర్వాత ఏదో వూరు తీసుకు పోతారండి. మా

చెల్లెల్ని అలాగే ఒక నాకొడుకు, బుట్లో ఏసి, దానికి ఎర సూపించి, తీసుకు పోయాడండి."

"మీతో ఆ అమ్మాయేం చెప్పలేదా?"

"ఎల్లాగ సెప్తారండి? ఆడేమో ఐదరాబాదు సూపిస్తానూ, బొంబాయి సూపిస్తానూ, కలకత్తా సూపిస్తానూ, అని మాయచేసి, ఎవరికన్నా తెలిస్తే ఎల్లనియ్యరని సెప్పి, తీసుకుపోయాడండి. సివరికి దాన్ని ఇసాకపట్నంలో, ఓ లంజల కొంపకి ఐదొందల కమ్మేసి ఎటో పోయాడండి, మా సెల్లెలికి కొద్దిగా ఓనమాలొచ్చు. అది మరి కారుడు ముక్క ఎలా సంపాయించిందో, దాని బాదంతా రాసి, ఒరే అన్నా! తప్పయి పోయిందరా! మోసంచేస్సాడు ఆ తలుపులు సవాదిగాడు! నన్ను తీసుకొచ్చి ఓ కొంపలో ఐదొందల కమ్మేసి ఎటో పోనాడు. నేనిక్కణ్ణుంచి తప్పించుకు రావాలంటే, సుట్టూ రవుడీ ఎదవలు కాపలా వుంటారు! నన్ను ఈ పాడు పన్లోకి దించేసారు. నా వొళ్ళంతా గుల్లయిపోయింది. నువ్వెలాగన్నా వొచ్చి నన్నిడిపించుకు పోరా'- అని ఆ రంకు ముండ ఎడ్రసు కూడా రాసింది అందులో. నాకేం సెయ్యాలో

తోసలేదు. ఎలాగో ముప్పయి రూపాయలు కూడా బెట్టుకుని, ఇసాకపట్నం ఎల్లాను. ఎల్లి తిన్నగా దానింటి కెల్లాను. నన్ను చూడగానే నా చెల్లెలు బావురుమంటూ ఏడ్చింది. నేను ఆ 'అమ్మని' కాళ్ళా ఏళ్ళా పడి బతిమాలాను. 'చట్! ససేమి(రా దాన్ని యివ్వ' నంది. 'ఆ అయిదొందలూ యిచ్చేసి కావాలంటే తీసుకుపో' అంది. అయిదొందలు ఎక్కణ్ణుంచి తేగల్ను బాబయ్యా? అదొక్కత్తే అయితే, నంజని చితక బాదేసి, నా సెల్లెల్ని యిడిపించుకొచ్చేసి వుండే వాణ్ణి. అక్కడ అయిదుగురు రవుడీ నా కొడుకులున్నారు. అయినా దైర్యంచేసి ఆళ్ళతోతగూలాటకి దిగి, ఆళ్ళని నాలుగు తన్ని, ఆళ్ళసేత వందదెబ్బలు తిన్నాను. నన్ను గొడ్డుని బాదినట్టు ఆళ్ళు బాదేస్తావుంటే, నా సెల్లెలు గుండె కరిగి పోయినట్టు ఏడ్సింది. దాన్నొకడు లోపలికి లాక్కుపోయి చిదగ బాదాడు. నా వళ్ళంతా నెత్తురు మయం అయిపోయింది. నన్నీడ్చేసి రోడ్డు/ కవతల దూరంగా పారేశారు,

"మరి నువ్వు పోలీసులకి వెళ్ళి చెప్ప లేక పోయావా?"

"సరి సరి! రామాయనమంత యిని రావుడికి సీతేవవుద్దంటున్నారా బాబూ? ఈ పోలీసోళ్ళూ, ఆ ఎదవలంజ, రవుడీలు ఒకటే! అళ్ళని ఈళ్ళు, నెలకింతని యిచ్చి మేపుతుంటారు! ఆళ్లెందు కొచ్చి పట్టుకుంటారు బాబూ?"

"పోనీ మీ చెల్లెలే కొంత డబ్బు కూడబెట్టి తీర్చేసుకో వచ్చుగా?"

"బాబూ! దీన్లో పెద్ద కిటుకుంది. మా చెల్లెలే కాదు, ఆ లంజ కొంపలో పదిమంది ఆడోళ్ళున్నారు. ఆళ్ళంతా అల్లాగ అమ్ముడై పోయినోళ్ళేనట. ఆళ్ళు రోజూ-అర్ధా, పావలా, రూపాయి కూడబెట్టి, పెద్ద ముండకి యిచ్చే సరికి, పోలీసోళ్ళు ఆ కొంప మీదికి దాడి చేస్తారు. ఆ దాడి కూడా ఈ రవుడీ నా కొడుకులే సేయిస్తారు. దాన్లో, అందర్నీ పోలీసు టేసెన్ కి తీసుకుపోయి, మర్నాడు కోర్టులో నిలబెడ్తారు. జర్జీగారు ఆళ్ళని యిచారించరు ఏం చెయ్యరు. ఇనిపించుకోరు. 'నువ్వీపని చేసినావా' అనడుగుతారంట. 'అవు'నని ఈళ్ళొప్పుకోవాలి. ఒప్పుకోగానే పాతికో, యాభయ్యో జులమానా ఏసేస్తారు, అది ఆ పెద్ద ముండ తీర్చుదే. మళ్ళీ ఈళ్ళే ఈ ఎదవపని చేసి తీర్చాలి. సరిగ్గా తీరిపోతున్నటయానికి మళ్ళీ పోలీసు లొస్తారు. మళ్ళీ అందర్నీ బొక్కలో తోస్తారు. మళ్లీ కోరుటు, జర్జీగారు 'అపన్చేశావా!' అనడగడం 'చేశా'నంటే పాతికా ఏభై, 'లేదండీ' అని ఏవన్నా సెప్పుకోబోతే జులమానాఎచ్చించేత్తారట! ఈ జరిమానా బాద పళ్ళేకే 'సేసాం' అని బోనెక్కి ఎక్కగానే వొప్పేసుకుంటారట. మళ్లా ఆ డబ్బు సెల్లించేసి, కొంపకొచ్చి, మళ్లా ఆ రంకు పన్లోనే పడతారు. బాబయ్యా! నాకు తెలీకడుగుతాను: ఈ కోరుటుల్లో, జెర్జీలు నాయం సెప్తారని కూకుంటారు కదా, అళ్ళు, ఈళ్ళ మాట్లెందుకు ఇనిపించుకోరండి? ఎందుకు అసలు సంగ తెలుసుకోరూ? ఎందుకిలాంటి అన్నాయప్పన్లు జరుగుతున్నాయని ఆలోసించరు?" అని అడిగాడు.

"వాళ్ళకి టైమెక్కడుంటుందయ్యా రోజుకిలాంటి కేసులు వందలకి వందలు చూడాలి. అదీగాక జడ్జీలంటే మామూలుగా మీరనుకునేంత వెర్రివాళ్ళుకారు. ఎదుటి మనిషిని చూసి, వాడెలాంటి వాడో, ఏం చెయ్యగలడో, చేస్తాడో, చేసుంటాడో క్షణంలో గ్రహించగల మనస్తత్వవేత్తలు. అందుకని ఎవరు బోన్లో నిలబడ్డా నేరం వాళ్ళ ముఖాల్లో స్పష్టంగా తెలిసిపోతూ వుంటుంది. వాళ్ళని విచారించి కాలం వృధాచెయ్యరు. ఇంకా వెనక సవాలక్ష కేసులుంటాయి కదా, వాటిని చూస్తారు వెంటనే.

"కాని బాబయ్యా! నాదో సిన్న అనుమానం! నా సెల్లెలు కావాలని ఆ గోతిలోదిగలేదు. ఒక ఎదవ నా కొడుకు మోసం వల్ల అదలాగ అయిపోయింది! మరి ఆ మోసం సేసిన ఎదవని' ఎందుకు కోరుటికి పిల్సిసిచ్చించరు?"

"అది వేరే విషయం అవుతుంది గురువులూ! మీ చెల్లెల్నో, మరొకర్నో ఎవర్నో — ఈ నేరం చేశారని పోలీసులు పట్టుకుని కేసు పెట్టారు. వాళ్ళు పెట్టిన కేసుకే తీర్మానం యిస్తారు కాని, ఆ పిల్లల్ని ఈ పాడు పన్లోకి దించిన వాళ్ళని విచారించరు."

"ఎందుకంటారు?"

"వాళ్ళని పోలీసులు పట్టుకోలేదుగా"

"కాని, ఆడేగా ఈ తప్పుడు పన్లన్నిటికీ మూలం?"

"అప్పుడు, వాణ్ణే నేరుగా ఎవరో ఒకరు తీసుకొచ్చి, పోలీసులకి అప్పగించాలి. లేదా వాడిమీద కేసుపెట్టాలి."

"అలాగ పెట్టాలంటే సాచ్చికాలా అవీ గావాలిగా ?"

"మరదే కిటుకు. నిజం ఏమిటో తెలుసా గురువులూ! ఇలాంటి తప్పుడు వ్యాపారాలు చేసే వాళ్ళు మామూలు వాళ్ళు కారు. నువ్వూ నేనూ ఆ పనులు చెయ్యగలమా ? లేం. ఎందుకు ? భయం. పాపభీతి. అదీగాక నలుగుర్లో పరువు పోతుందని భయం. ఇందాక నువ్వో సంఘటన చెప్పావ్ చూశావూ ? ఆ మారాజు ఎందుకు తన్నలుగురి పిల్లలకీ విషమిచ్చేసి, తనూ చచ్చిపోయాడు ? పరువు పోయిందని! నలుగురూ నానా మాటలూ అంటారని. కాని ఈ వ్యాపారాలు చేసేవాళ్ళు వీటన్నిటికీ అతీతులు. నీతి, నియమం, జాలి, దయ, భయం, పాపభీతి లేని కసాయిలు."

"అయితే అళ్ళు రాచ్చసుల్లాంటోళ్ళంటారు"

"పుట్టగానే ఎవరూ రాక్షసులుగా పుట్టరు-అని ఇంతకు ముందు అనుకునేవారు. కానీ ఈ మధ్య చాలామంది డాక్టర్లు పరిశోధనలు చేసి - ఇలాంటి రాక్షస బీజాలు పుట్టుకలోనే కొద్దిగా వుంటాయని ఋజుచేస్తున్నారట. అయితే వాళ్ళని మంచి వాళ్ళుగా మార్చెయ్యడానికి కూడా వీలుందంటున్నారు."

"మరి అల్లాగెందుకు సెయ్యటంలేదు ?"

"ఎవరు చెయ్యాలంటావ్ ?"

"అలాగని అన్న డాకటేర్లే"

"వాళ్ళెందుకు చేస్తారు ?"

"ఎందుకు సెయ్యకూడదు బాబయ్యో ఇన్ని అన్నాయాలు జరుగుతూంటే?"

"అన్యాయాలు ఏక్కడలేవు ? అన్యాయాలు జరుగుతున్నట్టు జడ్జీలకూ, లాయర్లకూ తెలీదంటావా? మరి వాళ్ళెందుకు ఆ అన్యాయాలని రూపుమాపడానికి పూనుకోవటంలేదు ?"

"ఇందాకన్నారు గదా - అది అళ్ళ పని కాదని."

"అవును. ఇదీ వాళ్ళ పనిగా ఎవరూ కేటాయించ లేదు."

"ఎవరు కేటాయిస్తారైతే ?"

"మీరే!"

"మేవా?"

"ఆఁ"

"ఎల్లాగ బాబూ ?"

"మీరు అయిదేళ్ళకోసారి ఎన్నికల్లో ఒకాయన్ని ఎన్నుకుంటున్నారా ?"

"అవును."

"వాళ్ళు ఎన్నికయ్యాక, ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తారు. చేసిన ప్రభుత్వమే, యిలాంటి అన్యాయాలన్నిటినీ చూసి నిర్మించాలి"

"పబుత్వం ఎక్కడుంటాదో మాకేం తెల్సు బాబయ్యా ? ఐదరాబాదులోనో, ఢిల్లీలోనే వుంటాదంటారు. అంతదూరం నించి వచ్చి, అళ్ళు యిలాంటి లంజల్ని, దొంగ నాకొడుకుల్ని బాగు సెయ్యగలరా ? కష్టం కదూ ?"

"అందుకే చిన్న చిన్న భాగాలుగా పాలనా యంత్రాంగాన్ని విడగొట్టి, ఒక్కో అధికారిని నియమించారు, వాళ్ళు చూస్తూవుండాలి ఇవ్వన్నీ"

"సాల్నాలు! కంసెలే సేనుల్ని మేసేస్తుంటే, యిక ఈ శ్శె క్క్డ యిలాంటాటిల్ని బాగుసేత్తారు బాబూ?"

"బాగు చెయ్యమని మీరంతా అడగాలి."

"బాగుంది. అడిగితే డొక్కలో తంతారు. అసలు ఏ బాబుని అడగాలో, మాకు తెలిస్తే కదా, ఆ బాబు దగ్గర కెళ్ళి యిచ్యి సెప్పుకోడానికి?"

"పోనీ పార్టీలన్నమాట ఎప్పుడన్నా విన్నావా?"

"ఏ పారిటీలు బాబూ?"

"కాంగ్రెసూ, కమ్యూనిస్టు. జనతా.."

"అఁ అఁ ఇన్నాను. ఆళ్ళందర్తో సెప్పుకోవాలా?"

"అందర్తోనూ అవసరం లేదు. ప్రభుత్వాన్ని కాంగ్రెస్ నడిపిస్తుందనుకో. వాళ్ళకి ప్రతి పక్షమని ఓ పార్టీవుంటుంది. వాళ్ళతో చెప్పండి; లేదూ, మీ వూరి ఎమ్మెల్యేగారు మంచివారని మీరనుకుంటే వెళ్ళి మీ కష్టాలు చెప్పుకోండి. ఆయన ప్రభుత్వాన్ని నడిపే పార్టీకి సంబంధించిన వాడైనా సరే".

"బాబూ! తమరీమాటంటూంటే నాకో యిసయం గుర్తుకొస్తోంది. నిజంగా జరిగిందిది.

"మేం మనుసుల రకతాలతో పుట్టినా—పందుల్లాగా బతుకుతున్నావఁని సెప్పాను గదా?

మాకు యిళ్ళులేవు.

కొంపా గోడూ లేదు.

నీలవ నీడ వుండదు.

అందుకని ఎండలో ఎండి, వానలో తడిసి, సలికి వొణుకుతూ సెట్లకింద బతకలేంకదా?

పందులకాయిద్దె సేతనవుతుందేవోఁ గాని, పందుల్లాటోళ్ళం, మేం అల్లాగ బతకలేక, వూరు సివర పోరంబోకు బూవుంటే, అక్కడ కొందరం పాకలేసుకున్నాం.

అది మా అయ్యలకాలంలో మాట్లెండి. ఇప్పుడది పెద్ద గుడిసెల పేటైపోయింది. అన్ని గుడిసెలు లేవగానే, పెద్దోళ్ళొచ్చి పన్నులు కట్టమన్నారు. సరే అని కడుతున్నాం.

ఆ పేటని తవఁరు సూత్తే, కూస్సంత సదువు సేర్చుకున్న పందులు బతికే పేట్లాగ వుంటాది.

కుళ్ళి కాలవలూ, దోవఁలూ, దొమ్లూ, కుక్కలూ, గాడిదలూ, పందులూ అన్నీ కలిసిమెలిసే బతుకుతాయి. అయ్యన్నీ మా ఆస్తులేలెండి.

ఆమద్దెన ఓ మారాజొచ్చి, ఏదో మీటింగెట్టి 'మీరూ మనసులే! మరెందుకు ఇలా దరిద్రంగా బతకా'లన్నాడు.

'అది మా తల్రాత, మా కర్మ. ఎనక జలమలో ఏదో పాపాలు సేసుంటాం అందుకే యిలాగే పుట్టాం' అనుకున్నాం.

ఓసారి ఓ అరిదాసుగారు, ఏదో అరికదసెప్తూ యిదే ముక్కసెప్పారు.

'ఈ జలమలో ఎవఁన్నా పాపాలు సేసుకుంటే, పైన యమదరమరాజు దగ్గరున్న సిత్రగుపుతుడు అయ్యన్నీ రాసుకుని, మనిసి సావగానే, అణ్ణి నూన్లో ఏగించేత్తాడట. రంపాల్తో కోయిస్తాడంట కత్తుల్తో, బల్లాల్తో పొడిపించేస్తాడట.

అలాంటి సిచ్చ ఏసాక, ఇక్కడైతే నీ సిక్సాకాలం తీరిపోయింది పోరా ఎదవా అని తోలేస్తారు.

కానీ, అక్కడ అంతలాగా సావ సంపినా, ఆ సిత్రగుపుతుడికి కసి





తీరదులాగుంది. మమ్మల్ని యిలాగ పుట్టించి, యింకా యింకా ఏడిపిస్తాడట. ఆ అరికత యిన్నవోళ్ళంతా నిజంగానే ఏడిసేసారండి.

ఆ అరికతకి వొచ్చినోళ్ళు ఎవరనుకున్నారు ?

అన్ని రకాలోళ్ళూ వున్నారు.

జేబుదొంగలూ,

పడుసుకునేవోళ్ళూ,

వడ్డీలు తీసుకునేవోళ్ళూ,

పెంచలేక బిడ్డల్నమ్ముకునేవోళ్ళూ,

అమ్మలేక పడుసుకుని, రెండురాళ్ళు రేతిరికి రేతిరి సంపాయించునేవోరూ,

అంతా యిన్నారు.

ఇని ఏడిసేసారు.

మళ్ళా పొద్దుపొడిసింది.

అరికత యిన్నవోళ్ళే, మళ్ళీ ఎవరి పన్లాళ్ళు సేసుకునేవారు.

జేబులు కొట్టేవోళ్ళు,

వూళ్ళోకి పోయేవోరు,

పడుసుకునేవోళ్ళు,

కాలవొడ్డున పాకల్లో చేరేవోరూనూ.

బిడ్డలకి పాలివ్వలేనివోళ్ళు అమ్ముకోడమో, రైలుబండ్లో వొదిలెయ్యడవో సేసేవోరు.

ఇయ్యన్నీ సేసి, దేవుడికి దణ్ణం ఒకటి పెట్టుకునేవోరు...

సరే పిడకల్లో రావాయణం ఏట సెపుతున్నట్టున్నాను. ఇనండి:

ఆ మారాజు ఏమన్నాడో తెలుసా?

'సోదర సోదరీమనులారా!'అన్నారు.

అంత పెద్ద మారాజు,

అంత పెద్ద బంగళాలో వున్న బాబయ్య,

నాలుగు సినిమాఆళ్ళు కట్టిన లచ్చాది కారి,

అంత పెద్ద కారులో వొచ్చిన దర మాతుముడు,

అంత ఖరీదైన సిలుకు లాల్చీ ఏసిన పెద్దోరు,

మమ్మల్నందర్నీ 'సోదర సోదరీ మన్లారా' అనగానే సప్పట్లు కొట్టేసాం.

ఆ బాబు అలాగ మమ్మల్ని 'సోదర సోదరీమన్లారా' అన్నందుకు కాదు !

అంతటి మారాజు మమ్మల్ని తన అన్నదమ్ముల్లాగా, అప్పసెల్లెళ్ళుగా సేసుకున్నందుకు...

ఆయన తర్వాత పెద్ద లెచ్చరిచ్చాడు:

దేసానికి సొరాజ్జం వొచ్చి ఎంతకాలమయిందో తెల్సా? సాలా కాలవయింది.

తెల్లోళ్ళని తగిలేసి మన రాజ్జం మనం ఏలుతున్నాం.

కానీ ఏలుతున్నదెవరు ?

అడుగో ఆ పక్కూర్లో వున్న కిరాతోడు.

ఆడు ఎప్పుడన్నా యిటొచ్చి, మిమ్మల్ని 'ఏవర్రా మీరంతా, ఎల్లాగున్నారు? ఎల్లాగ బతుకున్నారు? ఎల్లాగ తింటున్నారు?ఎల్లాగ తొంగుంటున్నారు?' అని అడిగిన పాపాన పోయాడా ?

అని అడిగాడు.

మేవంతా గొల్లున 'లేదు బాబయ్యా! లేదు, ఒక్కసారీ రాలేదు' అనరిచాం.

ఆ మారాజు ఎనగొచ్చినోళ్ళు నిస్సబదం నిస్సబదం అంటూ అరిసారు.

ఆ బాబుగోరు మళ్ళీ సెప్పారు.

'ఇప్పుడు నేనున్నాను. ఎందుకున్నాను ?

మీరున్నారు ఎందుకున్నారు?

నేనిక్కడికి కొచ్చాను. ఎందుకొచ్చాను

ఆడున్నాడు. ఎందుకున్నాడు ?

ఈ గుడిసె లిక్కడున్నాయి. ఎందుకున్నాయి ?

మీతో బాటే పందులున్నాయి. ఎందుకున్నాయి ?

మీరున్నారు? ఎందుకున్నారు?

ఎందుకో వున్నారు. ఎందుకో బతుకుతున్నారు.

ఎందుకో తింటున్నారు. ఎందుకో పెళ్ళిళ్ళు సేసుకుంటున్నారు.

సివరికి ఎందుకో సచ్చిపోతున్నారు.

ఇంతకు మించి మీ మానవ జలమకి లచ్చెం లేదా ?

ఇంతకు మించి మరేం లేదా ?

వుంది.

ఏంటుంది?

సాలా వుంది.

సుకవుంది.

సౌక్యం వుంది.

ఆనందం వుంచి.

ఆరోగ్యవుంది.

ఇ య్యన్నీ వున్నయని మీకు తెలువదు.

ఎందుకు తెలవదు?

ఆడు !

అడివల్ల తెలవటం లేదు.

ఆడొచ్చి సెప్తే మీకు తెలిసుండేది.

ఆడొచ్చి అంటే అరదమయుండేది.

కానీ ఆడురాడు.

మీకు తెలవదు.

తెలిస్తే మీరు ఇంకా యింకా యింకా సుకాలడుగుతారని ఆడి భయం.

ఇంకా ఇంకా ఇంకా సవుకారియాలు కావాలంటారని బయం.

ఇంకా ఇంకా ఇంకా మంచి వుద్యోగాలు ఆడుగుతారని బయం.

ఇంకా ఇంకా ఇంకా పిల్లల్ని కంటారని బయం.

అందుకని,

ఇద్దరు లేక ముగ్గురు పిల్లల్తో సరి పెట్టండ్రా అని సెప్పుతున్నారు.

ఆ సెప్పడానికీ, ఆ ప్రచారానికీ కోట్లు కోట్లు కరుసు సేస్తున్నారు.

ఇక్కడ మీరు అన్నమో రామ సెంద్రా అంటూ అలమటించి పోతూ వుంటే, పిల్లల్ని కనకండ్రా వెదవల్లారా అని ఆళ్ళక్కడ కోట్లుకోట్లు కరుసులు సే సే సి, అందులోంచి పదొంతులు మాత్రమే ఈ ప్రచారానికి కర్సు సేసి మిగతాది, అంటే తొంభై వంతులు, ఆళ్ళ జేబీల్లో ఏసేసు కుంటున్నారు.

అందువల్ల అన్నదమ్ముల్లారా! అక్కసెల్లెళ్లలారా! కళ్ళు తెరండి.

ఈ ఎన్నికల్లో ఓట్లు ఆడికి ఎయ్యకండి.

ఏస్తే ఏమవుద్దో సెప్పాను.

ఓట్లు నాకే ఎయ్యండి.

నాకే ఏస్తే నేనేం సేస్తానో తెలుసా?

ఈ పూరి పాకలు తీయించేస్తాను.

చక్కటి మేడలు కట్టించి పెడతాను.

ఆవి మీకు దరమంగా యిచ్చే ఏర పాట్లు సేయిస్తాను.

ఈ కుళ్ళు కాలవలు తీయించేస్తాను.

చక్కగా కాలవలు సిమెంటుతో కట్టిస్తాను.

మీ అందరికీ-రిచ్చాలు తొక్కుకునే వాళ్ళకి రిచ్చా లిప్పిస్తాను.

పనుల్లేనివోళ్ళకి పనులిప్పిస్తాను.

మొగుల్లు లేని ఆడోళ్ళనీ, తల్లీదండ్రీ లేని అనాదోళ్ళనీ తీసికెళ్ళి అనాద సెర

నాలయంలో సేర్పిస్తాను.

ఈ పేటలో సెత్తా సెదారం లేకండా సేయిస్తాను.

ఇక్కడ సొరగం తయారవుతుంది.

అరదమయిందా ?

అంతా అనండి.

బోలో సొతంత్ర భారతదేశానికీ జై!'

ఇలాగ ఆ బాబు లెచ్చరిచ్చాడండి.

ఆయాల మా అనందాలు ఏమని సెప్పడం?

కల్లు దుకాణల కెళ్ళి, పూటు మొయ్యా తాగేసాం.

పందుల్నీ, ఏట పోతుల్నీ ఏసి, వండేసుకున్నాం.

ఇక సొరగ(వొస్తే, లాభం తేదని ఎవరి మటుకు ఆళ్ళే యిచ్చల యిడిగా తాగి తందనాలాడి, ఎవడి పెల్లాంతో ఎవడు కులికాడో సెప్పలేం.

సరిగ్గా ఈ పేటలో అన్ని సోట్లా యిలాగే జరిగిందని కాదు!

సాలా సోట్ల యిలాగే జరిగింది.

ఎంత మనిసి రక్తవున్నా - అందుకే మేం కుక్క జాతోళ్ళమన్నాను.

"మరి ఎన్నికల్లో ఎవరికి వోటేశారు. మీరంతా?"

"ఇంకా సాలా కదుంది బాబయ్యా! ఇంకా అవలేదు.

ఆ మాగాజు మా పేట్లో మీటింగెట్టి ఎల్లిపోయాక, అంతా ఆ మూరాజుకే ఓట్లే సేద్దామంటే, ఓట్లేసేద్దామనుకున్నాం.

ఆ మరుసటి రోజు - ఈ మూరాజుకి ఎగసపారిటీగా నిలబడ్డ మారాజు, మీటిం గెట్టాడు.

మేమెవ్వరం మీటింగు కెళ్ళకూడదను కున్నాం. ఆ యిసయం ఆ మూరాజుకి తెలిసి, ఆ రేతిరి మా పేట్లో ఏదో సినిమా ఏసి సూపిస్తామని దండోరాఏసారు.

సినిమా అంటే అన్నపానాలు మానేసి కూకునే వోళ్ళమని తెలుసాళ్ళకి.

ఏ సినిమా అన్నాం.

మాయా బజారన్నారు.

ఎన్టీవోడూ, నాగేస్సర్రావూ మల్లీ రేలంగోడు కూడా ఏసారని తెలుసు.

అందుకని మా పేట జెనవే( గాకండా, ఆ వూరి జెనవూ(, ఆ పక్కూళ్ళ జెనవూ(, సీకటడక ముందునించే సదును పట్టుకాడ సాపలూ, గోన్లూ, గుడ్డలూ, తాటాకులూ ఏసుకూ(కున్నారు.

మద్దెలో తెరకట్టారు. తెరకి యిటూ అటూ కూడా జెనవే( జనం.

రేతిరి ఎనిమిదయ్యాక, సినిమా మొదలెట్టారు. సాలా సిన్న బొమ్మపడ్డా, ఎంతో యిదిగా సూస్తున్నం.

మద్దెన రీలు అయిపోయి రీలు మార్చే సమయానికి, ఆ సినిమా ఏరపాటు సేసిన మారాజు పెద్ద కార్లో వచ్చారు. తెల్లటి సిలుకు లాల్చీ, గ్లాసుగో పంచీ, బంగారం కళ్ళద్దాలూ, మనిషి అచ్చు సినిమావోళ్ళాగానే వున్నాడు

అతను రాగానే, కొందరుంటారు గదా— 'బాబుగారికీ జై! బాబయ్యకూ జై' అని అరవడం మొదలెట్టారు.

పిల్లలు సరదా కొద్దీ గొల్లున 'జైజై' అంటూ అరిచేస్తున్నారు.

ఆ బాబు ఎత్తైన బెంచీమీదకెక్కి., మైకు ముందు నిలబడి ముందు అందరికీ దండాలు పెట్టాడు.

తరాత 'సోదరసోదరీ మనులారా' అన్నాడు.

కొందరు సప్పట్లు కొట్టారు.

పిల్లలు సరదాకొద్దీ పెద్దగా చప్పట్లు కొట్టేసారు.



చతుర ... లలి

మా పేట్లో సాలామంది సినిమా బెమమీరు వొచ్చారు.

మద్దెన ఈ మారాజు రాడం, ఆళ్ళకి యిస్టంలేదు.

నిన్న మీటింగెట్టిన మారాజుకే మా వోట్లన్నీ ఏసేద్దావని ముందే అనుకున్నం గపండీ? అందుకని ఆ బాబు ఏం సెప్పు కొంటాడో సెప్ప కోనియ్యమని వూరుకున్నాం.

ఆ బాబు సోదరీ సోదరీమనులరా' అన్నాకే సాలా సేపు అందర్నీ సూస్తూ వుండిపోయాడు.

తరాత మొదలెట్టాడండి

"నే నింతకి ముందు సాలాసార్లే నిలబడ్డాను.

మీరంతా ఎంతో యిదిగా వోట్లేసి నన్నే నెగ్గించేవోరు.

మీరు సూపించే ఈ ప్రేవకి, ఎలాగ కుతగ్నతలు సెప్పుకోవాలో తెల్టంలేదు.

ఎందుకంటే :

నేను మీ ముందు కొచ్చి నప్పుడల్లా ఏమేమో సేసేత్తానని సెప్పడం, ఏవీ సెయ్యలేకపోవడం. మళ్ళీ మీరంతా యిలాంటి కుల్లి కంపుల్లో, కుల్లి బతుకుల్లో సాలీసాలని తిళ్ళతో, సాలీసాలని బట్టల్లో ఎదుగూ బొదుగూలేని బతుకుల్లోనే కుళ్ళిపోతున్నారని - యిని, సూసినపుడల్లా నా మనసు కరిగిపోయేది. మీ ఎదరికి రాడానికి సిగ్గేసేది.

ఓట్లు యిమ్మని వొచ్చినపుడు, మీకు నేను సెప్పే వాగదానా లేంటి ?

అక్కడికెల్లాక సెయ్యలేక. సేతులు ముడుసు కూకోసోడం యేంటి ?

ఇల్లాంటి దెందుకు జరుగలేదో మీకు

తెలవదు.

నేను కేవలం సవాలచ్చ మంది సిన్న సిన్న నాయకుల్లో, నేను మరీ సిన్నోణ్ణి

నా మీదే ఎందరో నాయకులున్నారు.

ఆళ్ళందరి దగ్గరికీ ఎల్లి 'బాబుల్లారా మా వూళ్ళో సివరిపేటలో మనుసులు మనుసుల్లాగా బతకటం లేదండి ఆళ్ళ కింత కూడు, గూడు, గుడ్డా, యియ్యండి మా ప్రబో అని పెతీ వోణ్ణి అడిగేవోణ్ణి.

ఆళ్ళు నామాట్లన్నీ యింటూనే వుండే వోరు.

అన్నీ రాసుకుంటూనే వుండే వోరు.

కాని పని మాతరం జరిగేది కాదు.

ఎందుకు జరిగేది కాదో తెల్సుకోడానికి, ఎన్ని సార్లు ఆళ్ళ సుట్టూ తిరిగే వోణ్ణో!

అయినా ఎవుడూ నా మాటినిపించుకునే వోడు కాదు.

గడ్డం పట్టుకుని బతిమాలేవోణ్ణి.

సేతులట్టుకుని పాదేయపడే వోణ్ణి. సివరికి, ఎవరూ సూడకండా, ఆళ్ళ కాళ్ళు కూడా పట్టుకునే వోణ్ణి.

ఇదంతా ఎందుకు?

ఎవరి కోసం?

మీ కోసం.

నా పెజలకోసం.

అదే నా వూళ్ళా అయితే, నాయింటో కూసునే లచ్చమందిని ఆర్డరు సెయ్యగల్ను.

కాని అది పెబుత్వం.

అక్కడ ఎవడిగోడూ ఎవడూ యిన్డు.

ఇనినట్టే కనిపిస్తారంతా! కాని సత్తే సెయ్యరు.

ఈళ్ళతో యిసిగి పోయాను.

ఇక నాకిసారి నిలబడాలని లేదు.

ఎవరికీ ఏమీ సాయం సెయ్యలేనపుడు, నేనెందుకు నిలబడ్డం.

అందుకే ఈ మీటింగెట్టాను.

అన్నారండి.

నిజం సెప్పొద్దూ? ఆ మాట్లినే సరికి మాకే జాలేసింది.

మా కూ యిలాంటి పాట్లే కలుగుతుంటాయి.

ఇంటో గెంజి లేదని, మా రిచ్చా బాబుని డబ్బులు యిమ్మని అడుక్కుంటే ఇయ్యాల్రా, రేపురా, అని తిప్పుతాడే గాని, ఇయ్యనని మాతరం సత్తే సెప్పడు.

సరిగ్గా మాలాంటి అవస్తే ఆ బాబుదీ అనిపించింది, మాకు ఏడుపొచ్చింది కూడా!

అడుక్కునే వోడెప్పుడూ, యిచ్చే వోడికి లోకువే కద బాబయ్యా?

ఎంత మనిషి కంత-అదికారాలూ, లోకువలూ వుంటాయి. మేం రిచ్చాబాబుని అడుక్కున్నట్టే, ఆ బాబు ఇంకా పెద్ద మినిస్టీరు బాబుల్ని అడుక్కుని వుంటారు.

ఆళ్ళు లేదు పొమ్మంటే - ఆయన లచ్చాదికారి-ఆళ్ళ యిదలింపులకి ఎందుకు పడుంటారు?

మాకోసవేం కదా?

అయినా మనిషికి కోపం నేదండి బాబూ. సివరికి యిక ఇసిగెత్తి పోయినట్టున్నారు. ఈసారి నిలబడవంటున్నారు.

"ఈయన పేరేవిటి!"

"రాంబాబుగారండి"

"అంతకు ముందు మీటింగు పెట్టి నాయన పేరు?"

"ఎంకటేసులు గారు?"

"వెంకటేశులు గారు మీ గుడిసెలు తీసేసి మేడలు కట్టిస్తానని చెప్పారుగదా?"

 చతుర ... 35

ఆయన్ని ఎన్నుకుంటే ఆయన అలాగే ఈ పెద్దవాళ్ళ విదిలింపుకి, రాంబాబు గారిలాగే విసిగెత్తి పోతారేమో?"

"ఏమో ! సెప్పలేవండి. ఈసారి ఈయనకేసి సూస్తాం ఈయన నెగ్గు తారేమో– ఈ యిసయంలో"

"అయితే యింతకీ ఎవరు నెగ్గారు?"

"రాంబాబుగారే నెగ్గారండి"

"అదేవిఁటి ? మీరంతా వెంకటేశులు గారికి వోటెయ్యాలని నిశ్చయించుకున్నా వఁన్నారు ?"

"నిజంగా ఈ సారి ఎంకటేసులు గారికే ఎయ్యాలను కున్నం గాని - రాం బా బు గారు మళ్లీ మీటింగులో అందర్నీ మార్చేసినారండి."

"ఎలా ?"

"అబ్బో ! ఎలాగంటే ఏం సెప్ప వండి? ఈ నాయకుల మాటలూ, మతల బులూ, పెద్దోళ్ళ తతంగాలు సాలా యివరంగా సెప్పే సరికి, 'సీ'అనిపించి ఆ పాత రాంబాబు గారికే ఏస్నావండి."

"డబ్బిచ్చారా ?"

"ఛీఛీ రావఁరావఁ' మాకియ్యలేదండి. ఆఁ ! కొందరికి యిచ్చారని యిన్నాం లెండి. మాకియ్యలేదు."

"ఏం ?"

"మేవంతా తవఁరికే ఓటేస్తావఁన్నా వండి."

"అందుకని నోటి వరకూ వచ్చిన నోటుని వదులు కున్నారన్నమాట."

"బాబయ్యా ! నోటు తీసుకుని ఓటెయ్యడవుఁ ఓ గొప్పేనా ? మనిసి మీద నమ్మకముండాల ! డబ్బంటే ఈయాల వొస్తాది! రేపుపోద్ది ! కాని మాట?"

"రాంబాబు మీద నమ్మకం పోయిం దన్నావ్ ?"

"పోయింది నిజవేఁ. కానీ ఆయన మాట్లని నమ్మకం వొచ్చేసింది."

"ఏమ్మాటలు చెప్పా రేవిఁటి ?"

"సాలా సెప్పారండి. టూకీగా సెప్పాలంటే' సోదర 'సోదరీ మన్లారా ! నిన్న ఎంకటేసులు గారు ఇక్కడే మీటింగెట్టి - మీ గుడిసెలు తీసేసి మీ అందరికీ పక్కాయిళ్ళు కట్టిస్తావఁన్నారు.

రోడ్లేయిస్తావఁన్నారు.

కాలవలు కట్టిస్తావఁన్నారు.

పాయిఖానాలు కట్టిస్తావఁన్నారు. ఎలక్ట్రీ దీపాలువేయిస్తావన్నారు. పంపు లేయిస్తావఁన్నారు. రిచ్చాలేనోళ్ళకి రిచ్చా లిస్తావఁన్నారు !

అనాదోళ్ళకి యింత దారి సూపిస్తా వన్నారు.

ఒక్క మాట్లో సెప్పాలంటే, ఆ నాటి రావఁరాజ్యాన్ని మీ పేట్లో కట్టిస్తా వఁన్నారు.

కాని సోదరులారా !

ఒక విషయం.

ఇయ్యన్నీ నిజవేఁ.

అందరికీ అలాగే సెయ్యాలని వుంటాది.

కాని ఒక విషయం సెప్తాను.

ఈ పేట్లో దాదాపు అయిదువేల జనాబా వుంది.

ఆరొందల గుడిసెలున్నాయి.

ఈ ఆరొందలు గుడిస్సెల్ని తీసేసి పక్కాయిళ్లు కట్టాలంటే ఎంతవుద్ది ?

పక్కా సిమెంటు యిల్లంటే. గాలీ, ఎలుతురూ వొచ్చే కాస్తంత పెద్ద గదు లున్న యిళ్ళన్న మాట.

అలాంటి ఇంటికి ఒక్కొదానికి పది వేల రూపాయలు ఖర్చవుద్ది.

అంటే ఈ అరొందల గుడిసెల్ని పక్కాయిళ్ళుగా కట్టాలంటే దాదాపు అరవై లక్షల రూపాయ లవుతాది.

కాలవలు కట్టించడానికి మరో రెండు మూడు లక్షలు.

ఎల్కట్రీ దీపాలు ఎయ్యడానికి మరో మూణ్నాలుగు లక్షలు.

పాయికానలకి మరో లక్ష.

అనాదోళ్ళకి యింత దారి సూపించ లంటే, మరో రెండు లక్షలెట్టి అనాద సెరనాలయం కట్టాలి.

ఇన్ని కట్టినాక యిక్కడో పోలీసు టేసనూ అదీ వుండాలి.

ఇలా అన్ని కట్టాలంటే, మీ ఒక్క పేటకే దాదాపు కోటి రూపాయలు కర్సవుద్ది.

సోదరి సోదరీ మన్లారా !

మన పెబుత్వం దగ్గర అంత డబ్బే వుంటే, ఏటేటా మీ పేట పక్కనించి పారుతున్న 'ఎఱ్రికాలవ' పొంగి ఎన్ని కొంపల్ని కూలేస్తోందో, ఎన్ని పేణాల్ని తీసేస్తోందో, మీకున్న 'యావదాస్తీ' ఎంత నాసనం సేసేస్తుందో మీకు తెల్సు కదా ?

దాన్ని అరికట్టడానికి, ఆ 'ఎఱ్రి కాలవకి' ఎగువన సిన్న ఆనకట్టే కట్టి, ఏటా జరిగే ఈ నష్టాన్నే ఆపుండేవోరు.

సరే అదలాగ వుంచండి.

నిజంగా గవర్నమెంటు, ఆ ఎంక టేసులు మాటయిని మీ గుడిసెలు తీసేసి యిళ్ళే కట్టిందనుకోండి !

ఆ యిల్లు ఎవరు కడతారు ?

గవరనమెంటు కట్టదు గదా?

ఏ కంటరాకటరుకో కట్టమని పుర మాయించి, దబ్బిస్తాది.

ఆ కంటరాకటరు మీ సేతే పని సేయిత్తాడు. మీకు రోజు కూలీ యింతని యిస్తాడు.

కానీ, దీంటో కిటుకేటో తెలుసా ?

ఇళ్ళు కట్టడానికి అరవై లచ్చలని గవరనమెంటు దగ్గర నించి డబ్బు తీసుకుని ఏ ముప్పయి లచ్చలకో బూడిదా, యిసుకా, సున్నం ఏసి ఇళ్ళు కట్టేస్తాడు.

అంటే కంటరాకటరుకి ముప్పయి లచ్చలు మిగుల్తాయి.

మన ఆంధ్రదేసానికి ఏటా తుపాన్లు రావడం బగవంతుడిచ్చిన వరం.

'ఎవరికి ?'

'ఈ కంటరాకటర్లకి.'

ఆ తుపాను రాగానే ఇళ్లు సగానికి పైగా కూలిపోతాయి.

మరి ఆ కూలిన ఇళ్ళని ఏ నాదుడూ బాగు సేయించడు. మీరే సూసుకోవాలి.

మీ కంత డబ్బుందా?

లేదు.

అందుకని మిగిలిన గోడల మీద తాటాకు లేసుకుంటారు.

మన తెలుగోళ్ళకి ఆంజనేయసాంవి అరాద్ద దైవం.

అతని తండ్రి వాయువు.

వాయువుకి పేణ సేవింతుడు అగ్గి దేవుడు.

అందువల్ల అగ్గిదేవుడు, ఆమీ పాకల్ని తగలెట్టేస్తా వుంటే వాయుదేవుడు, అగ్గి దేవుడికి సాయం ఎల్లి, మొత్తం నాసనం సేసేస్తాడు.

కాని ముప్పయిలచ్చలు ఎనకేసుకున్న కంటరాకటరు, పెద్ద మేళ్ళో ఆయిగా వుంటాడు.

ఈ కంటరాకటరు ఇంతా సేసి ఎవరై వుంటాడు.

ఈ వెంకటేసుని బామ్మర్దో, మేనల్లుడో, తమ్ముడో, కొడుకో అయివుంటాడు.

సోదర సోదరీ మనులారా !

అందువల్ల ఈ గుడిశెలు పీకి యిల్లు కట్టిస్తావన్న మాటల్లో ఎనకున్న నిజాలు యివి.

ఇల్లు కాలిపోయి మీరంతా గోడు గోడున ఏడుస్తావుంటే, ఆ ఎంకటేసులు మీకు ఒకటి రెండు రోజులు బియ్యం బస్తాలు యిచ్చి, సంతర్పణలు సేయిస్తాడు. ఆబియ్యం కూడా అతగాడి సొమ్ము కాదు.

అతగాడికి పెద్ద బియ్యం మిల్లులు నాలుగున్నాయి.

అక్కడ దాన్యం ఆడించుకోడానికి




వొచ్చిన రైతుల దాన్యం బస్తాల్లోంచి, ఒక్కో కిలో బియ్యం తీసేసి, ఆ ఎల్లిని సిన్నరాళ్ళ ముక్కల్తో బర్తీ సేస్సి, మీకు ఆసన్నకారు రైతుల బియ్యాన్ని తనే యిచ్చేస్తున్నట్టు సంతరపణ సేస్తాడు.

ఇది, సోదర సోదరీమనులారా ఆ పెజానాయకుడి వాగదానాలు. అందువల్ల మీరే నిరనయించుకోండి' అన్నారండి"

"దాంతో మీరంతా తిరిగిపోయి రాం బాబుకు వోట్లేసి గెలిపించేశారు అవునా?"

"అవునండి. సెప్పానుగా మేం మనిషి రకతంతో పుట్టినా పందులం, కుక్కలం. అయితే బుద్ధిలో గొర్రెల మందలం."

"ఈ మాత్రం మీ మటుకి మీరు గుర్తించారు కదా - మరి ఇకనించయినా ఎందుకు మంచి వాళ్ళని ఎన్నుకోరు?"

మంచోళ్ళా? ఏటి బాబూ మంచి ?

ఎక్కడుంది మంచి ?

ఎవడు మంచోడు ?

ఎవరు సోర్థంలేకుండా పన్సేసేవోడు?

తెల్లోళ్ళు వుండే టయింలో, యిలాంటి పనులు జరిగేవా ?

మనిసికి చదువంటే ఏటో తెలీని రోజుల్లో, మాకు సదువు కావాలి, సదూ కుంటాం అని ఎవరూ అడక్కండానే-అళ్లే బళ్ళు పెట్టి సదువులు సెప్పేవోరట.

ఆ సదువులు, నిజానికి ఈ గుడిసె ల్లోకి కూడా వచ్చాయి.

అయితే సిత్రం ఏంటోతెలుసా బాబూ?

ఆ సదువులు సదివినోళ్ళు కిరస్తానీ వోళ్ళయి పోతున్నారని, సాలామంది మాలాటోళ్ళు ఆ సదువులు సదవలేదు.

"కిరస్తానీ వాళ్లయితే ఏవిటి తప్పు?"

"తప్పేటంటారు బాబూ ? కిరస్తానీ వోళ్ళంటే ఎవరు? మాలోళ్ళు. ఆ మాల సదువులు మా కెందుకు ?"

"దొరలు కదయ్యా చదువులు చెప్పే వారు? వాళ్లు మాలవాళ్ళు కారుగా ?"

"కారూ ? అళ్ళూ మాలోళ్ళే నండి. మా సిన్నప్పుడు ఏ దొరలన్నా మా గుడిసెలకి వొచ్చి, ఏ కిరస్తానీ బోదన్నా సేసి ఎల్లిపోయాక, ఇల్లంతా పేడేసి సుబ్బరం సేసుకునే వోళ్ళం."

"అది సరే! మాలవాళ్ళంటే మీకంత రోతెందుకు ?"

"రోతేటి బాబూ! అళ్లు అంట రానోళ్లు."

"అదే ఎలా గయ్యారు ?"

"ఎలా గయ్యారంటే - అంతే! అళ్ళ పాపవే, అళ్ళని అంటరానోళ్ళగా సేసే సింది."

"అయితే నువ్వు ఏ కులం వాడివి?"

"తూరుపు కాపోణ్ణండి."

"నువ్వు యిప్పుడు ఏ రాంభాబు గారింటికో, ఎంకటేసులు గారింటికో వెళ్ళావనుకో, వాళ్ళూ నిన్ను అంటరాని వాడిగా చూస్తారా, లేక లోపలికి రమ్మన మని వాళ్ళసోఫాల్లో కూచో బెడతారా?"

"ఎందుకూ్కకో బెడతారు బాబూ ? అళ్ళ దగ్గర మేం సిన్నోళ్ళం."

"అంటే మీరుకూడా అంటరాని వాళ్ళ కిందే, వాళ్ళ దృష్టిలో లెఖ్క కదా ?"

"అంటరాని వోళ్ళనరు గాని, ఎం దుకో మాకే ఎల్లడానికి, కుర్చీల్లో కూకో డానికి బయం."

"ఏం ?"

"మా కేవుందని అళ్ళతో సమా నంగా, అళ్ళింట్లో కూకోగలం? ఏవుందని అళ్ళ సరసన నిలబడి మాటాడగలం ?"

"అంటే, ఏవుంటే వాళ్ళ సరసన నిల బడగలరు ?" అనడిగాను.

"డబ్బుండాల ! ఓదా వుండాల ! ఇంకా యింకా యాపారాలు వుండాల"

"అంటే డబ్బనేదే ఈ అంటరానితనాన్ని నిర్ణయిస్తుందంటావా ?"

అతను చాలా సేపు మాటాడలేదు. ఆలోచిస్తున్నట్టున్నాడు.

"ఏవిఁటి గురువులూ మాటాడవ్ ? డబ్బేనా ఈ బేధాల్ని నిర్ణయించేది?"

"కాదనుకుంటానండి".

"ఏం?"

"మాలోడున్నాడనుకోండి. ఆడికి బోల్డు డబ్బు ఎలాగో వచ్చిందనుకుందాం: ఆడిదగ్గర డబ్బుందని, ఆణ్ణి మన సరసన కూకోబెట్టుకోగలవాఁ ? మన పక్కన కూకోబెట్టుకుని అన్నం తినగలవాఁ ?"

"సరే! ఒక విషయం చెప్తాను. మన మంత్రుల్లో యిప్పుడు చాలా మంది హరిజనులున్నారు. హరిజనులంటే మాల వాళ్ళకు గాంధీగారు పెట్టిన పేరనుకో. ఆ మంత్రిగారొస్తే, ఆయనకి వూరు వూరంతా నివాళిపట్టదూ? పెద్ద పెద్దవాళ్ళు ఆయన్ని యిళ్ళకి తీసికెళ్ళి, భోజనాలు పెట్టరూ? పార్టీలు చెయ్యరూ?"

"నిజఁవే అనుకోండి. కానీ ఆళ్ళు మినిస్టీర్లు".

"అయినా మాలవాళ్ళేకదా ?"

"కానీ ఆళ్ళో పెద్ద మినిస్టీర్లు బాబూ ! మినిస్టీర్లని ఆ ఓదా లేకండా తీసుకొచ్చి దూరంగా వుంచితే, మర్నాడు ఆళ్ళ బతుకులూ అంతే ! ఈళ్ళ డబ్బూ దస్కఁం ఋళ్ళూ గిళ్ళూ అన్నీ కూలిసేస్తారు"!

"ఎలా చేస్తారంటావ్ ? ఆ మంత్రిగారు మాలోడుకదా?"

"ఆళ్ళకధికారం వుంది బాబూ !"

"అంటే, మాలవాళ్ళకి అధికారం వుంటే, మహాత్ములు కూడా జడుస్తారన్న మాట !"

గురువులు మాట్లాడలేకపోయాడు.

"చూడు గురువులూ ! ఒక్క మాల వాళ్ళనే కాదు. ఎలాంటివాడికైనా అధికారం వుంటే చాలు, ఎంతటి బలవంతుడైనా జడుస్తాడు. దేవుళ్ళని తీసుకో. వాళ్ళు అవతారమెత్తి భూమ్మీదికొచ్చారనుకో! రాక్షసులూ, దుర్మార్గులూ ఎలా హడలెత్తిపోయేవారు?"

"బాబూ! దేవుళ్ళ మాటెత్తారుగాబట్టి సెప్తున్నా! దేవుళ్ళూ,రాక్షసులూ మొదట్లో సముద్రాన్ని మజ్జిగలా చిలికారట. అందులోంచి అమురతం పుడితే, దేవతలు మోసంచేసి, ఆ అమురతాన్ని తాగేసి, బలవంతులైపోయారు. ఇద్దరూ కల్సి సవుద్రాన్ని సిలికారుకదా? మరి ఈళ్ళకి దేవతలెందుకు వాటా యివ్వలేదు? ఒకేళ రాక్షసులే ఆ అమురతాన్ని తాగేసారనుకోండి ఈ దేవతలూ, దేవుళ్ళూ వుండేవారా ? అప్పుడు మనం రావనాసురుణ్ణీ, యిరన్యాక్షుణ్ణీ, కంసుణ్ణీ, కుంబకర్ణుణ్ణీ, దేవుళ్ళని కొలిసేవారవాఁ కాదా?"

"నీ వేదాంతం రైటే. అప్పుడీ రాక్షసులు అప్పుడప్పుడు అవతారాలెత్తి, దేవతల్ని చంపేస్తూ వుండేవారు.అప్పుడు దేవతల్నే దుర్మార్గులనేవారం. అవునా?"

"అవుననుకోండి. కానీ దేవతలు దేవతలే. రాక్షసులు కిరాతకులు".

"మళ్ళీ యిలాగంటున్నావేం ?"

"ఏదో సెప్పలేను. ఇష్ణుమూర్తినీ, శివుణ్ణీ, బెమ్మనీ—ఆ మాటకొస్తే ఏ దేవుణ్ణీ తిట్టలేవఁండి. అళ్ళు దేవుళ్ళు".

"కానీ యిప్పుడు చిత్రమైన వేదాంతం చెప్పావ్ ? అమృతాన్ని దొంగతనంగా తాగేసినవాళ్ళు దేవతలైపోయారన్నావ్!"

"ఏదో నోరు జారుంటాను".

"నోరు జారడం కాదు గురువులూ! మీ కిప్పుడు నిజానిజాలు తెలుస్తున్నాయి. ఆలోచన వస్తోంది. అయితే వెనకటి భక్తిభావం పోవటంలేదు. కొత్త భావాన్ని నమ్మడానికి భయపడ్తున్నారు. నువ్వు నిజంగానే ఆ 'అమృతం', 'విషం' అన్న మాటల్ని యధాలాపంగా అనేసినా ఆ 'సత్యం' ప్రస్తుత పరిస్థితికి సరిగ్గా సరిపోతోంది".

"ఎలాగ బాబూ!?"

"మీరంతా రాక్షసులనుకోండి,అనుకో కాసేపు. ఈ వున్నవాళ్ళు దేవతలనుకో. 'మీరిద్దరూ' కలిసి దేశంకోసం పాటు పడుతున్నారు".

"నేనేం పాటుపడుతున్నాను బాబూ"

"రిక్షా తొక్కటంలేదూ?"

"అది నా పెళ్ళాం బిడ్డల్ని పోసించుకోడానికి".

"కానీ అదే సమయంలో, ఒకళ్ళనో ఇద్దర్నో రిక్షా ఎక్కించుకుని తొక్కుతున్నావ్. అంటే, వాళ్ళు సుఖంగా ప్రయాణం చేస్తున్నారన్న మాటేగా ? నువ్వు రిక్షా తొక్కినా, అడుసు తొక్కి గుడిసెలు కట్టినా, బిల్డింగులు కట్టినా, మగ్గంనేసి బట్టలు తయారుచేసినా—అది నీకు కొంత భుక్తినిచ్చినా—మరొకరికి ఉపయోగపడి, వాళ్ళకి సుఖాన్నిస్తోంది. ఇలా మీరూ, వాళ్ళూ కలసి పనిచేస్తున్నట్టే లెఖ్ఖ. అయితే రాక్షసులకు ఏమీ దక్కనివ్వకుండా, దేవతలు అమృతం తాగేసి అమరులైపోయినట్టు, మీ కష్టాన్ని మీకు వదిలేసి, వాళ్ళు సుఖపడుతున్నారు. మీరు పెద్ద బిల్డింగులు కడతారు. కానీ అందులో వుండగలరా ? వాళ్ళు వుండనిస్తారా ?

లేదూ-ఒక బట్టల మిల్లులో పని చేస్తుంటారు. ఐదొందలు ఖరీదుచేసే చీరనో, గుడ్డనో తయారు చేస్తారు. కానీ ఆ అయిదొందల చీరనూ, బట్టనూ మీరు 'కట్టుకో'గలరా?"

"అదేటి బాబు? డబ్బు ఆళ్ళది. మిల్లు ఆళ్ళది. మెషిన్లు ఆళ్ళవి".

"ఎలా? డబ్బు అనేది రూపాయి రూపంలో వుందనుకో, దాన్ని ఎలా తయారుచేశారు? భూమిలోంచి తవ్వి, తీసి ఒక లోహాన్ని బయటకు తీసుకొస్తారు. దాన్ని శుద్ధిచేసి రూపాయి ఆకారం యిస్తారు. ఇచ్చిన వెంటనే అది ఈ ఆధునిక దేవతలు మింగేస్తారు! ఈ భూమి ఎవరి సొత్తు? భూమిలో వున్న లోహాలు ఎవరి సొంతం?"

"దబ్బిచ్చి తవ్వించుకునే వోళ్ళదేకదా బాబూ?"

"సరే! ఈ నీళ్ళు ఎవరివి? గాలి ఎవరిది? వర్షం ఎవరిది?"

"అందర్దీనూ".

"మరి ఈ గాలీ, నీరూ అందర్దీ అయినపుడు - మిగతావన్నీ అందరివీ కావా?"

గురువులు తలగోక్కున్నాడు. రిక్షా మెల్లగా ఆగుతోంది - వాడి ఆలోచనల సంచలనంల్ల!

"బాబూ తమరు సదూకున్న వోరు! ఇయ్యన్నీ తెలుస్తాయి. మరి మాకెట్టా తెలుస్తాయి. తెలిసేమటుకు చేసేదేవుంది?"

"గురువులూ! ఇందాక-చదువు కిరస్తాని వాళ్ళదని, చదవడం మానేశానన్నావ్.

ఎందుకు?

కిరస్తానీ వాళ్ళంటే మాలవాళ్ళనీ, మాలలంటే అంటురాని వాళ్ళనీ, అంటరాని వాళ్ళంటే పాపాత్ములనీ - అని నీ అభిప్రాయంగా చెప్పావ్!

మొదట నిన్ను నువ్వు సరిచేసుకుని, అనాడు చదివుంటే ఈవాళ మరికాస్త బాగా ఆలోచించే వాడివి!

చదువంటే ఏమిటో కాదయ్యా!

మన మెదడ్లోవున్న తెలివి వికసించడమే!

ప్రకృతి చూడు!

పూల చెట్లని జాగ్రత్తగా నీళ్లోసి పెంచు.

అది పెరిగి మొగ్గతొడిగి, పుష్పించి, సువాసన నిస్తుంది.

అదే పూల చెట్టుని చవిటి నేలమీద వెయ్యి.

లేస్తుందా? మొగ్గలు వేస్తుందా? వికసిస్తుందా? సువాసనేస్తుందా?

మనిషి కూడా అంతే!

చెట్లకి సహజంగా ఆ వికసించే శక్తి వుంది.

మనిషికీ వుంది. కానీ సరైన నేలా, నీరూ లేకపోతే చెట్టు నాశనం అవుతుంది.

సరైన శిక్షణ లేకపోతే, మనిషి గిడసబారిపోతాడు! గుడిసెలకే 'పరిమితం' అయిపోతాడు.

"బాబూ! మేం ఒకేళ చదూకుని లేచినా, మమ్మల్ని పీడించుకు తినే వాళ్లుంటారు! వాళ్ళ నెలా తప్పించుకోవడం?" అని అమాయక ప్రశ్న వేశాడు.

"పీడించుకు తినడం, మోసం చెయ్యడం ప్రకృతి ధర్మం గురువులూ!

ఒకరకం చెట్టుంది. అది మరో చెట్టు మీదె మొక్కగాలేస్తుంది. ఎదుగుతుంది. ఎలా?




ఆ చెట్టు సారాన్ని పీల్చుకుని.

మెల్లగా దానివేళ్ళు చెట్టుమీంచి కిందికి దిగి భూమిని తాకుతాయి.

భూమిలోకి దానివేళ్ళు వెళ్ళాక, పైన ఎదుగుతున్న చెట్టు, అసలు చెట్టుచుట్టూ ఆక్రమించు కుంటుంది.

చివరికి, మొదటి అసలు చెట్టు కుళ్ళి, నాశనమైపోతుంది.

ఆ చెట్టు మీద పెరిగిన చెట్టుమాత్రం హాయిగా వుంటుంది.

వేప చెట్టుని చుట్టుకుని పెరిగే రావి చెట్టు చూడు !

తాటి చెట్టుని అల్లుకునే చెట్లని చూడు.

అంతే మనిషి ప్రకృతి కూడా!

అయితే చెట్టుకి తిరగబడే శక్తిలేదు.

లేకపోతే తన కొమ్మల్లో లేచి, తన సారం పీల్చుకుని, తననే నాశనం చేసిన ఈ రాకాసి చెట్టుని, అది 'చంపేసి' వుండేది.

మనిషికి చలనం వుంది.

బుద్ధి వుంది.

చేతులూ కాళ్లూ వున్నాయి.

యిన్ని వుండి కూడా, వీడిమీద పడి బతికే ఒక్క మోసగాణ్ణి, ఎందుకు కొట్టి తగిలెయ్య లేడు ?

అసక్తత కాదది !

బుద్ధి లేకపోవడం కాదది !

శక్తి లేక కాదు !

మరేమిటి ?

మనిషిని మనిషి ప్రేమించ లేక పోవడం.

మనిషంటే మనిషికి ద్వేషం.

మనిషికుండే స్వార్థం. ఒకడి స్వార్థం వంద మందిని చంపుతుంది."

"సార్థం ఎవడి కుండదు బాబయ్యా ? నాకు లేదా ?"

"ఇది కాదు స్వార్థమంటే మరొకడి పంచను చేరి, పదిమందిని నాశనం చేయడం. పదిమందిని 'చంపి' ఒకడు బతకడం. ఆ ఒకడులోని నీతి 'చచ్చి,' లక్ష మంది బతుకుల్ని నాశనం చేయటం."

"బాబయ్యా ! ఒక మాటడుగుతాను ఏమనుకోరు గదా?"

"ఏం అనుకోను చెప్పు"

"ఇన్ని యిసయాలు యింత బాగా సెప్పారే, మరి తమరెందుకు, లంజెల దగ్గరికి వెల్తున్నారిప్పుడు ?" నిజంగా నాకు నవ్వొచ్చింది! పకపకానవ్వాను.

"ఎందుకు బాబూ అల్లాగ నవ్వుతున్నారు ?"

"గురువులూ ! మొదట్లో నేను ఆ చీకటి సందుదగ్గర నిలబడి వున్నాను. గుర్తుందా?"

"ఉంది బాబూ?"

"నిన్ను పిలిచానా?"

"లేదు"

"నా దగ్గరికి నువ్వే వచ్చి 'రిచ్చా కావాలేంటి బాబయ్యా?' అని అడిగావ్. అవునా ?"

"అవునండి?"

"అలా ఎందుకడిగావ్?"

"అది మా...వృత్తి కద బాబూ! ఎవరు కాపడ్డా అలాగే అడుగుతుంటాం"

"కాని నువ్వు అలా గడిగావా? రిక్షా వద్దుగానీ, ఎం తోచటం లేదు. ఎక్కడికన్నా తీసికెళ్తావా అన్నాను గుర్తుందా?"

"వుంది బాబూ! ఎక్కడికన్నా తీసికెళ్తావా అని ఎవరడిగినా, మాకుముందు 'ఇ య్యే' గుర్తొస్తాయండి. అదీగాక తమరు సీకట్లో నిలబడి వున్నారు. అందు

కని, ఏ పిల్ల దగ్గరికో తీసికెల్లమంటు న్నారని అనుకున్నా!"

"తర్వాతేమన్నావ్?"

"మురమండనించి......రండి నేను సూపిత్తా అన్నా."

"మరి నేనేతీ అడక్కండా, నువ్వే తీసికెళ్తానని చెప్పి నా ఉత్సాహాన్ని ప్రోత్సహించితీసుకొస్తున్నావ్"

"కానీ ఆళ్ల గురించి సాలా అడిగారు"

"తెలుసుకోవాలని"

"తెలుసుకొని ఏం సేస్తారు బాబూ! ఆళ్లు దొంగ ముండలు"

"వాళ్ళ గురించే కాదు!చాలా చెప్పావ్, చాలా చాలా విషయాలు చెప్పావ్"

"బాబూ ఒక మాటడగనా?"

"అడుగుతూనే వున్నావ్‌గా?అడుగు"

"తమరు...తమరెవరు?"

"నీలాగ మనిషినే"

"అది కాదు. సీ అయిడీలా?"

నవ్వాను. "కాదులే"

"మరి!"

"రైతుకుటుంబం నించి వచ్చాను"

"అల్లాగే అనుకున్నా"

"ఎలా కనిపెట్టావ్?"

"మీ మాసిపోయిన సొక్కా. సినిగిపోయిన పంచె మాసిన గెడ్డం"

"రైతులంతా అలాగే వుంటారా? లేక యిలావుండే వాళ్ళంతా రైతులంటావా?"

"ఏవో సరిగా సెప్పలేను గాని బాబయ్యా, తవర్ని సూడగానే అల్లాగె అనుకున్నా...బాబూ! అదిగో ఆ కనిపించే ఝిల్లే. ఎలారా?" అన్నాడు.

"వెళ్దాం కాసేపు ఆగు, నువ్వు చాలా విషయాలు సగం సగం చెప్పి ఆపేశావ్. అవి పూర్తిగా చెప్పు. అప్పుడు వెళ్దాం"

"ఏంటి మానేశాను?"

"మీ చెల్లెల్ని అమ్మేసిన వాణ్ణి ఎలా పట్టుకున్నావ్? ఆమెను ఎలా విడిపించావ్? తర్వాత ఎలక్షన్లలో రాంబాబు నెగ్గి ఏం చేశాడు?...ఇంకా..."

"మా సెల్లెల్ని అమ్మేసినోడేనా? ఆడెవడో కాదండి. మా దూరబ్బంధువే! ఆడిపేరు తలుపులు"

"మీ యింటిదగ్గరే వుండేవాడా?"

"కాదు. ఎక్కడో రిచ్చా తొక్కుకునేవోడు. ఒకరోజున కనిపించి, మా యింటికొచ్చాడు. ఆడికి పెల్లయింది. ఇద్దరు పిల్లలుకూడా! ఇద్దరూ ఆడోళ్ళే, ఆడిపెల్లం ఎవడ్తోనో లేసిపోయింది."

"మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడా?"

"లేదు. దొమ్మరి గుడిసెల్లో దూరేవోడు. ఇంట్లో ఆడదుంటే, ఇంట్లో పిల్లలకి 'కట్టడి' వుంటాది. కాని ఆడి పెళ్ళాం లేకపోడంవల్ల యిద్దరూ, తలో రకంగా సెడిపోయారు."

"ఇప్పుడెక్కడున్నారు?"

"తెల్దు. చిన్నది బళ్ళల్లో అడుక్కునేది. పెద్దది అక్కడా యిక్కడా కూలిపన్లు సేసేది. కూలిపన్లే సేసినా, మంచిమంచి గుడ్డలు కట్టుకునేది. దాని బాబు, ఎప్పుడన్నా యింటికొస్తే కదా. దాని సంగతెలిడానికి? అడు రిచ్చా తొక్కి, వచ్చిన డబ్బంతా తాగుడికి తగలేసి, మిగిలిందుంటే ఏ దొమ్మరి గుడిసెకో పోయేవాడు. పెద్దది అలాగిలా నానాపన్లూ సేసి, సివరికి ఒకనాడు కనిపించకండా పోయింది! ఎక్కడికి పోయిందో, ఇప్పటివరకూ తెల్దు.సిన్నది రైలుబళ్ళల్లో అడుక్కుంటూ, సివరికి అదీ ఆ బండితోనే ఎక్కడికోపోయింది"





"ఇతను నీకెలా కలిశాడు?" అనడిగాను 'తలుపులు' గురించి.

"రిచ్చా తొక్కుతుంటే కల్సాడు. బంధువునని సెప్పి మా యింట్లో సేరాడు. మెల్లగా ఎలాగో నా సెల్లెల్ని బుట్టలో ఏస్సాడు. ఏస్సి, తీసుకుపోయి, యిసాకపట్నంలో అమ్మేసి, ఎక్కడికో పోయాడు."

"మరి మీ చెల్లెల్ని ఎలాగ విడిపించావ్?"

"అదో పెద్ద గమ్మత్తు బాబూ! నన్ను ఆ రవుడీలు సిదగ సంపి రోడ్డుపక్కన పారేశారుగా? పొద్దుట ఎవరో కాలేజీ కుర్రోళ్ళు సూసారు. ఏవేవో తిట్టిపోయారు. సాయంకాలం కూడా, నేనక్కడే అలాగే పడున్నాను. మళ్ళీ ఆ కాలేజీ కుర్రోళ్ళు వొచ్చారు. కాలేజీ కుర్రోళ్ళు బలే సిత్రమైన వోళ్ళండి."

"అంటే?"

"ఒక్కా-లేజీ కుర్రోడు, ఒంటరిగా, రోడ్డు మీంచి పోతుంటే, అందవైన ఆడది కాపడిందనుకోండి. ఆ పిల్లేపు ఒకసారి చూసీసూడనట్టు సూసి, ఎల్లి పోతాడు! అదే ఇద్దరు ముగ్గురు కల్సి వున్నారనుకోండి - ఇక సూడండి-యిక యికలు,పకపకలు-ఆళ్ళ కళ్ళనీ,ముక్కునీ నోటినీ, జెడనీ, ఇంకా యింకా ఆ పిల్ల వొళ్ళునీ సాలా యిదిగా ఎక్కిరించేస్తూ, యిజిలేస్తూ, పాట్లుపాడ్తూ-ఎవరో సినీమా ఏకటేర్ల పేర్లతో పిలుస్తూ. తెగ అల్లరి సేసేత్తా వుంటారు."

"అలా ఎందుకు చేస్తారంటావ్?"

"ఎందుకేంటి బాబూ! ఆ పిల్ల కళ్ళు యిటుతిప్పి ఆళ్ళేపు సూడాలని."

"ఒకవేళ చూస్తే ?"

"ఎవరోగానీ, సాదార్నంగా ఎవురూ సూట్రడు. ఒకేళ సూసిందే అనుకోండి, ఆ సూపుల్లో వున్న 'దీన్ని' బట్టి, ఆ పిల్లెనకాల పడ్డవోఁ, లేక నోర్మూసుకుని వూర్కోవఁడవోఁ, లేకపోతే మరీ పోకిరీ వోళ్ళయితే ఇంకా ఏడిపించడవోఁ సేస్తారు."

"మరి ఆడపిల్లలు యిలా మగ పిల్లల్ని ఏడిపించరా ?"

"అమ్మో! ఇళ్ళంతకంటే గడుగ్గాయిలండి ! అయితే మొగోళ్ళంత యిదిగా అఁను. ఎక్కువగా సమూకున్న కుఱ్ఱదైతేనే ఏడిపిస్తాది. అలాగే వుండాల్లెండి. సరికి సరిగా సెప్పుచ్చుకుని సవాఁదానం సెప్పిందంటే ఈ ఎదవ ఏడిపింపులూ, ఇకిలింతలూ దానికయ్యే తగ్గిపోతాయి. కాని ఏంటో, మన ఆడోళ్ళు ఎంత సదూకున్నా, అంతకు తెగించరండి. ఏయో కుక్కలో, కోళ్ళో అరుస్తున్నాయని పోతారు. అలాగని అందరూ అలాంటోళ్ళు కారండి బాబు. కొందరే అలాంటోళ్ళు - ఆడోళ్ళోనూ వున్నారు, మొగోళ్ళోనూ వున్నా ... ఆఁ ! మళ్లీ పిడకలేటలో పడ్డాను. కాలేజీకుఱ్రోళ్ళు ఆడళ్ళ నింత ఏడిపిస్తారా ? కాని మరోడు ఎవడన్నా ఆ ఆడపిల్లని ఏవఁన్నా అన్నా, సేసినా వూరుకోరండి. నా యిసయంలో అలాగే జరిగింది.

"పగలంతా దెబ్బల్తో రోడ్డు పక్క పడున్నానని సెప్పాను గదా? కాలేజీ కుఱ్రోళ్ళో సూసి కొందరు తిట్టుకుంటూ పోయారు. కొందరు ఈసడించు కుంటూ పోయారు ! కొందరు, నేను అడుక్కునే వోణ్ణేవోఁ అనుకుని నా పక్కన డబ్బు లేసి పోయారు.

"సాయంకాలం కూడా నేను అలాగే అక్కడే వుండే సరికి, అదే కాలేజీ కుఱ్రాళ్ళు అక్కడి కొచ్చారు. బస్సు కోసం లాగుంది. నిలబడి వున్నారు. అందులో కొందరు ఆడపిల్లలు కూడా వున్నారు. ఒకబ్బాయి నా దగ్గర కొచ్చాడు. 'ఒరే పొద్దుటా ఈడిలాగే పడున్నాడు. సత్తాడో ఏంటో' అన్నాడు 'సావనిద్దూ! జనాబాఅన్నా తగ్గుతుంది' అని మరోడన్నాడు. ఇలాగ రకరకాలుగా ఆస్కాలాడు తున్నారు. నాకు కడుపుడికి పోతోంది. లేని బలాన్ని అంతనీ కూడా బెట్టుకుని లేసి కూకున్నాను.

'బాబూ ! నేను అడుక్కునే వోణ్ణి కాదు బాబయ్యా!' అన్నాను.

'మరెవరి వోయ్? ఎమ్మెల్లేవా?' అని నవ్వారు.

 

'ఏవోఁ తెల్దుగానీ, నన్ను రవుడీలు కొట్టి యిక్కడ ఈడ్చి పారేసారు'

'ఏంఁ - దొంగతనాల్లో వాటాలు కుదర్లేదా ?' అని మరొకాయన అన్నాడు.

'నేను దొంగను కాదు బాబయ్యా?'

'మరి?'

'మన గుండూ పొపెసరు బాబే మోరా!' అన్నాడొక కుర్రబ్బాయి !

'కాదు బాబయ్యా! ఏవీఁకాను. మా సెల్లెల్ని అన్నాయంగా, ఒక దెత్తు కొచ్చేసి, ఈవూళ్ళో అమ్మేసాడు, నాకు తెలిసి, ఇక్కడి కొచ్చాను. ఆళ్ళ నెళ్ళి అడిగితే, నన్ను సితకబాది యిల్లాగ పారేసారు బాబయ్యా !'

ఈ మాట్లనేసరికి కాలేజీ కుర్రోళ్ళు ఒకళ్ళ నొకళ్ళు సూసుకున్నారు బాబూ.

'మీ సెల్లె లిప్పు డెక్కడుంది ?'

'అదెవరో రంగమ్మ కంపెనీ అట. దాన్లో పెట్టి బందించేసారండి.'

'ఒరే రంగమ్మంటే, మీ 'అత్త' లాగుందిరా' అన్నాడొక బాబు.

'నోర్ముయ్' అని అరిసాడు ఆ బాబు. 'ఏటి ! మీ సెల్లెల్ని ఆళ్ళు ఎబిసారంతోకి దింసేశారా ?' అన్నాడు.

'అవును బాబూ' అంటూ కతంతా సెప్పాను.

కాలేజీ కుర్రాళ్ళు సాలా సిత్రవైనోళ్ళని సెప్పాను కదా బాబూ !

అప్పటి కప్పుడే ఆళ్ళెల్లి, మరి కొందర్ని పిల్చుకొచ్చేసారు.

మరికొందరు చిన్న కర్రలు తెచ్చారు.

ముందు -'పోలీసులకి సెప్దావన్నారు. సాలామంది వొద్దన్నారు.

'పోలీసులకి ఆ రంగమ్మకీ దోస్తీ. ఆళ్ళు రారు. వొచ్చినా కోర్టూ, కేసూ, తిప్పలాట.' అన్నారు.

మరి ఏం చెయ్యాలని ఆలోసించుకున్నారు.

సెణంలో అంతా పోలోమంటూ ఆ రంగమ్మ కొంపమీదికి ఎల్లారండి.

ఆ కొంపలో దొరికిన రవుడీలని, దొరికినట్టల్లా తన్నేసారు. రంగమ్మని సావ బాదారు.

అక్కడున్నా వాళ్ళల్లో నా సెల్లెలెవరో ఆళ్ళకి తెలవదుగా ? అందుకని, అందరి పిల్లల్ని నా దగ్గరికి తీసుకొచ్చారు.

'నీ సెల్లె లెవ'రన్నారు.

నన్ను సూడగానే నాసెల్లెలు బావురుమంటూ నా మీద పడి ఏడ్చేసింది.

అప్పటికే జెనం చాలామంది కూడిపోయారు.

ఆళ్ళనందర్నీ తప్పించడానికి పోలీసులొచ్చారు.

కాని కాలేజి పిల్లల్ని సూడగానే ఆళ్ళెందుకో సల్లగా జారుకున్నారు.

'మీ వూరేదిరా అబ్బి?' అన్నారొకరు.

సెప్పాను.

'ఒరే సోమూ, రమేష్-మీ యిద్దరూ వీళ్ళని వాళ్ళ వూరు దేబెట్టి రండ్రా' అని ఇద్దరు కుర్రాళ్ళని ఇచ్చి, మాసేతికి ఏబై రూపాయలిచ్చి మమ్మల్ని పంపించారు.

ఈ 'కథని' నేను పత్రికలో చదివాను.వివరాలు కూడా పూర్తిగా తెలుసు. ఆ వార్తకి హీరో యితనన్నమాట !

'తర్వాత ?' అన్నాను.

"మేం యింటికొచ్చాక. నేను పది రోజులు మంచాన పడ్డాను. ఆ పది రోజులూ, ఆ కాలేజీ బాబు లిచ్చిన ఏబై

రూపాయిలే మా కాదర వయ్యాయి. కాని... నా సెల్లెలు పదిహేను దినాల్ల గ్వాత కాలవలో పడి సచ్చిపోయిందండి!" అన్నాడు మామూలుగా! ఎలాంటి విచారం లేని మ్రానులాగా!

"ఏం"

"పరువు,"

"నువ్వేం అన్లేదుగా ?"

"అంటానని బయవో, లేక ఇరుగు పొరుగువాళ్ళ మాటలు పళ్ళేకో, పేణాలు బలవంతాన తీసేసుకుందండి."

"మరి ఈ రిక్షావాడు ఎలా కనిపించాడు నీకు మళ్ళీ ?"

"ఒక రోజున పక్కూరికి బేరం వొప్పుకుని ఎల్తున్నానండి. రోడ్డు పక్క ఓ గుడిసిందే. కాపీ, టీ, సారా అమ్ముతా రక్కడ. అదేకాదు, గుడిసేటి యాపారం కూడా వుంది. అణ్ణి సూడగానే నాకిక కోపం ఆగలేదు బాబయ్యా! రిచ్చాదిగి ఆడి మీద పడి, రిచ్చా చైనెట్టి బాదిబాది పేణం తీసేసాను."

"అతను వెంటనే చచ్చిపోయాడా ?"

"చచ్చే వుండాలి."

"నువ్వు నిర్ధారణ చేసుకోలేదా?"

"లేదు బాబూ! ఎందుకు సేసుకోవాలి? నా సెల్లెల్ని నిలువునా కూల్చేసి కాల్చేసి, నాసనం సేసేసాడనే ఉక్కురోసంతో, అంతకు తెగించి బాదాను కాని, సంపాలని అనుకోలేదు. మనసులో ఆణ్ణి ముక్కలు ముక్కలుగా సేసి, సంపేసి కాకులకీ, గెద్దలకీ ఏసెయ్యాలని అనుకున్నాను నిజమే! కాని సెల్లెలు దొరికినాక, ఆ మంట కొంత సల్లారింది. కాని అది పేణం తీసుకున్నాక, మళ్లీ వుడికి

పోయాను. అందుకే ఆణ్ణి సూడగానే గొడ్డుని బాదినట్టు బాధేసాను బాబయ్యా! ఓ నిండు పేణాన్ని నిలువునా తీసెయ్యాలంటే మనిసి ఎంత వుడికిపోయుండాలి? ఎంత దైర్నం కావాలి? ఎంత పిరికి మొండితనం కావాలి? అయ్యన్నీ మనిసిలో వుండబట్టే బాబయ్యా ఈ మోసాలూ, పాపాలూ, దగాలూ కూనీలూను."

"తర్వాత ఏవయింది?" అనిఅడిగాను.

"ఏంవవుద్ది? పోలీసోళ్ళున్నారుగా? ఎవరు? బ్రాకెట్లాడే వోళ్ళ దగ్గర లంచాలు తినే రచ్చక బటులు; లంజల పడుపు కూడులో వాటా కోరే నాయ రచ్చకులు; పెద్దోళ్ళ బయట గేటన్నా దాట్టాన్కి గుండెల్లేని రచ్చక బటులు- ఆళ్ళు నన్నట్టుకెళ్ళి - కొట్లో పెట్టి సితక బొడిసి - నిజం సెప్తున్నా వినకండా లాఠీల్తో కుల్లబొడిసి, ఆనక కోరుటులో నిలబెట్టారు. కోరుటోళ్ళు ఎవరూ నన్నేం అడగలేదు.. సాచ్చికాలు మాతరం అడిగారు. సాచికాలు సెప్పేవోరి మాటలే యిన్నారు. 'ఓరి బాబుల్లారా! ఎందుకింత టైము కర్సు, నేనే ఆణ్ణి సంపాను, ఆడు సేసిన పని యిది బాబూ' అంటున్నా యినుపించుకోకండా, రెణ్ణెల్లు యిసారణ జరిపి, జరిపి సివరికి ఐదేళ్ళు జైల్లో పడేశారు.

"బాబయ్యా! ఈ నాయాన్నీ, ఈ నాయం సెప్పే కోరుటుల్నీ సూస్తుంటే నాకు బలే సిత్తరంగా వుంటాది బాబూ! ఒకసారి నా సిన్నతనంలో మా అయ్య జేబీలో అణకాసు దొంగతనం సేసేసి, ఏదో సినిమా సూసొచ్చాను. ఇంటికొచ్చాక మా అయ్యా 'ఏరా అణా దొంగతనం సేసావా?' అని చెవి పట్టుకున్నాడు. నేను నిజం సెప్పేసాను. దాంతో మా అయ్య రెండు తగల్నిచ్చి- అలా ఇంకెప్పుడూ సెయ్యకు అని ఒకటి తగిల్నిచ్చాడు. ఇదంతా పది నిమసాల్లో జరిగి పోయింది. దొంగతనం, సిక్సా పది నిమసాల్లో మా దగ్గర జరిగి పోయిందే! మరి ఇంత పెద్ద సవులు సచూకున్న వోళ్ళు 'నేనే సంపానర్రా' అంటే రెణ్ణెల్లు ఎందుకు కేసుని యిసారించారో తెల్దు. మా యింట్లో లాగా పది నిమిసాల్లో ఎందుకు జరగదు? అనిపించింది. అది ఇప్పటికీ నాకు ఆలోచిత్తా వుంటే సిత్తరం గానే వుంటాది. సచూకున్న వోళ్ళని నాయం సెప్పమంటే, సంవచ్చరాలు పట్టించాలా బాబూ?"

వాడు చెప్పిందీ నిజమే. నేరమూ, శిక్షా పదినిమషాల్లో పరిష్కారమయి పోయింది. కాని ఇది నవనాగరిక సత్సాంప్రదాయాలు గల సమాజం. ఇది శిక్షాస్మృతి ప్రకారం జరగాలి. అదంతా పాడికి వివరించగలను. కానీ ఇప్పుడు నాకంత టైము లేదు.

"అం. ఇక అది చాలుగానీ, ఇప్పుడు ఆ గెలిచిన రాంబాబు సంగతి చెప్పు." అన్నా.

"రాంబాబు గారేనా? ఆయనే గెలిసారు! ఆయన పారిటీ కూడా గెలిసిందట. మామూలుగానే ఆయన మినిస్టీరు కాలేదు. అందువల్ల మా గుడిసెలు గుడిశల్లాగానే వుండిపోయాయి. మా కుల్లి కాలవలు కుల్లి కాలవల్లాగానే ఇంకా బాగా పెరిగిపోయి, మరికొన్ని సిన్న కాలవ పిల్లల్ని పెట్టేసాయి. వొచ్చే ఎన్నికలకి అయికూడా పెరిగి పెద్దవై పోతాయి. పదిమందికి రిచ్చాలిచ్చారు.

ఊరికినే కాదు, నెలకింతని జవఁకట్టాల! ఆ రిచ్చాలని రాంబాబు తమ్ముడిగోరి అల్లుడిగోరే తయారు సేసేవోరంట! అయితే రాంబాబుగోరు గెలవడంవల్ల మాకో లాభం వచ్చిందండి."

"ఏవిఁటి ?"

"ఇంతకు ముందు కొందరే ఈ గుడి సేటి యాపారాలు సేసేవోరు. ఇప్పుడు సాలామంది సేస్తున్నారు."

"అదా లాభం?"

"లాబం అదికాదు. ఏ పోలీసోడైనా ఆళ్ళని పట్టుకెళ్ళి పోతే, ఆ మారాజు సాయంగా వచ్చి యిడిపించుకొచ్చేవోరు. 'ఎదవ ముండల్లారా ! ఇంకెప్పుడూ యిలాగ సెయ్యకండి. సేస్తే రోగాల్తో సస్తారు.'" అనేవోరు.

"ఇలాగుండాండి ఇది? ఒకరోజున మా గుడిసెల్దగ్గరికి పెద్దపెద్ద కార్లూ, టాకటేర్లూ, మరేయో పెద్ద పెద్ద మెసిన్లూ వొచ్చాయండి. అయ్యన్నీ ఎందుకో అనుకున్నాం. కాని తరాత తెలిసింది బాబూ! మా గుడిసెల్ని కొన్నిట్ని పడగొట్టి అక్కడేదో పేక్టరీ కడతారట. అందులో ఎంత నిజవుందో తెలువదు మరి !"

"నిజంగా ఫ్యాక్టరీయేకడితే అందులో మీకు వుద్యోగాలిస్తావఁన్నారా ?"

"ఎవురికి తెల్సుబాబూ?

ముందు కొన్ని గుడిసెల్ని పడగొట్టేశారు.

అయ్యన్నీ సిన్న సిన్న దుకాణాలోళ్ళవీ, కాపీలమ్ముకునేవోళ్ళవీ, బీడీలూ సుట్టలూ అమ్ముకునేవోళ్ళవీ !

సరే అయి పడగొట్టే పడగొట్టారు.

ఆళ్ళకి మరోసోట ఏవఁన్నా దారి సూపించారా ?

లేదు బాబూ!

ఆళ్ళ మానాన ఆళ్ళని అలాగే వొదిలేసారు.

కొందరు రిచ్చాలు తొక్కడం తెలవకపోయినా, రాంబాబుగారి తమ్ముడి దగ్గర రిచ్చాలు అద్దెలకు తీసుకుని రిచ్చావోళ్ళుగా మారిపోయారు.

సరె! ఆళ్ళు మగోళ్ళు గాబట్టి రిచ్చాలు తొక్కగల్రు, మూటలు మోసుకోగల్రు.

కాని మొగుళ్ళు పోయినా, నీతిగా బతకాలని, సిన్న సిన్న దుకాణాలెట్టుకుని దుంపలూ, పుణుకులూ, జంతికలూ అమ్ముకునే ఆడకూతుళ్ళు ఏవైఁపోతారండి?"

మాలో కొందరుదైర్నంచేసి రాంబాబు గోరింటికెళ్ళి, ఈ అన్నాయం గురించి సెప్పాం.

సెప్తే ఆరేవఁన్నారో తెల్సా బాబూ!

"ఒరే అబ్బాయిలూ, మీ పేట బాగు సెయ్యాలని సర్కారోళ్ళు పూనుకున్నారు. ఇప్పుడు అడ్డుపుల్ల లెట్టారా మొదటికే సెడతారు" అన్నారు.

అంటే అక్కడ పేకటరీ కట్టరన్న మాట, మా పేట బాగుసేత్తారన్నమాట! పోన్లే, పేట బాగుపడుతుందంటే, కొందరు దెబ్బతిన్నా ఫరవాలేదని, అందరం ఓనాడు మీటింగెట్టుకుని సరే అన్నాం.

ఆ మర్నాడు ఎంకటేసులుగారు అక్కడికి కాలినడకనొచ్చి ఒక మీటింగెట్టారు.

అనవాయితీయో లేక ఊతపదమో తెలవదుగానీ 'ముందు ఆ బాబు సోదరీ సోదరీమన్లారా' అన్నారు.

తరవాత 'మీరంతా పేదలు. ఏవో




సిన్న సిన్న కొట్లెట్టుకుని బతుకుతూ వుంటే ఆటిల్ని పడగొట్టి మిమ్మల్ని తరిమేస్తున్నారు'

మీరెక్కడికి పోగల్రు?

పోనీ మళ్ళీ మీకు ఎక్కడన్నా కొట్లు ఎట్టుకోమని తలాలిచ్చారా?

లేదు.

ఇదంతా నాటకం సోదరులారా!

ఆ రాంబాబు బామ్మర్ది పెద్ద కంటరాకటరు.

ఆడికి ఈ మర్దైన కంటారాకుటులు లేవు.

అందుకని, ఆడికి డబ్బు యిప్పించాలని పేటల్నీ, మీ బతుకుల్నీ, మీ నోటికాడ కూడుసీ పడగొట్టించేస్తున్నాడు. అన్నాడండి.

ఆ మర్నాడు రాంబాబు మీటింగెట్టాడు.

ఈయనా సోదర సోదరీ మన్లారా అన్నారు.

"ఎంకటేసులు మాటలు నమ్మకండి.

ఇదంతా ఎన్నికల సంటు.

ఆయన కూడా మీకు అప్పుడేం సెప్పాడు?

మీ గుడిసెల్ని తీసేసి మేడలు కట్టస్తానన్నాడుగా?

ఆయన మేడలు కట్టిస్తే మీ గుడిసెల్ని పడగొట్టడా?

అప్పుడు మీ బతుకులు ఏవైపోయి వుండేవి?

మీరు అతని మాటలు నమ్మకండి.

నేను మీ అందరికీ మంచి యిళ్ళు కట్టిస్తానని నా భార్యా బిడ్డల మీదా, దేశం మీదా, దేవుడి మీదా—చెప్తున్నాను.

మీ పేటను రెండేళ్ళలో సొరగంలా చేసేస్తాను అని—చేస్తున్నాను.

మీ అందరికీ మంచి మంచి పనులు—చెప్తున్నాను.

మీరంతా రామరాజ్యంలో వున్నట్టు వుంటారు.

ఎవరూ అలోలక్షణా అంటూ ఏడుస్తూ— సుకంగా వుంటారు"

"వుపన్యాసం బాగానే వుంది గాని మైకు ఏడిపించింది. మమ్మల్ని పెద్దోళ్ళే కాకుండా మైకులూ ఏడిపిస్తున్నాయిబాబు. మొన్న రేడియోలో వారతలు యింటుంటే రేడియో కూడా కుక్కరుపులే అరిచింది. అందులో వోర్తలు సెప్పే ఆయన 'మొన్న చిలకల పూడిలో, మంతిరిగారు మాటాడుతూ బౌ,బౌ,బౌ, బౌ' మన్నారు. అన్నాడు.

మంతిరిగారే 'బౌబౌ' మన్నారో, రేడియోయే అందో మాకు తెలవక సచ్చాం."

నాకు నవ్వొచ్చింది. "తర్వాత?" అన్నాను.

"తరవాత మళ్ళీ ఎన్నికలొచ్చాయి"

"ఈసారి ఎవరు గెలిచారు?"

"రాంబాబుగారు వోడిపోయి ఎంకటేసులు గారు గెలిసారండి."

"ఆయనేవన్నా చేశారా?"

"ఆఁ! సగం సగం కొట్టేసిన గుడిశలున్నాయి కదా? రాంబాబుగారి పీడా పోయిందని, మల్లీ అంతా ఎవురి తలాల్లో ఆళ్ళు గుడిసె తేసేసుకుని, ఎనకటి హోటేళ్లూ, కొట్లూ, దుంపలూ పుణుకులూ, జంతికలూ అమ్ముకుంటున్నారండి. అలా ఏడాది గడిచింది. ఆ టాకటేర్లూ, మెసీన్లూ లారీలు తుప్పట్టి పోయాయని తీసుకు పోయారండి, శని యిరగ

డయిందనుకున్నాం. కాని మళ్లీ నెల తరవాత కొత్త టాకటేర్లు, లారీలూ, మెసీన్లూ వచ్చి మళ్లీ గుడిసెల్ని పడగొట్టేయడం మొదలెట్టాయండి. ఈసారి అన్నిట్ని పడగొట్టేసారు" "మీ రెళ్ళి వెంకటేసులుగార్తో చెప్పారా!"

"లేదండి మర్నాడు రాంబాబుగారు మీటింగెట్టి, మళ్లీ 'సోదర సోదరీ మన్లారా' అన్నారండి. 'చూసారా? నేను మీ పేటను బాగు చెయ్యాలని జాగరత్తగా ప్లాను వేసి ఒక్కోవీదీ కట్టి, తరవాత అందులో కొందరికి నివాసం ఏరపరిచి, తరవాత మరో ఈది బాగు సేసి, అప్పుడు మరో కొందరికి నివాసం యిచ్చి, తరవాత మరో ఈది యిల్లు కట్టించి, మరి కొందరికియిచ్చి, తరవాత మరో ఈది కొట్టించి, యిల్లు కట్టించి, అప్పుడు మరో కొందరికి యిళ్ళిచ్చి, తరవాత మరో ఈది లేయించి యిల్లు కట్టించి, మరో కొందరికి యిప్పించి, తరవాత మరో ఈది తీసేసి ఇల్లు కట్టి, మరో కొందరికి కేటాయించి, తరవాత.. అంటూ తరవాత, తరవాత, తరవాత తరవాత, తరవాతంటూ

రెండున్నర గంటలు తరవాత తరవాతలు సెప్పి, సెప్పి మొత్తం అప్పుడే అక్కడే రావఁరాజ్యాన్ని సూపించి 'ఆలో లచ్చనా' అని ఏడిపించేరు.

ఈసారి ఎందుకో మైకు కుయ్ కయ్ మన్లేదు.

మాకిక ఆయనగారి వుపన్యాసం యినాలనీ లేదు సప్పట్లు కొట్టాలనీ లేదు.

సివరికి 'బోలో సొతంత్ర భారత్‌కి జై' అన్నారు.

మేం ఎవరం ఆ మాట అన్లేదు.

'అనండి సోదర సోదరీ మన్లారా! బోలో సొతంత్ర భారత మాతకీ జై' అన్నారు.

ఈసారి మైకు గట్టిగా అరిచిందేమో నిద్దర పోతున్న సంటి పిల్లలు లేసిపోయి బేర్ మంటూ ఏడుపులు మొదలెట్టారు.

ఆయనగారికి అరదంగాక 'సోదరులారా-ఎందుకు మీరు జై అంటంలేదూ?" అని మైకులో అడిగారు.

ముందొరసలో నేనే కూకున్నానండి నేను వెంటనే లేసి 'బాబయ్యా మా వందరం పిల్లలు పుట్టకండా నిన్ననే అపరేసన్లు సేయించుకున్నాం. గట్టిగా అరిస్తే కుట్లు తెగిపోతాయని బయంవొల్ల అరటం లేదండి' అన్నా.

దాంతో రాంబాబుగారు బల్ల దిగి ఎల్లిపోయారు.

నాకు నవ్వాగింది కాదు.

"మరి మర్నాడు వెంకటేసులుగారు మీటింగెట్టారా?" అన్నాను.

"ఎట్టారండి."

"ఆయనేమన్నారు ?"

"సరిగ్గా ఈయన సెప్పిందానికి ఎతిరేకంగా ఆయన సెప్పారండి."

"మీలో ఎవరూ ఏం అనలేదా ?"

"ఎందుకన్లేదండి? పాపాల బైరవుణ్ణి నేనున్నానుగా! కూనీ సేసినోణ్ణి, లంజెరికం సేసినదాని అన్ననీ, రిచ్చా ఎదవనీ, రావఁరాజ్జంలో - అలో లచ్చనా అంటూ-రావుణ్ణొదిలి లచ్మనుణ్ణి తలుసుకునే వాణ్ణి - లచ్మనుడు - అన్నగారు సిన్నబుచ్చుకుంటారంటే 'అయ్యో రావాఁ రావాఁ' అనేవోణ్ణి, రావఁరాజ్జంలో, సాకలోడంత దైర్నంగా అనగలిగే వోణ్ణి-నేనున్నానుగా?''




"ఏమన్నా వేమిటి ?"

"అయ్యా వెంకటేసులు గారూ! మీరు గుడిసెలు తీసేసి, మాకు బంగళాలూ, కాలవలూ, ఇసుకూళ్లూ, ఎలట్రీదీపాలూ– ఇంకా ఏయేయో సేయిస్తావని అంటుంటారు. ఆ రాంబాబుగారు 'ఒరే ఎదవల్లారా! మీ గుడిసెలు పీకేస్తే మీరెలాగ బతుకుతార్రా? సర్కారోడి మాటంటే సవాలచ్చ సంవచ్చరాల్కి నెరవేరుద్ది, అందుకా మీరు సత్తారా' అని ఆయనా; మళ్ళీ ఆయన గెలిసి మేడలు కడతా వుంటే మీరొచ్చి 'ఒరే ఎదవల్లారా మీ గుడిసెలు పీకేస్తా మీరెలాగ బతుకుతారు? సర్కారోడి అడ్డరంటే సవాలచ్చ సంవచ్చరాలు పడద్ది' అని మీరూ వుపదేస విస్తే, మిమ్మల్ని గెలిపించాం. మీరు గెలిసి మా గుడిసెలు సగం పీకేస్తే, ఆ మారాజొచ్చి 'ఒరే ఎదవల్లారా–' అని

ఆయనా ; ఆయన గెలిసి మిగతాది పీకేస్తే మీరొచ్చి 'ఒరే ఎధవల్లారా' అని మీరూ-ఇలాగ ముప్ఫయి ఏళ్ల నించీ యినీ, యినీ, యినీ, యినీ - మేం నిజం గానే ఎదవల వనుకుని, ఎందుకొచ్చిన బతుకు - ఎదవల్లాగే బతుకుదావని నిచ్చ యించు కున్నావండి. ఎదవలం మేం. మాకు మల్లా ఎదవలని బిరుదా లెందు కండి ? మా బాబుల తరం ఎదవల్లాగే గడిసిపోయింది. మా తరవూ ఎదవల్లాగే గడిసిపోతోంది. మా పిల్లలతరవూ ఎదవ ల్లాగే గడుస్తుంది. మామనవళ్ల తరవూ ఎదవల్లాగే గడుసుద్ది. అందువల్ల మమ్మల్ని యిలాఎదవల్లాగే బతకనియ్యండిబాబూ.'' అనేశాను. దాంతో ఆ బాబు, ఈ ఎదవలకి యిక బుద్ధిరాదని ఎల్లిపోయి, ఎదవలకి ఎదవల్తోనే బుద్ధి సెప్పి, గ్యానవంతుల్ని సెయ్యాలని, ఏభై మంది ఎదవల్ని మా కొంపలమీదికి పంపాడు. ఆ ఎదవలు సాలా మంచెదవలుగాబట్టి మమ్మల్నీ, మా పెళ్ళాం బిడ్డల్నీ ఏం అనకుండా, మా గుడిసెలకి నిప్పటించారు. ఆంజ నేయుడు మనోడు. అతగాడి బాబు వాయుదేవుడూ, అగ్గిదేవుడూ-రాంబాబూ, ఎంకటేసులల్లాంటి సేవింతులు"

"ఆ దేవింటి ? విరోధులుకదూ ? ఎలక్షన్లలో ఒకరిమీద మరొకరు నిలబడి, ఒకరిమీద మరొకరు నేరాలు మోపు కుంటారు కదయ్యా?"

"తవంరికి ఈ మోసాలు తెలవ్వేటి బాబయ్యా ? రైతులుకదా సరిగ్గా తెలిసి వుండదు. పైకి ఎంత యిరోదుల్లాగున్నా లోపల సేవింతులే, బాగా పెద్ద గాలేస్తుంటే సిన్న నిప్పు రాజుతుందా ? తుప్పున ఆరిపోద్ది. అలాగే పెద్ద అగ్గి లేసినప్పుడు గాల్లేకపోతే ఆ అగ్గి కొంతసేపయ్యాక సల్లారి వూరుకుంటుంది. ఈళ్ళిద్దరికీ అలాంటి సేవింతవేం! రోజూ ఈళ్ళిద్దరూ, సినీమాఆలు ఎనక గదిలో కూకుని, యిదేసీ సారాలు తాగుతూ, పెద్దింటి పిల్లల్తో సరసాలాడ్తుంటారు. ఈళ్ళతో బాటు సేర్‌మేన్లూ,సూడండి పన్ను లేస్తారు ఆ అధికార్లూ, పోలీసుల్లో పెద్ద దొర్లూ, కోరుటు లాయర్లూ, డాకటేర్లూ-ఒకరేంటి అంతా అక్కడే వుంటారు".

"నువ్వెలా చూశావ్?" అనడిగాను.

"సూసావ్ అనకండి. ఎలా తెలిసింది అనండి".

"సరే! ఎలా తెలిసిండి?"

"అందరికీ తెలిసిన బాగోతం నాకు ఎందుకు తెలవదుబాబూ?"

"అంతే విన్నావా?"

"కాదు. ఒకసారి మొదటాట యిడిసి పెట్టినాక, ఏం బేరాలు దొరక్క, సినిమా ఎనక సందునించి బేసన్‌కి పోతున్న. అక్కడ ఓ కారు ఆగిపోయుంది.అందులో సాలామంది ఆడా మగా వున్నారు. నా రిచ్చాని చూడగానే ఆల్పారు. ఆపిన ఆయన్ని సూడగానే నా పై పేణాలు పైనే ఎగిరిపోయాయి బాబూ"

"ఏం?"

"ఆయన...ఆయన పోలీసోళ్ళందరికీ పెద్ద".

"ఏవన్నాడు?"

"ఈ ఆడవాళ్ళని సినిమాదగ్గర దింపి రమ్మన్నారు. ముందు ఆడాళ్ళు రిచ్చా ఎక్కడానికి ఒప్పుకోలేదు. తరువాత ఎక్కారు. ఆళ్ళని సినిమాకాడ దింపి, మళ్ళీ రమ్మన్నారు. అలాగే సేసాను. తరువాత ఈ రాంబాబుగోరు ఎక్కారు. సీసాలు పెట్టెలోపెట్టి ఎక్కించారు.




అయ్యా దించి వచ్చాను. తరవాత పోలీసు బాబుని తీసికెళ్ళాను. లోపల దించి డబ్బులకోసం నిలబడివున్నాను. కిటికీ లోంచి నాకు అంతా కనిపిస్తోంది. ఆ ఆడోళ్లలో ఒకమ్మని ఎక్కడో సూసినట్టు గుర్తు. తల బద్దలుకొట్టుకున్నా గుర్తుకు రాటంలేదు. సివరికి గుర్తొచ్చింది. ఆ అమ్మగారు సినిమాల్లో ఏస్తావుంటారు. నాకు బాగా తెలుసు."

"ఏం పేరు ?"

''పేర్నాకు గురుతు లేదుగానీ, సాలా సినిమాల్లో ఏసింది. ఆమెకి, రాంబాబు గారు ఒక పక్క కూకుని, గ్లాసులో యిదేసీ సారా ఏసి యిచ్చారు. అంతా గ్లాసులు తాకించి తాగుతున్నారు''

''మరి నీకు డబ్బులు''

'ఎవరిస్తారు బాబయ్యా; లోపలకెళ్ళి అడగలేను గదా? ఒకరు పోలీసు బాబు మరొకరు మా ఓటుల్తో నెగ్గిన మారాజు మరొకరు మా వోట్లు పడక, పోయిన మారాజు ఇక ఆడోళ్ళంటారా? సినేమా వాళ్ళు. అలాగ కాసేపు నిలబడి, రామ రాజ్జంకదా - అలో లచ్చనా అంటూ పోయాను''

"నీకెందరు పిల్లలు గురువులూ ?''

"సిన్నా సితకా అంతా కలిసి మొత్తం పది మందండి, సివర పిల్ల వొయసు పదారు.

''మరిక పిల్లలు పుట్టలేదా?''

''ఇంకెలాగ పుడతారు బాబయ్యా? నాకూ నా భార్యకీ సంసార సంబంధం పోయి పదిహేనేళ్లయింది'

''అదేం?''

అతను చిరునవ్వు నవ్వాడు.

''నా వొయసిప్పుడు ఏభై అయిదేళ్ళు. ఇంకా 'సంసారం' సెయ్యమంటారా ఆడదాంతో"

''మరి కోరిక లుండవ్?''

''మనసులో వుంటాదిగాని, సరీరం సడలిపోయింది. అయినా ముని మనవల్లు పుట్టేసినాక కూడా నేనింకా పిల్లలకోసం తాప త్రియం పట్టం-ఆళ్లకెలాగుంటాది?' అని సన్నగా నవ్వుకున్నట్టున్నాడు.

''అని కోరికల్ని చంపేసుకుంటు న్నావా ?''

''అసలు పుట్టంది, కోరికేసంపుకోడ మెక్కడుంటాది? పందుల్లాటోళ్లం. మాకు కోరికలేం వుంటాయ్ బాబయ్యా?'

పదిమంది పిల్లల్ని కన్నానన్నావ్ కదా - వాళ్ళనందర్నీ ఎలాగ పోషిద్దామని ?''

''అందర్నీ ఎల్లకాలం మనమే పోసించాలా బాబూ! ఒక్కొక్కళ్లకి రెక్కలు రాగానే, ఏ అయ్యకో, అమ్మకో యిచ్చి కట్టబెట్టెయ్యంవూ?''

"అందరికీ పెళ్ళిళ్ళు చేసేశావా ?'

''ఆఁ'

''అంటే ఇప్పుడు నువ్వూ, ముసలమ్మా మాత్రమే యింట్లో వున్నారన్న మాట''

''కాదు బాబు పెద్దది యిదవై నాయింటోనే వుంటోంది. నాలుగోదాన్ని మొగుడొదిలేసాడు. ఆడు దేన్నో మరిగి, దీన్ని నానా బాదలూ పెడ్తుంటే, సూళ్ళేక నేనే తెచ్చేసుకున్నాను ఆళ్ళిద్దరికీ కలిపి ఎనమండుగురు పిల్లలు.''

''వాళ్ళనందర్నీ నువ్వే పోషించాలా?''

''కనుకున్న తరవాత తప్పుతుందా బాబూ? అయితే పెద్ద కూతురు కొడుకు



కూడా, రిచ్చాయే తొక్కుతాడు. ఇంటో రోజుకి రూపాయిస్తాడు. మిగతా ఎం తొచ్చినా సినీమాలకీ, బట్టలకీ తగ లేస్తాడు?

"నువ్వు వారించవా?"

"బాబూ! వారిస్తే నామాట యింటాడా! తరం మారింది. ఆడికీ మంచి గుడ్డలేసుకు తిరగాలనీ, సేవితుల్తో షికార్లు కొట్టాలనీ వుంటాదిగదా! నా తరంలో, సేనెలాగూ గుడ్డలకి నోసుకోలేదు. పోనీ ఆడన్నా తిరుగుతున్నాడు. అదే నా ఆనందం."

"తాగుతాడా?"

"రావం రావం. ఆ బుద్ధుల్లేవు. ఆడు మా పేట్లో కమ్మూనిస్టు పార్టీలో వుండే వాడు. పది మందినీ సేర్చి, మంచి మాట్లు సేప్పేవాడు. తరవాత ఆ పారిటీలో ఏయో సీలిక లొచ్చాయట. ఈ దేసంలో కాదు. మరేయో దేసాల్లో నట. అందుకని ఆ దేసాన్ని ఇస్టపడేవోరు—ఒక కమ్మునిస్టులయారట; మరోదేసాన్ని సవంర్ధించే వోళ్ళు, మరో పారిటీ కమ్యూనిస్టులయారట. మల్లీ తరవాత మల్లీ సీలిపోయారట. ఇక ఈడు, వాదించి వాదించి, మన్దేసంలో సొదేసీ కమ్మూనిస్టు పారిటీ మనవే ఏరపాటు సేసుకుందావన్నాడట. దాని కెవరూ వొప్పుకోలేదు. దాంతో పారిటీలూ గిరిటీలూ మానేసి, ఇప్పుడాడు ఏయో కదలు రాసుకుంటా వుంటాదండి. అయ్యి పేపర్లలో పడతా వుంటాయి. అక్కణ్ణుంచి ఆడికి పదీ పరకా వస్తావుంటాయి."

"అలాగా? ఎంత వరకూ చదువుకున్నాడేవిటి?"

"ఎంత వరకూ సదివించగలం

బాబూ ? అలోకలాసు సదివి మానే సాడు. మొన్నలాగుంది అడు మెట్టి రిక్కటట. అది సదివి పాసయ్యాడు."

"ఇంకా రిక్షా తొక్కుతూనే వున్నాడా ?"

"మరేం చేత్తాడు ?"

"ఏ గుమస్తా వన్లోనైనా చేర కూడదూ ?"

"బాబూ ! ఎమ్మేలూ, బియ్యేలూ సదివినోళ్ళకే వుద్దోగాలు దొరకటంలేది ప్పుడు. కేవలం రిచ్చావోడి మనవడికి దొరుకుతాదా ఉద్దోగం ? ఆడి పనేదో ఆడు సేసుకుని తల్లినీ తమ్ముళ్లనీ సూసు కుంటున్నాడు."

"అవునూ ! నువ్వు ఈమధ్యసంతాన నిరోధం ఆపరేషన్ చేయించుకున్నావా ?

"అవునండి"

"ఎప్పుడు ?"

"రెండేళ్ల కిందటనుకుంటాను."

"మరి మీ భార్యాభర్తలకి సంసార సంబంధం లేదన్నవ్ కదా, ఈ ఆపరేష నెందుకు ?"

"అది చేయించుకుంటే ఎనభై రూపా యలిసారట-దాని కాసపడి సేసుకున్నాను కాని తీరా ఆపరేసయాక నాకు ముట్టింది ఇరవయ్యే !"

"ఆదేం ?"

"నన్ను ఆసపటాలికి తీసికెళ్ళినాడు ఇరవై తీసుకున్నాడు ఆపరేసను సేసిన డాకటేరు నలభై లాక్కున్నాడు. ఇక మిగిలింది ఇరవై. కానీ అక్కడున్న నరసమ్మ రెండ్రూపాయలడిగింది. మరో పాకీవోడు రూపాయడిగాడు. మరో దెవడో మరో రూపాయడిగాడు. కానీ నేను ఎవరికీ యివ్వలేదిక. ఆ ఇరవై యియ్యా పట్టుకుని యింటి కొచ్చాను. కానీ రెణ్ణెల్లు రిచ్చా తొక్కకూడదని తరాత తెలిసింది. ఆరెణ్ణెల్లూ ఎలాగ బతి కానో ఆ బగమంతుడికి తెలియాలి... ఆఁ బాబూ ? ఒక సిటవిఁక్కడుంటారూ? ఇప్పుడే వొస్తాను !"

గురువులు రిక్షాదిగి, కొంతదూరంలో పాకలావున్న పెంకుటింట్లోకి వెళ్ళి, మూడు నిమషాల్లో వచ్చేశాడు.

వాడు రాగానే గుప్పుమంది వాసన.

"సారా తాగేవా ?"

"అవును బాబూ !"

"రోజూ తాగుతావా ?"

"లేదు. పొద్దుట్నుంచీ రిఖ్చా తొక్కు తున్నాను. వొళ్లంతా వూనవై(పోయింది. ఇదేసుకుంటే కూస్తంత నెప్పులు తగ్గు తాయి. సరే యిక ఎల్దావా ?"

"నడు."

"నిజంగా ఎల్లాలనే వుందా బాబూ?"

"నువ్విన్ని నిజాలు చెప్పాక, తప్ప కుండా వెళ్ళాలని వుంది."

"అళ్ళ దగ్గర జబ్బులుంటాయి బాబూ ?"

"ఫర్వాలేదు."

"సరే మీయిష్టవైతే !"

రిక్షా ఎక్కి తొక్కాడు.

"వాళ్ళెంత తీసుకుంటా రేవిటి గురువులూ ?"

"అద్దరూపాయినించి ఏభై రూపా యల వరకూ తీసుకుంటారు."

"ఏందుకాతేడా ?"

"తేడా ఏంటి? అళ్ళ రేట్లంతే! తమరు సిన్న ఒటేల్ కెల్లారనుకోండి పదిహేను పైసలేటి. అదే పెద్ద ఓటేల్ కెల్లండి ? రూపాయి?"

"దానికి దీనికి పోలికేఁటయ్యా ?"

"యాపారం బాబూ! పోలికలు కావు! టీలో ఇషవుందంటారు. అది బడ్డీ కొట్టులో తాగినా యిషవేఁ. పెద్ద ఓటేల్లో తాగినా యిషవేఁ!"

"నిషా వాడికి ఎక్కుతున్నట్టుంది."

"సిన్న లంజ దగ్గర సిన్న జబ్బులూ పెద్దదాందగ్గర పెద్ద జబ్బులూ వుఁడవ్! అందర్దగ్గరా కొరుకూ, సెగ' అడ్డగ్గర ఇఁకా ఏటేటో వుంటాయి. వెంటనే ఎల్లి డాకటేరు దగ్గర ఇంజీసను సేయించుకోవాలి. లేకపోతే పొద్దుటికి కాకపోతే పదిరోజులు కన్నా తగులు కుంటాది. డాకటేరు ఎక్కడో సిటీలో వుంటారనుకోకండి. ఈ లంజలీది సివర్నే వుఁటాఁడు. ఆడు కూడా, ఈళ్ళ జబ్బుల మీదే పడి బతుకుతుంటాడు. ఇప్పుడా మాఁరాజు వూళ్ళో మూడంతస్తుల మేడ కట్టాడు-ఈళ్ల డబ్బుతోనే!"

"అంత డబ్బొస్తుందా అతనికి?"

"ఆ! ఈళ్లు వారంవారం ఆ డాకటేరు దగ్గరకెళ్ళి సూపించుకుంటారు. అంతా పరీచ్చ సేస్తాడో లేదో గానీ రెండేసి ఇంజీసన్లు కసిక్కున పొడిసి, పది రూపాయలు తీసుకుంటాడు. అదే బయట మరో డాకటేరయితే అయిదే పుచ్చు కుంటాడు. కానీ ఈళ్ళు ఈ గుమ్మా లొదిలి బయటకెళ్ళరు. ఎల్తే ఆ సమయంలో రెండుమూడు బేరాలు పోతాయి గదా?"

"రోజూ ఒక్కొక్కరి దగ్గరికి ఎంద గొస్తూవుంటారు?"

"సీజన్ని బట్టి వొస్తారండి. మంచి సినిమా వొచ్చిందనుకోండి ఒక్కోదాని దగ్గరికి పాతిక నించే ఏభై మంది వరకూ వస్తారు."

"మైగాడ్! ఏభై మందే!"

"ఎభై మందేటి బాబూ! లోకంలో వున్న మొగ జనాబా అంతా వొచ్చినా భరించగలరు. ఆళ్ళు మనుసులనుకున్నా రేంటి? రాళ్ళు. రాళ్ళు బాబూ! వొట్టి రాళ్ళల్లాగా మారిపోయారు. అత్తల్ను కుంటే గుండె సెరువై పోద్ది! మరి ఆళ్ళు పుట్టడవేఁ అలాగ పుట్టారో, లేక అల వాటే అయిపోయారో తెల్దు. బహుశ రెండూ అనుకుఁటా. లేదా ఆ డాకటేరు బాబు ఈళ్ళకి బలానికీ, దానికీ, ఏవన్నా మందులన్నా యిస్తా వుండాలి. కానీ బాబూ! ఈళ్ళు ఎంత లంజలైనా, మా బక్తులండి! రోజూ పొద్దుటే లెగిసి, దేవుడి పూజ సేసిగాని, ఏ పనీ సెయ్యరు. అన్ని వొతాలూ సేస్తారు. అందరి దేవుళ్ళకి మొక్కుతారు. కానీ ఎందుకో కొందరు దేవాలయానికి మాతరం ఎల్లరు."

"ఏం?"

"ఏవోఁ!"

"బహుశః అక్కడ తెలిసిన పాత జనం కనిపించి వెక్కిరిస్తారనేమో!"

"అదీ కావచ్చు. లేదా ఆ పూజా రైనా రానియ్యడు."

"అతనెందుకు రానివ్వడు?"

"ఆళ్ళల్లో, కొందరు, రేత్రిళ్ళు ఈ గుడిసెల్లోకి వస్తా వుంటారు. ఆళ్ళు ఇక్కడికి రాగా లేంది. ఈళ్ళు గుళ్ళోకి వొస్తేనే తప్పట."

ఇంతలో ఎవరో ఒక పోలీసు ఎదురు పడ్డాడు.

"ఒరేయ్" అని అరిచాడు.

గురువులు అదిరిపడి రిషా ఆపాడు.

"దొంగ నాకొడకా! దీపవేఁదిరా




రిచ్చాకి?"

గురువులు వొంగి చూశాడు. దీపం ఆరిపోయినట్టుంది.

"బాబయ్యా! ఇంతవరకూ ఎలిగే ఉంది."

"అంటే? నే నెదురు పడి వూది ఆరిపేశాన్రా లంజకొడకా?"

"అల్లా గెందుకంటా బాబయ్యా! గాలి కారిపోయుంటాది! సూడండి బా బూ! దీపం ఇంకా ఏడిగానీ వుంది."

"ఏడిగా వుంటే నాకేట్రా, సల్లగా వుం టే నాకేట్రా. నేన్చూసినపుడు, లైట్లేదు. ఇయ్యి డబ్బు?"

"దే ని కీ" అని నేనుండబట్టలేక అడిగాను.

"ఫైను."

"ఫైను మీరే కట్టు కుంటారా?"

"ఆఁ"

"కోర్టువాళ్ళు కట్టుకోరాఁ"

"ఎవడ్రాడు, రూలుసు మాటాడు తున్నాడు? ఏయ్ ముందు రిచ్చాదిగు" అని గర్జించాడు పోలీసు.

రిక్షాదిగాను.

"ఎవర్నువ్వు? "

"ఆర్డీవూరు కాదండి బాబయ్యా" గురువులు నన్ను 'రక్షించా'లని మధ్య కలిగించు కున్నాడు.

"నువ్వుంద్రా నాకొడకా...ఏవయ్యా ఏ వూరు నీది ?"

"చింతలూరు"

"అందుకా సింతకాయలాగా ఎగుర్తు న్నావ్? పద టేసన్ కి."

నేను తయారయాను. కాని గురువులు ఒప్పుకోలేదు. పోలీసు కాళ్ళా ఏళ్ళా పడ్డాడు.

"బాబూ! ఆరికి మనూరు సంగత్తెల్దు. రైతుబిడ్డ. ఎలాగ ఏం మ్మాటాడాలో తెల్దు. ఈ సారికి మన్నించి వొదిలి పెట్టెయ్యండి బాబయ్యా" అని పోలీసు చేతిలో కొంత డబ్బు పెట్టాడు.

డబ్బు చేతికో పడగానే పోలీసు నోటి దురుసు తగ్గింది.

"జాగర్త. పోలీసోడితో ఏలాకోలాలు పనికిరావు. బతికి పోయావ్ ఫో," అని గురువులిచ్చిన డబ్బులు జేబులో వేసు కుని పోలీసు వెళ్ళిపోయాడు.

"ఎంతిచ్చావ్?"

"పావలాయే లెండి. కక్కుర్తి నా కొడుకులు! ఎంతిచ్చినా తీసుకు పోతారు. ఇలాగ రోజూ రేత్రిర్లు పాతిక వరకూ దండు కుంటారండి. ఆళ్ళు మాత్రరం ఏం సెయ్యగల్రండి ? జీతాలు తక్కువ. పెళ్ళాం బిడ్డలూ మాకంటే ఎక్కువ. అందర్నీ పోసించాలంటే, ఆళ్ళ జీతాలు సరిపోవు గదండీ ! అదీగాక ఒక్క పోలీసోళ్ళే సమ్మెలు సెయ్యకూడదు. ఆళ్ళు సమ్మెలు సేసే రూలుంటే, ఈళ్ల పూటకి పదేసి సమ్మెలు చేసుండేవోరు. గవరనమెంటు ఈ పోలీసోళ్ళ యిస యంలో ఇదొక్కటే మంచి పని చేసే సింది. సర్లే తమరు కూకోండి ఎల్దాం"

కూచోలేదు నేను.

"అవును. ఇంత దూరం వచ్చాం. ఇక్కడ ఏం యిళ్ళు గట్రా లేవు. ఇంకెంత దూరం వెళ్ళా లేవిటి?"

గురువులు చుట్టూ చూశాడు.

"ఓర్నాయనో సాలా దూ రం వొచ్చేసినామండి. అసలు యిది మరో వూరు. మాటల్లో పడి దారితప్పి పోయాం."

ఉస్సురన్నాను.

"ఎంత దూరం వచ్చేశావేమిటి?"

"ఓ యబ్బో ఆరేడు మైళ్ళు పైనే వచ్చేశావండి"

"ఇప్పుడెలా అయితే!"

"తమరు కూకోండి, వెనక్కి తిప్పి తీసికెల్తా"

"అంటే మళ్ళీ ఈ ఆరేడు మైళ్ళు వెనక్కి తొక్కుతావా?"

"ఆ రేడు మైళ్ళుండదండి. మూడు మైళ్ళు వుంటాది. తమరు కూకోండి"

కూచున్నాను. గురువులు రిక్షా ఎక్కాడు. తొక్కడం మొదలెట్టాడు.

"గురువులూ! ఇలా రోజుకి ఎన్ని మైళ్ళు తొక్కుతుంటా వయ్యా"

"సరిగ్గా సెప్పలేనుగాని ఒక్కో రోజున ఏభై ఏసి మైళ్ళు పైనే తొక్కుతానండి"

"అంటే దాదాపు పాతిక రూపాయలు పైనే సంపాదన వస్తుందన్న మాట మైలుకి అర్ధరూపాయి చొప్పున."

"రావటం వరకూ నిజమేగాని, ఇంటి కెల్లే సరికి ఐదో పదో మిగులుద్దండి"

"అదేం"

"అంత దూరం తొక్కాక, వొళ్ళు పులిసి పోద్దండి. గంటకోసారి సుక్కేసుకోపోతే బతకలేపండి"

"గంటకోసారా? అంత తాగుతావా?"

"ఎంత తాగినా అంతా నీళ్ళేకదండీ? అది సరైన సారా అనుకున్నారేంటి? సగానికి పైగా నీళ్ళు కలిపేస్తారు"

"మరి ఎక్సయిజ్ వాళ్ళు వాళ్ళని పట్టుకోరూ!"

"బాబయ్యా! అన్నిటికీ మొదటికే వొచ్చి, 'సీతేమవుద్దీ' అని అడుగుతారేం టండీ?"

అళ్ళకి ఈ సారా దుకాణపోళ్ళు ఎప్పటికప్పుడే ముట్ట చెప్పుకుంటూ వుంటారండి.

ఏ సారావోణ్ణి సూడండి. ఏ ఎక్కుసైజోళ్ళని సూడండి-అందరికీ సొంత కొంపలూ, సొంత యాపారాలూ వుంటాయి. ఈళ్ళు ఇంతింత గడించేసుకుంటారా? కాని ఏం లాబం?

సచ్చేప్పుడు ఏం తీసికెళ్తారు?

మేవేం తీసికెళ్తావోఁ అళ్లూ అదే తీసికెళ్తారు.

మేం ఏ సొసానానికి పోతావో, అళ్లూ ఆ సొసానానికే వొస్తారు!

అళ్ళకీ ఆరడుగులూ, మూడడుగులూ గొయ్యే, మాదీ అంతే.

ఈ మాతరం ఏదాంతం తెలిసి కూడా బతికున్నన్నాళ్ళూ ఎందు కిలాంటి పాపాలు సేస్తారో తెలవదు.

కాసి బాబయ్యా డబ్బు అళ్ళు ఎలా గడించుకున్నా, అళ్ళకి డబ్బు నెలాగ కరుసు సెయ్యాలో తెలుసు. అళ్ళ పిల్లలు డాకటేర్లు సదువుతారు.

మేస్టీర్లు సదువుతారు.

జర్జీలవుతారు.

పోలీసు పెద్ద లవుతారు.

మినిస్టీరు లవుతారు.

కాని మేవుఁ?

మాకు నెలకు ఎయ్యి రూపాయలు దొరికినా, సారా కొట్లలో దిమ్మరిస్తావేఁ గాని పిల్లల్ని సదివించవ్ఁ!

ఎందుకు?

ఆ సదువు యిలవ తెలవద్దుగా?

తెల్సినా మా పిల్లలకి ఎవడుద్దోగా లిస్తారండి?





అని కాసేపు రొప్పుతూ, నిషాబాగా ఎక్కిపోయి గబగబా రిషా తొక్కేశాడు.

వీధి చివర్లో రిషా ఆపాడు. దిగాడు.

"బాబయ్యా! వచ్చేశాం. ఆ కనిపించే పెంకుటిల్లే రండి ఎల్దాం."

నేనూ రిషా దిగాను.

గురువులు ముందు నడుస్తున్నాడు. నేను వెనక నడుస్తున్నాను.

వీధి చాలా సందడిగావుంది. పక్కనే కాలవ వుంది.

వీధిలో ఎలక్ట్రిక్ దీపాలు వున్నాయి.

అవి దేశనాయకుడి వాగ్దానాల్లాగ దేదీప్యమానంగా వెలగటంలేదు.

ఓనమాలు రాని పార్టీ సభ్యుల్లా వెల వెలబోతున్నాయి.

అయిదేళ్ళ కాలంలోనూ ఎసంబ్లీలో గానీ, పార్లమెంటులోగానీ ఒక్క మాటా మాటాడలేని పిరికి లక్షాధికారిలా, నీళ్ళు కారిపోతున్నాయి.

ఆంధ్రదేశపు ఔన్నత్యాన్ని చాటే వీధి అది.

అంటే అష్టవంకర్లతో, కంకర రాళ్ళతో, ఎర్రమన్ను ధూళితో - ఎందు కొచ్చిన బతుకురా అన్నట్టు ఈసురో మంటున్న పందుల్లాంటి మనిషి రక్తం గల, ఓటుగల గుడిసె పౌరుల్లా వుంది.

వీధిలో, మూడేసి గజాలకొక కిళ్ళీ దుకాణం వుంది.

అందులో సోడానించి నిరోధ్ వరకూ దొరుకుతున్నాయి.

అందులో కూచున్న ఆడవాళ్ళు, కొడిగట్టిన దీపాల్లా వున్నారు

మాటాడిస్తే మంధరకంటే ముందు పుట్టిన మగువల్లా వున్నారు.

టీ దుకాణాల ముందు బెంచీలు వున్నాయి.

బెంచీల చిల్లుల్లో నల్లులున్నాయి.



బెంచీల మీద భల్లూకాల్లాంటి భయంకర భారతీయులు సన్నగా, పొడుగ్గా, పొట్టిగా, కోపంగా, నిరాశగా, ఆనందంగా, అనురాగ మయుల్లా, అను మానపు చూపుల్తో వచ్చేపోయే వాళ్ళని చూస్తున్నారు.

మఫ్టీలో వున్న ఇద్దరు పోలీసులు వాళ్ళతో పరాచికాలాడుకుంటున్నారు.

"రండి బాబూ !" అని గురువులు ముందునించీ.

"వస్తున్నా" అని వెనకనించి నేనూ మాటాడుకుంటున్నాం.

ఆ పెంకుటింటి ముందుకి తీసి కెళ్ళాడు.

పెంకుటింటి అరుగు మీద నులక మంచం వుంది.

నులకమంచంమీద, నలుపూ ఎరుపూ కలిసిన మనిషి కూచుంది.

ఆకారాన్ని బట్టి సెక్స్ తెలీదు.

గొంతుకని బట్టి అసలే తెలీదు.

రోడ్ రోలర్‌లా పైనించి కిందికి సిలిండర్‌లా వుంది.

పొట్టి జడ వుంది. అందులో బంతి పూలు వున్నాయి.

నోట్లో-బాబా జర్దా కిళ్ళీ-పిండిమరలో ఆడినట్టు నలిగిపోతోంది.

మురమండ పిల్ల యిదేనా అను కున్నాను.

"సీతేది రవణమ్మత్తా? అన్నాడు" గురువులు.

ఆమె మాటాడకండా నా వేపుచూసి, మెల్లగా మంచంమీంచి లేవడానికి మూడు సార్లు ప్రయత్నంచేసి మూడుసార్లూ ఆయాసంతో మంచంమీద పడిపోయింది.

ఇండిపెండెంట్ అభ్యర్థిలా!

పడినపుడల్లా నులక తెగుతోంది.

చివరికి లేచి గురువుల్తోబాటు లోపలి కెళ్ళింది.

"ఎవరా మనిషి?"

"పరాయూరట, సీత లేదా?"

"మంచోడేనా?"

"సీతేదంటే సెప్పవేం ? ఆళ్ళు మంచోళ్ళో, సెడ్డోళ్ళో నాకు తెల్దా ? సెడ్డోళ్ళ నెప్పుడన్నా తీసుకొచ్చానా ? సీతేది ?"

"కంగారేంటి పిలుస్తానుండు" అని, ఆ సిలిండర్‌లాంటి భారతీయ లలన కేకే సింది.

"రేటెంతో చెప్పావా?"

"లేదు"

"చెప్పలేకపోయావా ?''

"ముందా సీతని చూడనియ్. ఆయనే యిస్తారు".

లోపల్నుంచి సీత వచ్చింది. గురువులు బయటకొచ్చి, నన్ను లోపలికి తీసికె ళ్ళాడు. కొత్త పెళ్ళికొడుకు తండ్రిలా గాకండా, పాత వరుడి తమ్ముళ్లా లోపలికెళ్ళాను.

"సీతంటే ఈ అమ్మాయేనండి" అన్నాడు గురువులు, ఎలాంటి భావమూ ముఖంలో కనిపించనివ్వకండా!

సీత అనబడే అమ్మాయి గోడకి దగ్గరగా నిలబడి వుంది. పాతికేళ్ళకి యిటూ అటూలో వుండొచ్చు. ఏమైనా- 1947 ఆగస్టు 15వ తేదీ తర్వాతే పుట్టిన పిల్ల. భారతదేశపు స్వతంత్రం గురించి తెలీని పిల్ల!

ఆమె వేపే చూస్తున్నాను.

ఆమె జడని వేలికి వంకీలు చుట్టు కుంటోంది.

 

నేను గదిని చూస్తున్నాను.

రోలర్ నన్ను చూస్తోంది.

గోడనిండా, సగం సగం గుడ్డలు విప్పేసిన సినిమా తారల ఫొటోలు వున్నాయి. ఇంకా ఇంకా చిత్రకారులు చిత్రించిన నగ్న చిత్రాలూ వున్నాయి.

"ఎంత సేపుంటారాయన ?" అంది బాబాజర్దా 'నులకమంచీశ్వరి'.

"ఏమండి ఎంత సేపుంటారు ?" గురువులు నన్నడిగాడు.

"ఎంతసేపుంటే ఎంతివ్వాలి ?" అన్నాను.

"ఒక సారుంటే ఐదు. గంటుంటే నలభై" అంది బా.జ.ను. మంచీశ్వరి.

"రాత్రంతా వుంటే?"

"వంద".

"సరే ఎంతకావాలి చెప్పండి ?" అన్నాను.

"అదేంటి? వుండేది నువ్వు. నువ్వు సెప్పే రేటు సెప్తాం" అంది బా.జ.ను. మంచీశ్వరి ఏకవచనంలో.

"అరగంటా-గంటా మధ్య వుంటా నేమో!" అన్నా.

"అరగంటయినా గంటయినా నలభైయ్యే" అంది వ్యాపారసరళిలో.

జేబులోంచి నలభై తీసిచ్చాను. 'సిలిండర్ భారతి' డబ్బు తీసుకుంది.

గురువులు బయటకు వెళ్ళబోయాడు. అతని వెనక నేనూ వెళ్ళాను. అయిదు పదిరూపాయల నోట్లు వాడికిచ్చాను. అయిదు రూపాయలనుకున్నట్టున్నాడు. తేరపారి మళ్ళీ చూసుకున్నాడు. ఆశ్చర్యంగా నావేపు చూశాడు.

"బాబయ్యా! ఏభై యిచ్చారు!"

"అవును".

"ఏభై నాకెందుకు బాబయ్యా? నా రేటు ఐదే!"

"అలాగని నువ్వు రిక్షా ఎక్కినపుడు చెప్పలేదుగా?"

"ఏభై యిస్తావని తమరూ సెప్ప లేదుగదా?"

"చెప్పకపోయినా అనుకున్నాను. వుంచుకో".

"వద్దు బాబయ్యా! అది అన్యాయం. నాకు మనసొప్పదు".

"అయితే, అయిదే నువ్వు తీసుకుని, మిగతా నలభై అయిదూ బేంకులో వేసుకో".

"ఎందుకు?"

"నీకు కష్టకాలంలో పనికొస్తాది".

ఏమనుకున్నాడో వాడో ఛప్పున వంగి కాళ్ళకి నమస్కారం చేశాడు.

"ఛఛ! ఇదేవిటి? నీకంటే చిన్నవాణ్ణి యిలా చెయ్యొచ్చా. లే!"

"బాబయ్యా"-వాడి నోట మాటలేదు. "బాబూ! ఆ రోడ్డు సివర తమరొచ్చే వరకూ వుంటాను. తమరొగానే తిరిగి తీసికెళ్ళి దింపుతాను" అని కళ్ళు తుడుచుకున్నాడు.

"వద్దు. నేను ఎప్పటికొస్తానో ఏవిటో? వెళ్ళిపో?"

"ఆ పిల్ల నచ్చిందా ?" అన్నాడు గురువులు.

"నువ్వు నచ్చలేదూ?"

"బాబు మా సితరంగా మాటాడతారు" గురువులు నవ్వేశాడు.

"సర్లే నువ్వెల్లిరా".

వాడెళ్ళిపోయాక గదిలోకి వచ్చాను. సిలిండర్ భారతీమణి కూచోమంది. కుర్చీలో కూచున్నా

"మంచానికి ఓ రూపాయి" అంది.

"మంచానికెందుకు?"

''అద్దె. అదంతా రేపు పుతుక్కో వద్దూ?''

'నేను మంచంమీద కూచోను''.

''మరెక్కడుంటావ్?'' అంది ఆశ్చర్యంగా.

''కుర్చీలోనే''.

''ఏటీ కుర్చీలోనే ఆ పిల్ల ప్రేణం...''

''ఏం చెయ్యను. ఆమెతో కాసేపు మాటాడిపోతాను''.

''మాటాడిపోతావా?'' నొక్కినొక్కి అడిగింది. ఏంటి మాటాడ్తావ్?''

''ఆ పిల్లతో మాట్లాడాలి. నీతోకాదు''.

''నాతో ఎందుకు మాటాడతావు ? ఏంటి మాటాడతావో సెప్పు ?''

''ఏవో!''

''ఏదో అంటే ?''

''అప్పటి కేంతోస్తే అది.''

''మరి దాంతో వుండవా?''

''ఉండను.''

''అయ్యా ! తమర్లాగే సాలా మంది యిలాగే మాటాడ్తామని వొచ్చి, సివరికి మా ప్రేణాలమీదికి తెస్తారు. మీ మాటలూ వద్దు. మీరు వద్దు. ఎల్లెల్లు.''

''అదేవిటమ్మా ! వచ్చిన తర్వాత కాస్త మంచీ చెడూ మాటాడుకోమా?''

''మంచీ చెడూ మాటాడు కోడానికి అదేమన్నా నీ పెళ్ళా మనుకున్నావా!''

''కాదు. పెళ్లామయితే డబ్బెందు కిస్తాను? చూడమ్మా! నేనేం రాక్షసుణ్ణీ, దుర్మార్గుణ్ణీ కాదు. మీ పిల్ల కొచ్చిన బయమేం లేదు. మాటలంటే శృంగారం మాటలేగాని మరోటి కాదు. అందుకేగా నువ్వు అడిగినంతా యిచ్చాను ?''

''మరి మంచం రూపాయి ?''




''ఇంద'' - రూపాయిచ్చాను.

''కాఫీ కేవఁన్నా యివ్వరా?''

''ఎంత కావాలి ?''

''తవఁరి సంతోషం.'

ఐదు రూపాయ లిచ్చాను. రోలర్ క ళ్ళు డీజలింజన్ హెడ్ లైట్స్‌లా మెరిసాయి.

''సీతా! ఎల్లే. ఆ బాబుగోరు సెప్పి నట్టిను'' అంది బహువచనంలో.

ఆమె బయట కెళ్ళి మంచం మీద కూచుంది. పట్ పటా పట్ శబ్దం! మళ్ళీ నులక తెగిందన్న మాట.

సీతనే అమ్మాయి, తలుపు తీసి దగ్గ రిగా వచ్చి, దూరంగా నిలబడింది.

''మంచం మీద కూచో'' అన్నాను.

ఆ అమ్మాయి అదోలా చూసి. మంచం మీద నా ఎదురుగా కూచుంది.

''నీ పేరు ?''

''ఇందాకట్నుంచీ పిలుస్తున్నారు వాళ్ళు; విన్లేదా?''

''సీత అని విన్నాను. పూర్తిపేరు.''

''పూర్తి పేరు సెప్తేగాని రారా?''

''రానని కాదు.''

''మరెందుకు? మా పేర్లతో మీకేం పని. పరాయూరోళ్ళు. ఈయాళ గంటుం టారు! పోతారు! మళ్ళీ ఈ జలమలో కనిపిస్తారా?''

''పూర్వాను బంధం వుంటే కలుస్తా మేమోఁ ?''

''సరి సరి ఈ మాతరం దానికి పూరవాను బంధాలు కూడాను? ఇక్కడి కొచ్చే పెతీ మొగోడూ యిదే మాటం టాడు-సినిమాలు సూసొచ్చి.''

''సరేలే! పేరూ వద్దూ అనుబంధమూ వద్దు. మీ వూరు మురమండా?''

''ఎవరన్నారు ?''

''రిక్షావాడు.''

''వాడి మాట నమ్మాలని వుంటే నమ్మండి.''

''ఏం-మురమండ కాదా ?''

''మురమండే.''

''ఆ వూరెక్కడుంది ?''

''ఏం ? ఎల్తారా ?''

''మా వాళ్ళు వుండాలి. చాలా రోజు లయింది చూసి. ఇక్కడికెలానూ వచ్చానుగా చూసి పోదామఁని.''

''మురమండ... అనకాపల్లి... అనకా పల్లి దగ్గరుంది.''

''అనకాపల్లా? అదెక్కడుంది ?''

''అదా? అది...సిలుకలూరి పేట దగ్గరుంది.'' - నన్నామె పల్లెటైతుగానే ఆడించాలని చూస్తోంది!

''ఆఁ అవునవును. నువ్విక్కడికొచ్చి ఎంత కాలమఁయింది ?''

''ఇప్పుడే రైలు దిగాను.''

''నిన్న రాలేదా ?''

''ఎవరన్నారు ?''

''ఒక స్నేహితుడు చెప్పాడ్లే.''

''ఎవర్ని చూసి ఎవరనుకున్నాడో.''

''నిజమేలే. అలాగే అయుంటుంది. నీ అమాయకత్వం చూస్తూవుంటే - మా పిన్నిగారమ్మాయి ఒకర్తి జ్ఞాపక మొస్తోంది.''

''ఏటి ఆవిడ కూడా ఈ వృత్తిలోకే దిగిందా ?''

''ఆఁ! కానీ ఎక్కడుందో తెలీదు. నిన్ను నేను ప్రశ్నలే అడుగుతాను గాని, ఏమీఁ చెయ్యనని అన్నానుగా? అందుకే. నీ ముఖంలో నాచెల్లెలు కనిపించిదమ్మా!''

''అలాగా? అయ్యో పాపం! ఆమెకి పెళ్ళయిందా ?''

''అయింది. కానీ ఎవరో మోసం చేసి

తీసుకు పోయాడు. నీకు పెళ్లయిందా?''

''లేదు'' ఖచ్చితంగా చెప్పింది. అందులో అబద్ధం మాత్రం లేదని పించింది.

''మరి ఈ వృత్తిలోకి ఎందుకు దిగావ్ ?''

ఆమె మాటాడ లేదు.

''చెప్పమ్మా ! నా చెల్లెలు లాంటి దానవ్. ఒక అన్నగా అడుగుతున్నాను''

ఆమె కళ్ళల్లో కన్నీళ్ళు తిరిగి పోతున్నాయి.

"ఏడుస్తున్నావా? చూడు! నా చెల్లెలు ఎలానూ యిక మాకు దొరికే ఆశ లేదు. ఐదేళ్ళనించీ గాలిస్తున్నాం మేం ! కాని ఆమె బతికే వుందో, చచ్చిపోయిందో మాకు తెలీదు, నీకు మరో అభ్యంతరం లేకపోతే మాతో వచ్చెయ్."

"ఎక్కడికి?" భయంగా అడిగింది.

"మా యింటికి. మా చెల్లెల్లా చూసుకుంటామమ్మా. మేం నలుగురం అన్నదమ్ములం. ఒకత్తే చెల్లెలు. అది వెళ్ళిపోయాక మా అమ్మ చచ్చిపోయింది. మా నాన్న మంచం పట్టేశాడు. మా పెద్దన్నయ్య సిగ్గుతో బయటకు రావడం మానేశాడు. చిన్నన్నయ్య దేశాల పాలయ్యాడు. నేను మూడోవాడిని. మా తమ్ముడు కాలేజీలో చదువుకుంటున్నాడు. నువ్వుగాని మా యింటికి వచ్చేస్తే మళ్ళీ మా యిల్లు కలకళ్లాడుతుంది?"

"ఒకవేళ నిజంగా మీ చెల్లెలు కూడా వచ్చేస్తే...కొన్నాళ్ళకి?"

"ఇద్దరు చెల్లెళ్ళని మురిసిపోతాం."

"కానీ నేనెలా రాగలనండి? మాకూ పెద్ద సంసారముంది"అంది పుసుక్కున.

"ఎక్కడ?"

"విశాఖపట్నంలో."

"మరి యింత దూరం ఎందు కొచ్చావ్ ? " - ఆమెను నా దారిలోకి లాక్కోవాలని అడిగాను.

"ఖర్మ"

"ఏమిటది?"

ఆమె ముఖం చేతుల్లో కప్పుకుని ఏడ్చింది. నేను ఆమె దగ్గరకెళ్ళి పక్కన కూచుని తల నిమిరాను. బావురుమంది.

"ఏడవకమ్మా. బయట వున్న ఆ పులి వింటే బావుండదు."

ఆమె ఏడుపు స్వరం తగ్గించింది. కాని కళ్ళనించి కన్నీళ్ళు ఆగటంలేదు.

"ఆమె నీకేమవుతుంది?"

"ఏమీ కాదు."

"మరి యిక్కడుంటున్నావ్?"

"సంపాదనకోసం."

"ఇలాగా?"

"మరేం చెయ్యగలను? ఆడపిల్లను."

"మీ నాన్నగారు లేరా?"

"లేరు. పోయారు."

"జబ్బుతోనా?"

"ఆఁ."

"ఆయనేం చేసేవారూ?"

"దేశభక్తి"

"అంటే?"

"దేశానికి స్వాతంత్ర్యం రాకముందు ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌లో పని చేసేవారు. అప్పుడు మా యింటికి ఎవరెవరో దేశభక్తులు వచ్చేవారు. ఒకసారి గాంధీగారు కూడా వచ్చారట. నెహ్రూగారు కూడా వచ్చారట అప్పటికి నేనింకా పుట్టలేదు" ఆమె మాటల్లో యిప్పుడు యాసలేదు. ఈ వ్యాపారంలోకి దిగాక యిలాంటి యాస నేర్చుకుని

వుంటుందా?

"మీ నాన్నగారి పేరు?"

చెప్పింది.

నా కాయన పేరు తెలుసు. క్షణం కాదు, అయిదు నిమిషాలు నా నోట మాట లేదు.

"మీ అమ్మగారి పేరు?" విస్తుపోతూ అడిగాను.

చెప్పింది. నిజమే చెప్పింది.

"మీ పెద్దన్నయ్య పేరు?"

చెప్పింది-ఇది కూడా నిజమే!

"మీ పెద్దక్కగారి పేరు?"

చెప్పింది.

"ఆమె జైల్లో చచ్చిపోయిందికదూ?"

"మీకు తెలుసా?" ఆశ్చర్యంగా చూసింది.

"పత్రికల్లో అప్పుడెప్పుడో ఒకసారి చూశాను"... ఆమె విస్మయంతో నా వేపే చూస్తోంది. ఆ చూపు తప్పించుకుని "మీరింకా ఎందరు సంతానం?" అన్నాను.

"పోగా మిగిలినవాళ్ళు ఆరుగురం."

"మగపిల్లలు ఎందరు?"

"ఎవరూ లేరు. అంతా ఆడపిల్లలే. నాకంటే పెద్దవాళ్ళు ముగ్గురు. నా తర్వాత యిద్దరు."

"మీ పెద్దన్నయ్యగారు?"

"ఆయన క్షయతో పోయారు. ఆయన పోవడంతో మాయిల్లు అప్పులోళ్లు లాగేసుకున్నారు కట్టుబట్టల్తో మిగిలాం."

వాళ్లు బ్రాహ్మలు నాకు తెలుసు అయినా "మీరేవిట్లమ్మా?" అన్నాను.

"వెనక బడిపోతున్న వాళ్ళం."

"అదేం?"

"అవునండి. వెనకబడిన తరగతుల వారని, చిన్న కులస్తుల్ని, హరిజనుల్ని, గిరిజనుల్ని, ఇంకా ఇంకా చాలామందిని వెనకబడిన కులాలవారని, కులవ్యవస్థతో వాళ్ళకి సదుపాయాలు కలిగిస్తున్నారు. కానీ ఆర్థిక స్థితిగతులవల్ల, మనుషులు వర్గాలుగా నాశనమై పోతున్నారని గుర్తించటం లేదు. వెనకబడిన తరగతుల వాళ్ళని ఉద్ధరించాలి. కానీ పద్ధతి యిదా? రిజర్వేషన్లు అంటున్నారు. కానీ ఆ వెనక బడిన తరగతులవాళ్ళవని, ఉద్యోగాల్లో చేరిన వాళ్ళ సర్టిఫికేట్లు చూడండి. ఎందరు తప్పుడు సర్టిఫికేట్లతో ఆ ఉద్యోగాలలో చేరిపోతున్నారో? ఆ సర్టిఫికేట్ల మీద సంతకాలు పెట్టేదెవరు? నాయకుల మనుకునే వాళ్ళేనా? వీళ్ళేకదా నిమ్న జాతుల వాళ్ళని ఉద్ధరిస్తామనేది? కాని ఏం చేస్తున్నారు? వాళ్ళ వాళ్ళకి, బంధువులకి, తెలిసిన వాళ్ళకి సర్టిఫికేట్లు ఇచ్చి-నిజానికి అసలైన షెడ్యూల్డ్ కులాల వాళ్ళని సర్వనాశనం చేస్తున్నారు."

"నువ్వేం చదువుకున్నావ్?"

ఆమె మాట్లాడకుండా తలొంచుకుంది. తల అడ్డంగా తిప్పింది.

"చెప్పమ్మా. ఇంత చక్కగా విశ్లేషణ చేసి చెప్పావే! ఏమీ చదువుకో లేదంటే నమ్మగలనా?"

"ఎమ్మే చదువు తున్నాను."

"నిజమా?"

తలూపింది.

"నిజమా?" రెట్టించి అడిగాను.

" నమ్మకం లేక పోతే వూరుకోండి సార్"

"నమ్మకం లేక కాదు. ఎమ్మే చదువుతూ ఇలాంటి నీచపు వృత్తిలో... నికృష్టపు జీవితంలో...దిగావంటే..."

"చెప్పానుగా? వెనకబడి పోతున్న తరగతుల వాళ్ళమని? వెనక బడిన

వాళ్లు యిలాంటి వృత్తులు చెయ్యడం తప్పా సార్?''

"తప్పే?"

"ఎలా?"

''ఎలా ఏమిటి? తప్పే?"

''ఎనాలిసిస్ చెప్పండి. ఎకనమిక్ కండిషన్స్‌మీద-పొలిటిక్స్,పార్టీపోలసీలు ఎలాంటి మోసాలని, ఎలాంటి తప్పుడు సిద్ధాంతాలనిచేసి, వర్గ భేదాన్ని సృష్టించి పారేస్తున్నాయో ఆలోచించండి.ఇక జస్టిస్ అంటారా? అదెక్కడుంది? 'ఇట్ డజ్ నాట్ యెగ్జిస్ట్. ఇట్ నెవర్ హేజ్, అండ్ ఇట్ నెవర్ విల్' అంటారు పెద్దలు.''

"ఆ మాటన్నది 'వేనీదయ్యర్' కానీ లోకమంతా న్యాయంగా నడిస్తే, ఒక్క జీవైనా, ఒక్క రోజైనా బ్రతక లేదు" అన్నాను.

"అందుకని ఒకళ్ళనొకళ్ళు కొట్టుకు తినాలా సార్? అది మిగతా జీవరాసుల్లో అయితే ఫర్వాలేదు. ఈగల్ని సాలె పురుగు తింటుంది. సాలెపురుగుని మరోటి తింటుంది, బల్లి మిగతా పురుగుల్ని తింటుంది. పురుగులు కీటకాలనితింటాయి కానీ మనిషెందుకు మనిషిని హింసిం చాలి? పోనీ వాడిని చంపి తింటాడా? లేదు. హింస! హింస! హింసించాలి. ఈ హింసను మన జస్టిస్ మారుస్తోందా?"

"చాలా లోతుకే పోయావ్ తల్లీ' ఆది పములు. అసలు నువ్వు యెమ్మే చదు వుతూ ఈ పనిలోకి..."

"యెందుకు దిగానంటారు?

చావకూడదని.

మా నాన్నగారు బ్రతికినంతకాలం దేశ సేవో అంటూ దేశంకోసమే 'పని' చేసి పోయారు.

డబ్బంతా కర్పూరం అయిపోయింది.

ఇక మాకు దేశసేవ వద్దనిపించింది.

ఏదో పని చేసుకుని బ్రతకాలను కున్నాం.

కానీ ఆడవాళ్ళం.

ఎక్కడికెళ్ళినా లంచం అడిగేవారు.

మగాళ్ళనయితే డబ్బు.

ఆడవారినయితే మానం.

అప్పుడే అదేదో సినిమా వచ్చింది.

దాన్లో ఒక పెద్దమ్మాయి తనుచెడిపోయి తన తోబుట్టువుల్ని బ్రతికించుకుంది.

అందరూ అలాగే చెయ్యాలని ఆ సినిమా చెప్పలేదు.

నవనాగరిక సమాజం అయిన మన పవిత్ర భారతం, సత్సంప్రదాయాలకు నిలయమైన ఈ పుణ్యస్థలి, ఈనాడు ఇంత అధోగతిలో వుందని తెలిచెప్పింది.

చూసిన జనం నవ్వారు. ఏడ్చారు, తిట్టారు. తమిళనాడులో కొందరు బహిష్కరించారు.

కానీ మన పాలకులు మాత్రం కద ల్లేదు.

అదేదో సినిమా లెద్దురూ అని ఏదో ఎవార్డు కూడా యిచ్చేసి నట్టున్నారు.

కానీ దానివల్ల అని కాదు, ఒక నిర్ణయానికి వచ్చాను.

త్యాగమనేది మా నాన్నగారి రక్తం లోంచి మాకూ సంక్రమించింది.

నేను త్యాగంచేసెయ్యాలనుకున్నాను.

ఉన్న వూళ్లో ఈ పని చెయ్యలేంగా?

శనివారం విశాఖనించి యిక్కడి కొచ్చి, శని ఆదివారాలు మాత్రమే యింత సంపాయించుకుని, తిరిగి విశాఖ వెళ్ళి మా వాళ్ళని బ్రతికించు కుంటు న్నాను. ఈ విషయం మా వాళ్ళకి

తెలిస్తే ?

చంపేస్తారా ?

పొమ్మంటారా ?

ఏమీ అనలేరు.

పరువు మర్యాదలు పోయాయని తల బాదుకుంటారు.

దేశంకోసం యిన్ని త్యాగాలుచేసి చివరికి మామూలు 'కుక్క' చావు చచ్చిన మా నాన్నగారి శవం వెంట ఎందరు మిత్రులు, శ్రేయోభిలాషులూ వెళ్ళారో తెలుసాండి ?

పదిమంది.

నలుగురు మోసేవాళ్లు, ఒక పురోహితుడు, అయిదుగురు మా దగ్గరి బంధువులు.

అప్పుడు నేను బాగా చిన్న దాన్ని.

ఇప్పుడా దృశ్యాన్ని తలుచుకుంటే ఏమని పిస్తుందో తెలుసాండి?

దేశానికి స్వాతంత్ర్యం కోసం, మూడొంతులు జీవితం జైళ్ళలోనే గడిపిన ఓ దేశభక్తుడా!

నీ గోళ్ళలో సూదులు గుచ్చిగుచ్చి ఏ రహస్యాన్ని నువ్వు చెప్పక పోతే, లాఠీలతో కుళ్ళ బొడిపించుకున్న ఓ మనిషీ!

గవర్నర్ మీద పిస్తోలు పేల్చి నువ్వేం సాధించావ్?

అండమాన్ల జీవితమేనా?

దానికి ప్రతిఫలం ఏమిటి ?

నీ పెద్ద కూతుర్ని జైల్లో పెట్టి మానభంగం చేసి చంపేశారు.

నీ పెద్ద కొడుకు గుండెలమీద కుర్చీ కోడుపెట్టి నలుగురు పోలీసులు ఎక్కి తొక్కి తొక్కి చివరికి క్షయరోగ క్రిములు యిచ్చి చచ్చిపోయేట్టు చేశారు.

నీ ఒక కూతురు వేశ్య అయింది.

నువ్వు అగ్రవర్ణంలో పుట్టిన వెధవ్వని నీ పిల్లలకి ఉద్యోగాలు లేకుండా చేసేశారు.

ఎవరో తెలుసా ?

నీవాళ్ళే.

నువ్వు స్వాతంత్ర్యం సంపాయిస్తే, దాన్ని లాక్కుని, దాని అధికారంతో అందర్నీ అణగ్గొట్టేస్తున్న నీ మిత్రులే నాన్నా!'

ఏడ్చింది. నాకేమనాలో బోధపళ్ళేదు. ఆమెను వూరడించనా? కనికరించనా? ఏమిటి పరిష్కారం?

"చూడు సీతా"

"నా పేరు సీత కాదండి. సులోచన. ఇక్కడికి కొచ్చాక పేరూ వూరూ అన్నీ మార్చుకోవాలిగా... ఏమిటి చెప్పండి."

"బహుశః ఈ పరిస్థితుల్లోనే నా చెల్లెలు వుంటే ఏం చేసేవాణ్ణో తెలుసా?"

"పీక నులిమి చంపేస్తారు."

"అది సంస్కార హీనుల పని. నేను సంస్కార హీనుణ్ణంటావా?"

"లేకపోతే యిక్కడి కెందుకొస్తారు?"

"నువ్వెందు కొచ్చావ్?"

"నేను బ్రతతడం కోసం కాదు. మా వాళ్ళని బతికించడానికి"

"మీ నాన్నగారు అంత పెద్ద దేశభక్తులు కదా–"

"అలాంటి వారి కుమార్తెను ఎందుకిలా సంస్కారహీనంగా బ్రతుకుతున్నావనేగా మీ ఎదురు ప్రశ్న?"

"కాదు మీకు మళ్ళీ పునర్జీవితాన్ని యివ్వాలని"

"ఎలా ?"

"ఇందాక చెప్పాను. మా 'యింటికి' తీసికెళ్తాను."





"నేను రాను."
"ఏం ?"
"రాలేను."
"ఎందుకని ?"
"ఒకరి దయాదాక్షిణ్యాల మీద బ్రతకలేనండి. క్షమించండి - అలా అన్నందుకు."
"ఇందుకు క్షమార్పణలు దేనికిగానీ, దయా దాక్షిణ్యాలన్నావే, ఇప్పుడు మాత్రం ఎవడెవడో యిచ్చిన డబ్బుమీద బ్రతకడంలేదా ?"
"లేదు. వాళ్ల డబ్బుకి ప్రతి ఫలంగా, వాళ్లకి నా శరీరాన్ని యిస్తున్నాను."
"అలాగే మా చెల్లెలు లేని ప్రేమను, మమకారాన్ని మా కివ్వమ్మా !"
"సారీసార్ ! ఎందుకో అలా చెయ్యలేను."
"ఎందుకు చెయ్యలేవు !"
"మీరు నన్ను చెల్లెలిగా చూసుకోగల రేమోగాని, నేను మిమ్మల్నెవర్నీ అన్నలుగా భావించుకోలేనుగా ?"
"ఎందుకు భావించ లేవమ్మా ?"
"మీకున్న భావం నాకు వుండదు. రాదు." అంది.
"సరే పోనీ మీ విశాఖ అడ్రస్ యివ్వగలవా ?"
"ఎందుకు ?"
"మీకు నెలనెలా యింతని డబ్బు పంపుతాను. ఈ వృత్తి మానెయ్."
"ధర్మం తీసుకోమంటారా ?" అంది అదోలా నవ్వుతూ.
"అది ధర్మంకాదు. నిన్నీవుచ్చునించీ, రొచ్చు జీవితం నించీ తప్పించాలని."
ఆమె చాలా సేపు మాటాడలేదు.
"ఏమంటావ్ ?"
"సారీ సార్."
"సరే అయితే అడ్రస్సయినాయివ్వు.
"వద్దు. అది మరింత బాధాకరం."
"నేనేం ఈ విషయాలు బయట పెట్టను."
ఆమె వేదాంత ధోరణిలో నవ్వింది.
"బయట పెడతారని భయమేవుంటే, మీకీ నిజాలు చెప్పేదాన్నా ?"
"మరెందుకు చెప్పవ్ !"
"చెప్పలేను. అంతే."
"అంటే చెప్ప వన్నమాట ?"
"చెప్పలేను అన్నదానికీ. చెప్పను అన్న మాటకీ చాలా తేడావుంది సార్."
"సరే అయితే వెళ్ళిరానా ?"
"ఏమిటి వుందరా ?"
"నేనందుకు రాలేదు !
ఆమె నావేపు విచిత్రంగా చూసింది.
"మరి ఎందు కొచ్చారు ?... అసలు మీరెవరు ?"
"నిజం చెప్పనా ? అబద్ధం చెప్పనా"
"నిజం చెప్పమంటే ఏం చెబుతారు ?"
"చెప్ప నంటాను."
"ఏం ?"
"చెప్పకూడదు."
"మీరు... మీరు రచయితలా ;"
"కాను."
"జర్నలిస్టులా ?"
"ఊహుఁ."
"మరి ?"
"అడగొద్దన్నానుగా ?"
"సరే అబద్ధం ఎలాచెప్తారో చెప్పండి.
"నిన్ను తనివిదీరా అనుభవించడానికి వచ్చిన విటుణ్ణి."
"కరక్ట్. ఇక మీరు నిజం చెప్పొద్దు మీరెవరో తెలిసిపోయింది"
ఎవర్ని ?



"నిజమూ చెప్పను, అబద్ధమూ చెప్పను"

నేను లేచాను.

ఆమె లేచి నా కాళ్లకు నమస్కారం చేసింది. ఛప్పున ఆమెను లేపనెత్తాను.

"ఏమిటమ్మాయిది ?"

తండ్రిలాంటివారు. నమస్కారం చేయటం తప్పాండి ?

నేనిక ఇక్కడ వుండలేకపోయాను. వెళ్ళిపోతూ ఆగాను.

త్వరలోనే విశాఖవస్తాను. మీ యింటికే "వస్తాను. నీతోనే మాటాడతాను."

ఆమె చిరునవ్వు నవ్వింది.

"నా అడ్రస్ మీకేం తెలుసు ?"

''ఈ తరం వారికి 'మీ' చిరునామాలు లేక పోవచ్చు. కానీ మీ నాన్నగారికి వుందిగా !''

ఆమె గతుక్కు మన్నట్టు గుర్తించాను.

"ఆయన్ని ఎప్పుడో అంతా మరిచి పోయారు."

''కానీ జైలుగోడలు మరిచి పోలేదు, డాబాగార్డెన్ మరిచి పోలేదు. యూనివర్సిటీ మర్చిపోలేదు. సముద్రపుటొడ్డు మర్చి పోలేదు. అండమాన్ల జైలు మర్చి పోలేదు. హైకోర్టు మరవదు. సుప్రీం కోర్టు మర్చిపోదు..."

''మా యిల్లు డాబా...డాబాగార్డెన్‌లో వుండేదని మీకేం తెలుసు ?''

''మీ నాన్నగారు ఈనాడు బ్రతికుంటే దేశానికి రాష్ట్ర'పతి' అయ్యేవారు. తెలుసా ?"

ఆమె నా ముఖంలోకి చూసి వలవలా ఏడ్చేసింది.

ఆమెను దగ్గరగా తీసుకున్నాను. తల నిమిరాను.

"పిచ్చి తల్లీ! పులి కడుపున మేక పుట్టదమ్మా! మీ నాన్నగారి గురించి చాలా హిస్టరీ పుస్తకాల్లో వున్నాయి. నీదీ రేపు పుస్తకాల్లోకి ఎక్కుతుంది. వేశ్యగా కాదు త్యాగమయిగా."

ఆమె కళ్ళనించి కన్నీళ్ళు కారుతూనే వున్నాయి.

"వెళ్ళొస్తా నమ్మా. త్వరలోనే విశాఖ వస్తాను. రామలింగేశ్వర శాస్త్రిగారి అమ్మాయి యిల్లెక్కడ అని అడగనులే. యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా, హైకోర్టులో ఎడ్వకేట్‌గా రెండు నెలలే వున్నా మొత్తం బ్రిటిష్ ప్రభుత్వాన్నే గడగడలాడించిన సింహస్వరూపుడుగా, గవర్నర్‌ని చంపబోయి పట్టుబడి అండమాన్లలో దిక్కులేని చావు చచ్చి, దేశానికి స్వరాజ్యాన్నిచ్చిన దేశభక్తుడిగా, గాంధీగారి అహింస సిద్ధాంతాన్నీ, ఆయన ఆస్తికత్వాన్నీ ఎదిరించిన మహా మేధావిగా...."

ఆమె ఏడ్చేసి నానోరు మూసేసింది.

"ప్లీజ్! ప్లీజ్! ప్లీజ్! ఈ విషయం తెలిస్తే యిక్కడికి యిక రాలేను. నాకిక ఆదాయమూ వుండదు. మీకు దణ్ణం పెడతాను. వెళ్ళిపోండి."

నేను ఒకడుగు వేశాను.

"వెళ్ళి పోతున్నారా?"

"వెళ్ళి పోమన్నావు కదమ్మా!"

"అవును వెళ్ళిపోండి సార్. విష్ యూ ఎవ్విరీ సక్సెస్" అని చేతులు జోడించింది.

బయటకు తలుపులు తెరచుకొని వచ్చాను.

అరుగు పైని మంచం మీద రోడ్ రోలర్ నిద్ర పోతోంది. చప్పుడు విని లేచి కూచుంది.

పట్ పట్ పట్!

మరో కొన్ని నులకతాళ్లు తెగాయన్న మాట!

"ఎల్లిపోతున్నారా?"

"ఆఁ."

"కాఫీకి డబ్బు లివ్వరు?"

గుమ్మా న్నానుకుని సజల నేత్రాలతో సులోచన నిలబడి వుంది.

అయిదు రూపాయల నోటు యిచ్చాను.

చీకట్లో కూడా నోటు సైజుని బట్టి, దాని విలువను కనిపెట్టేసింది.

"బాబుగారు! నిజంగా దేవుడు... బాబూ మందే వూరన్నారు?" అని చేతులు జోడించే ధోరణిలో అంది.

"ఏవూరో తెలీదు. ప్రస్తుతం ఈ వూరు. మీ అమ్మాయి చాలా యోగ్యురాలు సుమా! జాగ్రత్తగా చూసుకో."

"ఏ అమ్మాయి?"

"అదిగో సు...సీత!"

"అవును బాబూ! మా యోగ్యురాలు, దరిద్రగట్టుదాన్ని నా కడుపున పుట్టింది గానీ, ఏ మారాజుల యింట్లో నో పుట్టుంటే, మహారాణి అయ్యేది."

"మారాజు లింట్లో పుట్టిన వాళ్లంతా మహారాణు లవరు తల్లీ!" చిరునవ్వుతో అన్నాను

"ఎందు కవరు?"

"రోజులు మారిపోయాయి. రాజులు పోయారు. జమీలు లాక్కుంటున్నారు... మర్నేను వస్తాను." అని తిరిగి సులోచన దగ్గర కెళ్ళి "వెళ్ళొస్తా సులోచనా! నిజానికి నాకు ఏ చెల్లెలూ లేదు. నీనించి నిజం తెలుసుకోవాలని, అలా కట్టుకథ

చెప్పాను" అన్నాను మెల్లిగా

ఆమె చిరునవ్వు నవ్వింది. తలూపింది. "మీరు అబద్ధమే చెప్తున్నారని తెలిసినా, నేను నిజమే చెప్పాను సార్! మీరెవరో, ఏమిటో అన్నీ మీ మొదటి మాటలోనే గ్రహించేశాను" అందామె మరీ మెల్లగా!

"చెప్పు ఎవర్ని ?''

"విశాఖలో చెప్తా-బ్రతికుంటే."

నేను ఆమె వేపు సాలోచనగా క్షణం చూసి, తలూపి వెళ్ళలేక, వెళ్ళలేక వెళ్ళిపోయాను!

బయట రిక్షావాడు, రిక్షాలో కునుకుతున్నాడు.

వాడిని లేపకుండా ముందుకి నడిచాను. ఇంకా చాలా యిళ్ళు వున్నాయిగా ?

కానీ అడుగులు ముందుకు పట్టంలేదు? సులోచనే! సులోచనే! సులోచనే-తలలో తిరుగుతోంది.

రామలింగేశ్వరశాస్త్రిగారు ఎలావుండేవారో, నేను స్వయంగా చూడలేదు! ఫొటోల్లో మాత్రం చూశాను.

ఆనాడు, ఆంధ్ర చాలా మందగొడిగా వుండేది - స్వాతంత్ర్యోద్యమంలో, పంజాబ్‌లో లాగా, బెంగాల్‌లో లాగా, మహారాష్ట్రలోలాగా తీవ్రవాదులూ లేరు మితవాదులూ లేరు. అయినా ఆంధ్ర కేసరి, ఆంధ్ర రత్న, అల్లూరి సీతారామ రాజు లాంటి వారెందరో లేచినా వుద్యమం చాలా 'పల్చగా' వుండేది. వాటికి ప్రచారమిచ్చేవాళ్ళూ లేరు!

కాంగ్రెస్‌కి త్రివర్ణ పతాకాన్ని దిద్దింది తెలుగువాడు;

దాని చరిత్ర రాసిందీ తెలుగువాడే.

అయినా ఎందుకో ఈ ప్రాంతానికి రావలసినంత గుర్తింపు రాలేదు.

బహుశః తెలుగువారు హనుమంతుల వారంతటి బలాఢ్యులైనా, హనుమంతుడిలాగే, పొగిడితేనే గానీ విజృంభించరు: ఎప్పుడూ 'రామ'నామ స్మరణే! వాలి, సుగ్రీవులూ తెలుగువారే (నట)అందుకని తెలుగు జాతిలోనే, ఈ అన్నదమ్ముల పోట్లాట ఈ నాటికీ పోలేదంటారు - వ్యంగ్య రచయితలు. ఉత్తరాది'రాముళ్ల' భజనే వీళ్ళకెప్పుడూ!

సులోచన మళ్ళీ గుర్తొచ్చింది!

ఆ ముఖంలో ఎంత సౌకుమార్యం వుంది! ఎంత గాంభీర్యం! ఎంత తీవ్రత! ఎంత శాంతం! మాటల్లో యెంత సంస్కారం!

సంస్కారం యెక్కడికి పోతుంది? ఎంత చెడిపోయినా-తలిదండ్రుల రక్తం కొంతయినా సంతానంలో వుంటుంది!

అలాగని, అందర్లోనూ వుంటుందని కాదు! వుండే అవకాశాలు లేకపోలేదు.

ఆమెదగ్గరికి వచ్చేవాళ్ళందరితోనూ, బహుశః యాసగానే మాటాడుతుంది! బహుశః ఏమిటి ? యాసే మాటాడాలి! లేకపోతే ఒక వాక్యంలోనన్నా, ఆమె సంస్కార 'నిధి' బయటపడిపోవచ్చు! కానీ ఈ యాసకీ, ఆమెకు సహజంగా వున్న సంస్కారానికి-యెప్పటికీ పొత్తు కుదరదు. నేనొక చిన్న విసురు విసిరే సరికి, తన మొత్తం జీవితాన్నే చెప్పేసుకుంది. ప్రస్తుతం తను వుంటున్న బ్రతుక్కి - తనుండాల్సిన జీవితానికి రాజీ కుదరక అలా చెప్పేసుకుంది!

అందరికీ అలా చెప్పుకోగలదా ?

బహుశః నా ముఖం, మాట తీరూ చూసి, మొదటే నేను విటుణ్ణీ, వేశ్యా




లోలుణ్ణి కాదని కనిపెట్టేసింది! లేకపోతే అంత నిజాయితీతో జీవితాన్ని చెప్పేసుకో గలదా? .

నేను జన్మతః బ్రాహ్మణ్ణికాను. కింద కులాలకి సంబంధించినవాడినీ కాను. నా కులం ఏమిటో నేనెప్పుడో మర్చిపోయాను. కానీ సంఘంలో జరుగుతున్న, పెద్దలు జరిపిస్తున్న నాటకాలు చూసేకొద్దీ కింది కులాలవారిమీదే సానుభూతి కలిగేది గాని, బ్రాహ్మలనేవాళ్ళకరున్నారూ, ఆ జాతి త్వరలోనే నామరూపాలు లేకండా కోట్ల ఏళ్ళక్రితం భూమ్మీద తిరిగిన భారీ జీవుల్లానే నాశనమైపోతుందనే భావమే కలిగేదికాదు.

ఇన్నాళ్లూ, బ్రాహ్మలనే అగ్రవర్ణస్తులు మిగతావారిమీద అధికారం చెలాయించేవారు; అందువల్ల వాళ్ళనుఅణచాలని, ఈ పెద్దలంతా అన్‌కాన్షస్‌గానో, కాన్షస్‌గానో అనుకొని, ఈర్ష్యతో, ఈసడింపుతో, ఆగ్రహంతో వారిని చంపేస్తున్నారా? బ్రాహ్మలంటే ఒక కులం కాదని వేదం చెప్తోందట !

'యం కామయె తం తమ్ ఉగ్రం
కృణోమి
తం బ్రామ్హణం, తమ్ ఋషి,
తం సుమేధామ్'

ఏ వ్యక్తికి దైవదత్తమైన సమ్యగ్ దృష్టి, వైజ్ఞానిక పరిపుష్టి, విద్వత్తు వుంటాయో అతడే బ్రాహ్మణుడు, ఋషి, యోగి-అని ఋగ్వేదం ఘోషిస్తోంది.

వర్ణవ్యవస్థ యెప్పుడయితే బాగా ఏర్పడి పాతుకుపోయిందో, బ్రాహ్మణ్యం జన్మకి సంబంధించిపోయి,వేదాలు 'చెప్పిన' వాక్కు మూలనపడిపోయింది.

హిందువులు యెంత మోసాలూ, దుష్కార్యాలు చేసినా, వాళ్ళ రక్తంలో ఆధ్యాత్మికతత్వం, ఆస్తికత్వం కరడు గట్టుకుపోయింది.

చివరికి నాస్తికులమని చాటుకునేవాళ్లు కూడా చాలామంది పై లోకాలు వున్నాయా అనే భ్రమకు లోనైపోతున్నారు.

ఆధునిక విజ్ఞానంమాత్రం పై లోకాలు వున్నవని పరిశోధిస్తోంది!

పై లోకంలో ఏముందో తెలీదు యెవరికీ!

ఇప్పుడు సైన్స్ పై లోకాలని అన్వేషిస్తోంది!

మనిషికి సుఖం కావాలి.

ఆనందం కావాలి.

ఆరోగ్యం కావాలి-

ఇవన్నీ ఇప్పుడు డబ్బుతో కొనుక్కోవచ్చని అనుకుంటున్నారో యేమో-

ఆ వూహాలోకాల్లోకి వెళ్ళాలంటే

ఆ కిటుకులు ఈ బ్రాహ్మలనేవాళ్ళు వల్లించే మంత్రాల్లో వున్నాయనీ,

వుంటవనీ,

వుండవచ్చుననీ,

నమ్ముతూ నమ్ముతూ,

నమ్మలేక నమ్ముతూ,

నమ్ముతూ నమ్మలేక-

ఎందుకైనా మంచిదని, ఆ బ్రాహ్మణుల దగ్గరకే వెళ్ళి పిలుస్తున్నారు.

వాళ్ళ మంత్రాలతో తిన్నగా పైకెళ్ళి

దేవుణ్ణో లేక అక్కడ యెవరుంటే వాళ్ళనో,

లేక ఏదుంటే దాన్నో,

అర్చించి, ప్రార్థించి

'జన్మజన్మలకూ మాకు సుఖాన్నే (డబ్బునే) ఇవ్వ'మని అడుక్కోవచ్చనే భావం, వాళ్ళ రక్తంలో వుండిపోయింది.

శారీరకంగా కష్టపడి పనిచేసేవాడి

మీద, మనిషికి సానుభూతి కలగొచ్చు.

కానీ, కేవలం మంత్రాలతో తంత్రాలతో - 'పై లోకాలున్నాయి', 'దేవుడు ఉన్నాడు', 'పూజలుచేస్తే పుణ్యం', 'చచ్చినవాళ్ళకి శ్రాద్ధంచేస్తే వాళ్ళకి పుణ్యలోకాలు వస్తాయి'-అని బ్రాహ్మలు అంటూంటే మిగతా ఇప్పటి జనానికి క్రమంగా వాళ్ళ మీద అనుమానం పుట్టడం సహజం!

అనుమానం అసహ్యానికీ,
అసహ్యం, అసూయకీ-
అసూయ, ద్వేషానికీ-
ద్వేషం, కసికీ-
కసి, కోపానికీ-
కోపం, ప్రతీకారానికీ
ప్రతీకారం. అణగదొక్కడానికీ దారి తీస్తుంది.

చక్రవర్తులూ, రాజులూ, రారాజులూ జన్మజన్మలకీ ఆ సీట్లనే (సింహాసనాలనే) అంటిపెట్టుకుని, అధికారం ఛలాయించాలనే ఆశతో వీళ్ళని చేరదీశారు-ఆనాడు.

వీళ్ళ,రాజుల్నీ, ధనవంతుల్నీ, మంత్ర తంత్రాలతో దీవించి రత్నాల రాశులూ, అగ్రహారాలు, మడులూ మాన్యాలు కొట్టేసేవారు. దానిమీదే ఎప్పెన్స్‌గా బ్రతికేస్తున్నారని కోపం ఇప్పుడు కొందరికి పట్టుకుంది.

ఆ రోజులు పోయి కొంతవరకూ దేవుడనే 'దాన్ని' నమ్మడం తగ్గిపోతూ, అందరు మనుషులూ సమానమే అనే వాదం బయలుదేరగానే - కొందరికి - బ్రాహ్మల మీద కోపం వచ్చేసింది.

దాంతో వీళ్ళని అణగదొక్కాలి అనే 'వాంఛ'- వాళ్ళకి తెలీకండానే, వాళ్ళల్లో పుట్టుకొచ్చింది.

వేదం పలికినట్టు, 'ఎవరు జ్ఞానులో వాళ్ళే బ్రాహ్మలు' అన్న ముక్క కాస్తా, కులం పరం అయిపోయింది.

రాజులు పోయి, రాజకీయాలు మారి 'కీ'లు చేతుల్లో పడగానే, వీళ్ళ ఈర్ష్యలు పైకి లేచాయి. ఫలితంగా బ్రాహ్మలు, నాన్-బ్రాహ్మలు అని విడిపోయి, ఒకరంటే ఒకరికి 'పడని' పరిస్థితి ఏర్పడిపోయింది! అసూయ, ద్వేషాలు రెండు వర్గాలకి లేచిపోయాయి.

దాంతో బ్రాహ్మలనే కులంవారు, ఫస్టుక్లాసులోఫస్టుక్లాసునపాసై,ఆపాలకులే యిచ్చిన బంగారు పథకం పొందినా, గుమాస్తాలుగా కూడా కాలేక పోయారు. కాలేక పోతున్నారు.

వీళ్ళవల్లే, కింది తరగతుల వాళ్ళు 'నాశన'మవుతున్నారని, కింది తరగతుల వాళ్ళని పైకి తీసుకొచ్చేందుకు పథకాలు వేశారు. వారికి అన్నిటిలోనూ రిజర్వేషన్లు మొదలు పెట్టారు.

కానీ అదేసమయంలో, (అదే మానవ జాతిలో) ఒక వర్ణాన్ని మెల్లమెల్లగా వెనకబడిన కులాలవారిగా మార్చి పారేస్తున్నారని గుర్తించటంలేదు.

విజ్ఞానానికి విలువ పోయి, కింది కులాలవారిని (నకిలీ) సూత్రాలతో విజ్ఞానవంతులు చెయ్యాలని ప్లానులు మాత్రం వేస్తున్నారు?

ప్లానులు మాత్రమే!

కానీ క్రియ ఆచరణ ఏది?

అయినా ఈ పాలకుల్లో చాలా చాలా మంది దేవుణ్ణి కొలుస్తూ, వీళ్ళ మంత్రాల పల్లింపుతోనే పునీతులవుతున్నారు'

జ్ఞానానికి విలువలేని దేశం ప్రపం




చంలో ప్రస్తుతంఇదొక్క దేశమేనేమో!

నడుచుకుంటూ రిక్షా దగ్గరకు వచ్చేశాను!

రిక్షావాడు మాంచి నిద్రలోవున్నాడు వాడికి నిద్రాభంగం చెయ్యకండా, ఇంకా ముందున్న 'ఇళ్ళ' వేపు కదిలాను.

సన్నగా వుంది సందు. సందులో దీపాలు లేవు. గుడిసెల ముందు కిరసనాయిలుదీపపు బుడ్డీలు వెలుగుతున్నాయి. గుడిసెలకి మరికాస్త ముందు, రెండు వేపులా రాంబాబుగారూ, వెంకటేసులుగారూ 'సోదరీ సోదరీమణులారా' అని సంబోధించే, సోదరీమణులు నిలబడి వున్నారు. సోదరులు ఇటూఆటూ తిరుగుతున్నారు.

తిరుగుతున్న సోదరుల్ని, సోదరీమణులు ఆహ్వానిస్తున్నారు-కాదు పిలు

స్తున్నారు.

"అబ్బాయిగారూ! ఇదిగో మాట."

"ఇనుగో ఇట్టా రండి."

"అయ్యగారూ! సిన్న మాటినండి."

అందరూ ఒకేలా, ఎక్కాలు అప్ప చెప్తున్నట్టు - అప్పజెప్తున్నారు. ఒకే యూనివర్సిటీలో, ఒకే రకం సిలబస్‌తో ఒకే మేస్టరు విద్య నభ్యసించినట్టు !

కొందరు సోదరులు ఆగుతున్నారు.

కొందరు తచ్చాడుతున్నారు.

కొందరు ఎవరన్నా చూస్తారని, వీధి చివర్లో ఏదో పనున్నట్టు పోతున్నారు.

కొందరు బీడీలూ, సిగరెట్లు, చుట్ట వెలిగించే నెపంతో ఆగి, పక్కకి చూస్తు న్నారు. అగ్గిపుల్ల చేతి వేళ్ళకి చుర్రు మనగానే పారేసి, మెల్లగా మరో గుడిసె ముందాగి, మరోసారి అగ్గిపుల్ల గీస్తు న్నారు.

కొందరు - అందరు సోదరీమణుల్ని పలకరిస్తున్నారు.

కొందరు సోదరులు, పలకరించలేక పోతున్నారు!

ఆగినవాళ్ళు, రేట్లడిగి, బేరాలు ఆడు తున్నారు.

కొందరు బేరం కుదిర్తే గుడిసెలోకి గబుక్కున దూరిపోతున్నారు!

కుదరకపోతే, పోతున్నారు, ముందు ఇంకా చవకవి దొరకచ్చని!

పోతున్న సోదరుల్ని - ఓటెయ్యని ఓటర్లని తిట్టుకునే అభ్యర్థిలా-తిట్టుకుంటు న్నారు-సోదరీమణులు.

కొందరు గుడిసె బయటకొచ్చి 'అర్ధ రూపాయిచ్చి అర్ధగంట పేణం యిల విల్లాడించేసేడు. దొంగసవాదిగోడు. రవుడీ సచ్చినోడు' అని తిట్టుకుంటు న్నారు.

కొందరు మళ్ళీ పౌడరు అద్దుకుంటు న్నారు. కాటిక పెట్టుకుంటున్నారు. జడ త్వరత్వరగా వేసుకుంటున్నారు. పువ్వులు సర్దుకుంటున్నారు. చీరల్ని ఛాతి మీద సగానికే వొదిలి యెగ్జిబిట్ చేస్తున్నారు, సైజుల్ని !

ఇద్దరు-యెదురెదురుగుడిసెల సోదరీ మణులు బండబూతులు తిట్టుకుంటు న్నారు.

వచ్చిన బేరగాడు అనుభవశాలైతే నిలబడి వింటున్నాడు.

పిరికివాడైతే పారిపోతున్నాడు... పోలీసులొచ్చి పట్టుకుపోతారని!

రవుడీ అయితే, యిద్దర్నీ నానా తిట్లూ తిడుతున్నాడు.

ఖరోడా రవుడీ అయితే, ఇద్దరూ-యెవరి గుడిసెల్లోకి వాళ్ళు పారిపోతు న్నారు-చిదగ బాదేస్తాడని లాగుంది;

దుకాణాల దగ్గర తచ్చాడే జనాభా లెఖ్ఖే లేదు !

బీడీలు కొంటున్నారో, షోడాలకే వచ్చారో, 'టీ'లే ఆర్డరుచేశారో-అక్కడే నిలబడో, కూచునో వీధి గుడిసెల ముందున్న సోదరీమణుల్ని చూసేసు కుంటున్నారు.

బైతులాంటి రైతుగారినైనా నాకు నోరెండిపోయింది. ఒక షోడా కొట్టు దగ్గర కొచ్చాను.

షోడాలు కొట్టేసోదరుడు బక్కగా, నల్లగా పొడుగ్గా గెడకర్రలా వుంటే, దుకాణంలో కూచున్న సోదరీమణి, అన్న వరం కొండలా వుంది.

ఆమె కూడా ఈ 'వ్యాపారం' చేస్తుందా ? లేక ఈ వ్యాపారం చేసే




వాళ్ళమీద బతుకుతుందా ?

'షోడాలు అయిపోయాయి. సిట వుండండి పట్టి తెస్తా'నని వెదురుగర్ర దుకాణం వెనక్కి పోయింది.

ఇంతలో బంతిపూలు పెట్టుకున్న ఓ సోదరీమణి, దుకాణం దగ్గరకొచ్చింది.

'ఓ స్ట్రాంగుటీ కలుపు నారాయణమ్మో' అంది.

నారాయణమ్మ అనబడే అన్నవరం కొండ' 'ఓ సిటవాగే! నాయుడు బావ సోడాలు పడ్తున్నాడు. ఆడొచ్చి టీ కలుపుతాడు' అంది.

'ఏం నువ్వు 'కలపకూడదా ?' అని ఆ బంతిపూల సోదరీమణి అంటుందేమో, అనుకున్నాను.

కానీ ఆమె అనకుండా లే! లే! లే! లే నా రాజా ! నువ్వు లేసిపోతావా? నన్ను లేపమంటావా?' అని ఆమే కాళ్ళమీద లేచిపోతూ, అతి సుందరంగా గందరగోళంగా పాడేస్తోంది.

పాడుతూ పాడుతూ నన్ను లేపెయ్యా డానికి తెగ శ్రమించిపోతోందా సోదరీ మణి!

ఇదోరకం ట్రిక్కా? అనుకున్నాను.

ఈమె ఏ రకం జంతువా? అనిగుర్తు పట్టేందుకు ప్రయత్నిస్తున్నాను.

కోతి లోంచి మనిషి పుట్టాడని కదూ అంటారు !

బహుశః కొన్ని కోతులు బాగా 'ఎదిగి'పోయి వుండొచ్చు.

కొన్ని 'ఎదుగుతున్న' ప రి ణా మ క్రియతో వుండొచ్చు.

అలాంటి పరిణామ క్రియ, యిప్పుడే ప్రారంభమైన వానర సు కన్యేమో అను కున్నాను.

ఎదురు కర్ర నాయుడుబావ షోడాలు తెచ్చాడు.

ఒకో షోడా కొట్టాడు. బ్రతుకులో ప్రమోషన్ లేని ప్రస్తుత భారత జాతి లాగ అది తుస్సుమంది.

బైతురైతునైన నేను తుస్సుమన్న 'నీరిని' తాగుతున్నాను.

ఎదురుగెడ నాయుడుబావ, (వా)నర సోదరీ మణి వేపు చూసి-

'ఏంటీయాల టీ తా గు తు న్నా వ్! బేరాలు లేవేటే' అన్నాడు.

"బేరాలెందుకు లేవూ ? కాని సచ్చి నోళ్లు బేరా లాడ్తున్నారు. ఆ సాయిత్రిరి లేదూ, ఆది, అదు నా దగ్గర బేరవాం డుంటే, అణ్ణి, ఎగరేసుకు పోతోంది ముండ! ఈ వొచ్చిన సచ్చినోళ్లకి,వాళ్లు కాక తీరాలి గాని, మొకం సూడ్రు" అంది వానర సోదరి బాధగా.

"నువ్వా దాన్ని పడగొట్టాలంటే నీ రేటూ తగ్గించెయ్యి !" నాయుడు బావ ఉచిత సలహా పారేశాడు.

"ఆఁ ఆఁ. నువ్వో ఈ యాపారం లోకి దిగు. తెలుస్తాది! ఇల్లాగ తగ్గింసా వంటే, సివరికి మనమే ఆ సచ్చినోళ్ళకి ఎదురిచ్చి... కోవాలి" అని పచ్చి బూతు విసిరింది.

బూతు వినగానే సోడా తాగుతూ పొలమారాను. నెత్తిమీద రెండు చరు పులు చరుచుకున్నాను.

"అయినా ఈ బేరా ల్లగ్గి పోడానికి అది కాదు కిటుకు, ఎదవ సినీమాలు వొస్తూ, రెండ్రోజులాడి పోతున్నాయ్! ఇకాటి కోసం ఎవరొస్తారు ? పక్కూరి జెనం, అసలే రాటం మానేసినారు. పాత డొక్కు సినీమాలు ఏస్తావుంటే, ఎలకొద్దీ వస్తా వున్నారుగాని, అయ్యీ సూట్టాని

కొచ్చే వోళ్ళంతా ఆడోళ్ళే!"

"అయితే ఆడ బేరాలు మొదలెట్టు" నాయుడుబావ విట్టేశాడు.

"నీ అగిడియా బాగుంది నాయుడు బావా! ఆ యాపారం నువ్వే పెట్టు" అని టీ తాగేసి కసిగా వుందీ! ఆఁ హాఁ మా కసిగా వుందీ! కలవక కలవక కలుస్తేనే కస్సున మంటుంది......కస కస మంటూ బిసబిస మంటూ కస్సున మంటాది" అని పాడుకుంటూ, బైతు లాంటి నా వేపు ఓ చూపొకటి విసిరి, గెంతుతూ పోయింది.

బైతు రైతు లాంటి నేను విస్తు పోయాను!

బేరాల్లేక, బతుకూ లేకా, బువ్వాలేక ఎండిన ఈ సోదరీ మణుల్లో యింత ఎగిరే వుత్సాహం ఎక్కణ్ణుంచి వస్తోందో!

అది వాంఛల ఉత్సాహం కాదు!

మగవాడితో కులికే ఆనందపు ఉత్సాహం కాదు!

సెక్సోద్రేకం కాదు!

నరాలు ఒక్కసారిగా బిగుసుకొని, ఒక్కసారిగా సడలిపోయినప్పుడొచ్చే లైంగికోత్సాహమూ కాదు!

డబ్బులు తెగ సంపాదిస్తున్నామనే ఉత్సాహమూ కాదు!

రోగాల్తో ప్రతీ రక్తకణం, ప్రతీ జీవకణం కుళ్ళిపోతున్నా, ఈ వుత్సాహం వీళ్ళ కెక్కణ్ణుంచి, ఎలా వస్తోంది!

బహుశః వాళ్ళంతా కుళ్ళి కృశించి పోయినా, మెదడులోని జీవకణాలు 'దెబ్బ' తినవేమో?

ఆ మెదడులో ఆరోగ్యంగా వుండే సెక్స్ వీళ్ళకి సంతోషాన్నీ, వుత్సా




హాన్నీ కలిగిస్తున్నాయా?
లేక వాళ్ళ మనసులోనే ఆ ఉత్సాహం వుందా?

షోడా తాగేశాక, నాయుడు బావ దుకాణం ముందే వీధిని చూస్తున్న నన్ను, ఏ 'బేరగాణ్ణో' అనుకుని-

"మీ దేవూరయ్యా?" అన్నాడు.

"విశాఖ పట్టణం"- అనేశాను,

ఇందాక అదేదో మారు పేరు చెప్పి, మర్చిపోయి, విశాఖ పట్నాన్ని స్వగ్రామం చేసేసుకున్నాను.

"ఇసాక పట్నమేనా లేక పక్కూరు ఏదన్నానా?"

"గాజువాక" అన్నాను

"అక్కడేంటి పని?"

"ఎవసాయం"

"ఇంత దూరవొచ్చారేం?"

"పనుండి"

"మరి ఈ ఈది కొచ్చారేం?"

"ఊరికే" అన్నాను.

"ఊరికేనా?" అని నవ్వినట్టున్నాడు. నవ్వేసి "ఈ ఈదికి వూరికే ఎవురూ రారు...అయ్యా! నువ్వు వయసు మీరోన్లాగ కనపడ్తన్నారు. ఇది మంచిది కాదు. ఆ కాలవవతల ఓ యిల్లు వుంది. దాంట్లో మంచోళ్ళున్నారు. అక్కడికి కెళ్ళండి"

ఈ ఉచిత సలహాకి ఏమనాలో తెలీక, క్షణం మాట్లాడ లేకపోయాను.

"ఎక్కడ?" అన్నాను చివరికి.

"ఆ కాలవవతల, అదిగో సినిమా ఆలు కాపడ్తా వుందా? దాని పక్కన మేడుంది. ఆమేడ పక్కన ఈది వుంది. ఆ ఈదిలోకి ఎల్తే శివాలయవుంది. ఆ శివాలయం పక్కనున్న మేడే!"

ఇంతలో నారాయణమ్మ కలిగించుకుంది.

"ఏంటా మాట్లు? ఇక్కడ బేర్లాలు చూత్తావా? బోకరు పనే సేత్తావా?"

"ఏంటే? బోకరు పనా? నేనెప్పడన్నా సేసేనటే? ఆ బాబెవరో తెలవకయిటొత్తే ఇది మంచిది కాదనిసెప్తున్నా. మల్లా బోకరూ గేకరూ అన్నావంటే మక్క లిరగదన్నేగల్ను! జాగర్త" గెడకర్ర వూపిర్నంతా కూడ బెట్టుకుని అరిచాడు.

"ఏటీ మక్క లిరగదంతావా? ఏదీ తన్ను?" అని లేవబోయి కూలిపోయింది కొండ.

"అనవసరంగా నా మూలంగా మీ రెందుకు కలహించుకుంటారండీ! నేనే పోతా అని నేను కాలవ గట్టవతల, సినిమా హాలు వేపు బయలు దేరబోతూ వుంటే- గెడకర్రా, కొండ కీచులాట వినిపిస్తూనే వుంది!

'ఒ లే! ఒ లే! నేనా బోకరు పనే సేసుంటే ఏనకు ఏలు గడింసే వోణ్ణి! బోకరుపని బాడుకావుల పని, నీతి నిజా' యిత్తో బతకాలని, దుకాణమెట్టుకున్నానే అని అరుస్తున్నాడు, ఆ దుకాణం బేరమంతా, ఆ సోదర సోదరీమణుల మీదే సాగుతున్నా!

గెడకర్ర నాయుడు బావ పారేసిన ఉచిత సలహా మీద కాలవవతలకి దండయ్యాత్రకి బయలు దేరాను. ఆ కాలవ వీధి చివర్లో చిన్న గుడిసొటి వుంది. గుడిసె బయట చిన్న కిరసనాయిలు దీపం బుడ్డి ఈసురోమని వెలుగుతోంది. ఆ దీపం బుడ్డి వెలుగు, పడీపడనట్టు, ఆ గుడిసెముందుకూచునున్న 'ఆడ మనిషి' ముఖం మీద పడుతోంది.

అక్కడో క్షణం ఆగాను. ఆ అమ్మడు ఈ రకం వ్యాపారైతే నన్ను పిలవ్వచ్చు. కాకపోతే పిలవకుండా అలానే కూచుని వుంటుంది. అదీ నా థియరీ. అయితే అక్కడ నేను చాలా సేపు స్టాండింగ్ కమిటీ మెంబర్లా నిలబడి వుండిపోయినా, ఆ పిల్ల మాత్రం సిటింగ్ కమిటీ ఛైర్మన్‌లా నిలబణ్లా లేదు. చూసి నవ్వనూ లేదు. పిలవనూ లేదు. అయితేఅదేదో సంసారపు గుడిసె అనుకున్నాను. వెళ్ళిపోబోతూంటే పిల్ల దగ్గింది.

దగ్గులో సాంకేతికమైన పిలుపుంది. అందుకని ఆగాను. ఆగి చూశాను. చూడగానే రాతి బొమ్మలావున్న అహల్యలో చలనం వచ్చింది.

"వొత్తారా బాబూ?" అంది.

అనడవే తరవాయి, వస్తానన్నాను.

'అహల్య' భూదేవి మీద చేతులెట్టి లేచింది. మెల్లగా వొయ్యారంగా లోపలికి దారితీసింది. ఆ నడకలో పోలియో వుంది. నాశనం కాబోతున్న భారతజాతి చిహ్నం స్పష్టంగా కనిపించింది. ఆ 'అహల్య' లో ఎన్ని రకాల జబ్బులున్నాయో - ఎందరు ఇంద్రుళ్ళ సుఖరోగాల ఇంద్రియం వుందో మరి! నేనూ గుడిసెలోకి దూరాను.

గుడిసెలో ఒక చింకి తాటాకు చాప వుంది. గుడిసె ఐదడుగుల ఎత్తు మాత్రమే వుంది. తలొంచుకున్నాను - పైచూరు తగలకండా! బహుశః సిగ్గుతో కూడా భారత జాతి తలొంచుకోవాలని ఆ 'అహల్య' అంత చిన్న గుడిసె నేసుకుందేమో!

"ఎంత?" అన్నాను.

"ఏటి?" అంది అహల్య.

"నీ రేటు"

"తవ రిస్టం"

"అదేమిటి, తీసుకునేది నువ్వు కదా ?"

ఆమెకు నవ్వే ఓపిక లేనట్టు, నవ్వని నవ్వు నవ్వకుండా "ఇచ్చేది దరమ పెబువులు తమరు. తమరిస్టం బాబయ్యా !" అంది.

"పావలా ఇస్తాను" అన్నాను.

ఆమె నవ్వలేదు, ఏడవలేదు. "తవ రిస్టమన్నాను గదా ?"

ఆమె వేపు సాలోచనగా క్షణం చూశాను. పావలా అన్నా కక్కుర్తి పడిపోయింది! అడుక్కునే వాళ్ళకి ఈ మధ్య నయాపైసా ధర్మం చేస్తూవుంటే, "ఓరి ఎర్రెదవా ? నయాపైసా అట! దరమం. తీసుకో బాబూ! తీసుకో" అన్నట్టు చూసేస్తున్నారు. కేవలం ధర్మం తీసుకొనేవాళ్ళకే ఈ రకం రూల్సు వున్నా, తన సర్వస్వాన్నీ తీసుకోమని ఇచ్చేసి, ప్రతిఫలంగా కేవలం పావలా మాత్రమే అడుగుతోందంటే, దేశంలో ధర్మం నాలుగు పాదాలా నడుస్తోందన్నట్టేగా ?

జేబులోంచి పది రూపాయల కాయితం తీసిచ్చాను.

అహల్య నోటు చూసి "సిల్లర్లేదు బాబు గోరూ" అంది.

"చిల్లరొద్దు. వుంచుకో" అన్నా దానకర్ణుడిలా.

నా వేపు-ఏదో' వింత జంతువుని చూసినట్టు చూసింది. "బా...బ... య్యా..." అంది పొడిగా. ఇంకా ఏవన్నా అనే వుండేదే! కాని ఆమె





మనిషే అయినా, మానవ సమాజంలో మనుష్యాకృతిలో బతుకుతున్నా, మనిషిలో వుండాల్సిన, వికసించి విజ్ఞతను ప్రదర్శించుకొనే ఇంగితంలేక, దానికి తగిన భావ వ్యక్తీకరణ ఎలాంటిదో తెలీక, అలానే అహల్యలా రాయి అయి పోయింది.

"బాబయ్యా! ప...ప్పది...రూపాయి నా కెప్పుడు ... నా కెవురూ ... నాకు ఎప్పుడూ...ఇవ్వలేదు..."

"నేనిస్తున్నా. వుంచుకో ... కూచో అక్కడ"

ఆమె విస్తుపోతూనే తడికల 'గోడ' ఊతంగా జారి కూచుంది. పోలియో కాళ్ళు ఆమెను కాస్సేపు ఏడిపించాయి. అందువల్లే ఆమె కళ్లల్లో 'కన్నీళ్ళు' తిరగ లేదు. ఆనందమో, మరెందుకో కళ్ళు సముద్రాల్లో నిండిపోయాయి.

"మీ దేవూరు ?"

"చిట్టేలు పాడండి" మెల్లగా అంది.

"ఇలా వచ్చేశావేం ?"

ఆమె నా వేపు చూసింది. క్షణం మాటాడలేకపోయింది.

"కరము బాబు గారూ !"

"కర్మంటే?"

"ఏ పూర్వ జలవంలోనో పాపం సేసుంటాను. అందుకని ఈ జలమలో ఇల్లాగయ్యాను బాబు గారూ!

"పూర్వ జన్మంటే-అపూర్వజన్మలో నువ్వెవరై వుంటావ్?"

"ఏవో తెలవదు. కానీ ఆ జలవంలో దేవుడు సెమించని తప్పు ఎయ్యోసేసుంటాను. అందుకని యిల్లా గీజలమంలో ఈ బతుకు బతుకుతున్నాను బాబూ గారూ."

"ఈ జన్మలో యిలాంటి పన్చేస్తున్నావ్ కదా, మరి మళ్ళీ జన్మలో కూడా, మరీ పాపపు బతుకిక్కే దేవుడు నిన్ను పొమ్మంటాడేమో ?" అన్నాను.

"అవును బాబయ్యా! మరీ నాసికం జలమే వొత్తాది. కానీ యిల్లాగ జెలమ జెలమలకీ పాపాత్చేస్తావుంటే, దేవుడికే యిసిగెత్తిపోతాది. అప్పుణ్ణన్ను ఏ కుక్కగానో కోడిగానో పుట్టమంటాడు. ఆ జలమ వొస్తే, ఆయిగా ఈదుల్లో పడి ఎంగిలింటాను. గింజలేరుకుతింటాను. ఎవురూ ఏవన్రు,"

"కుక్క బతుకు నీచంకాదా ?"

ఆమె నవ్వింది - పోలియో నవ్వు.

"కాదు బాబయ్యా ! కుక్కంటేఏటి ? బకితిదేవుడు. అంటే బకితి దేవుడి జలమ ఆయిపోనాక మల్లా జీవి దేవుళ్ళో కల్సిపోద్దట. అప్పుడు తిరిగి మనిసి జెలమ ఎత్తొచ్చు."

"ఎవరన్నారు ?" అన్నాను.

"అరికదల్లో సెప్తావుంటే యినేదాన్ని."

"నీకు తలిదండ్రులు ఎవరూ లేరా?"

"లేరు."

"ఏమిటి ? తల్లీ తండ్రీ లేకండానే పుట్టావా ?"

ఆమె మళ్ళీ పోలియో నవ్వు నవ్వింది.

"తలి దండురులు లేకండా ఎవురైనా పుడ్తారా బాబుగారూ ?

నాకుండేవారు.

పుట్టాక మా అయ్య సచ్చిపోనాడు.

అమ్మ కూలిపన్చేసేది. దాంతోబాటు నేనూ సేస్దేదాన్ని.

పెద్దదాన్ని అయ్యాక ఓ అయ్య సేతిలో పెట్టారు.

పెట్టి, నాలాంటోళ్ళనే కనమని

'సెప్పారు' !

నేను కనేలోవునే నా పెనివిఁటి మరో దాన్ని మరిగి ఇంటికిరాటం మానేసినాడు.

ఆడు రాటం మానేదం నా తప్పా ?

నా తప్పే అన్నారంతా !

నా దయ్ద్రిదగొట్టు మొకం ఆ కొంపలో అడు గెట్టాకే, ఆడలాగ అయిపోనాడని, మా అత్తరింటివోళ్ళూ, పొరుగింటోళ్ళు నానా తిట్లూ తిట్టారు.

మా యింటోడు తాగొచ్చి సితకబాదేవాడు.

బాదిబాది, సాలొచ్చి పడిపోతే, కుక్క సీడ్సినట్టు ఈడ్సి పారేసేవాడు.

అలాగలాగ అయిదేళ్ళు గడిపాను.

సివరికి మా యింటోడికి పచ్చవాతం వొచ్చేసి, కొన్నాళ్లకి కళ్ళుమూసాడు. నేను కళ్ళు తెరవలేని ఆడదాన్ని.

పైగా కాళ్ళులేని కుంటిదాన్ని.

పన్నేసుకుని బతకలేనిదాన్ని.

సివరికి ఓ తల్లి మాటొప్పుకుని పూరొదిలేసాను.

సాలా వూళ్ళు తిరిగాను - ఇలాగే !

సివరికి ఈ వూర్లో కొచ్చి పడ్డాను.

కాని నా మొకంలో ఏవీఁలేదు.

సేతుల్లో సత్తువు లేదు.

కాళ్ళలో బలం లేదు. కానీ నా దగ్గర ఆడతనం వుంది.

దానికోసం ఏ రెండ్రోజులకో మూడ్రోజులకో ఏ రిచ్చా బాబో, ఏ కూలాడో, ఎక్కువ డబ్బు లిచ్చుకొనే నోళ్ళు నా దగ్గర కొచ్చి వుంటారు.

"అంటే రెండు మూడ్రోజులకి పావలా అర్ధామీద బతుకుతున్నావా ?" అన్నాను.

"బతకాలి కదా బాబూగారూ! సావాలంటే సేతుల్రావు. సస్తేమరింతపాపం!"

"అంచుకని చావాలేక, బతకాలేక చావు బతుకుల బతుకుని బతుకుతున్నావా ?"

"సెప్పాను కద బాబుగారూ! పూరవ జలమంలో పెట్టి పుట్లేదని. అందు కను బగించాలి."

"అంటే నీ ప్రస్తుత పరిస్థితికి దేవుడే కారణం అంటావ్ !"

"దేవుడు కాదు బాబుగారూ! నా ఎనక జలమ పాపమని అంటున్నాను గదా ?"

"సరే వెనక జన్మలో పాపమే చేశావనుకుందాం. కానీ, ఎందుకు చేశావో ఆ నీ దేవుడిగారికి తెలుసుకునే జ్ఞానం లేదా ? అలాంటి అజ్ఞాని దేవుణ్ణి చిదగదన్ని, కొత్త దేవుణ్ణి ఎందుకు మీరు ఎంచుకో కూడదు ?"

"దేవుణ్ణా ? ఆ దేవుడు మా క్కాన పట్టాడా బాబుగోరూ ?"

"ఆఁ ! ఆ కనిపించని దేవుడు, కనిపించే వరకూ తిట్టండి. వాడు కోపంతో కిందికి దిగొచ్చి అవతారమెత్తితే ఒరే దేవుడు బాబూ ! నరకాసురుళ్ళనీ, రావణులన్నీ చంపెయ్యడం కాదురా ! మమ్మల్ని బతికించరా, మా బతుకుల్ని బాగుపర్చరా అని మెడపట్టుకుని అడగండి."

"బాబుగోరూ ! బాబుగోరూ ! దేవుణ్ణి అంతమాట అనొచ్చా ? అనొచ్చా ?"

"ఏం ? మీ బతుకిల్నిలా బూడిద చేస్తున్నవాడు దేవుడైతే ఏమిటి ? దేశ పాలకుడైతే నేమిటి ? మనిషి జన్మెత్తాం గాబట్టి మనందరికీ అడిగే హక్కుంది. చూడు 'అహల్యా'! ఈసారి ఆ దేవుడు కనిపిస్తే ఛెడామడా నాలుగు..."




"బాబయ్యా ! బాబయ్యా ! అంత మాటనకండి బాబుగోరూ !

ఈ జలమకింత అనుబగిస్తున్నానుః !
ఇంకా ఇంకా ఇంకా అనుబగించవం టారా ?

వొద్దు బాబయ్యా ?

నా కితం జలమల పాపాలు పోయే వరకూ మనిసి జలమే ఎత్తి, సివరికి కుక్క, కోడి, దోవఃనై ఆ మాత్మెళ్లో కలిసిపోనియ్యండి బాబయ్యా !

నేను నెగలేను.

తిరగబళ్ళేను.

తిట్టలేను.

తన్నలేను.

నా కర్మ నన్ను నుబగించెయ్యనియ్యండి బాబయ్యా"

అని వలవలా ఏడ్చేసింది ఆ శిలా రూప అహల్య !

నేను నిట్టూర్పు విడిచిలేచాను.

"ఉండరా బాబుగారూ !"

తల అడ్డంగా తిప్పాను.

"నా దగ్గర జబ్బుల్లేవు బాబుగోరూ!"

నాకు నవ్వాగింది కాదు.

"నీ దగ్గర జబ్బుల్లేవు కాని, సమాజం మొత్తం జబ్బులమయమై పోయిందమ్మా! ఈ జబ్బుల్ని బాగుచేశాక మిమ్మల్ని... మిమ్మల్ని..."

ఇక మాట పూర్తి చెయ్యలేక పోయాను.

గబగబ బయటకు వచ్చేశాను.

ఇక కాలవగట్టు అవతల వున్న కమ లాంగుల దగ్గరకు వెళ్ళా లనిపించలేదు.

మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ వచ్చాను. ఎదురుగా రిక్షవాడు వచ్చాడు.

'ఏవిఁబాబయ్యా! సెప్పాపెయ్యకుండా వొచ్చేసినారు?'

వాడి మాట వినిపించుకోలేదు. రిక్షా ఎక్కి కూచున్నాను. ఫలానా హోటల్ కి వెళ్ళ మన్నాను.

వాడు దారిపొడుగునా ఏదేదో మాటా డుతూనే వున్నాడు. కానీ నాకు ఒక మాటా సరిగా అర్థం కావటంలేదు.

అవతల - ప్రస్తుత పాలకుల లోప భూయిష్టమైన ప్లానుల వల్ల నలిగి నలిగి నాశనం అయిపోతున్న విజ్ఞానులూ, దేవుడి అదృశ్య హస్తమహిమతో మూఢత్వంతో క్రుంగి కుమిలిపోతున్న పాటక జనం - అంతా మూకుమ్మడిగా ఏమైపోతున్నారు ?

రాబోయే సమాజం, ఏ రూపంలో ఎంత వికృతంగా తయారవుతుంది!

ఇదే నా ఆలోచన!

హోటల్ కి వచ్చాక, దిగి, మళ్ళీ రిక్షా వాడికి డబ్బులిచ్చి పంపించేశాను.

నా గది దగ్గర కొచ్చేసరికి పక్క గదిలో నించి ఒకాయన తూలుతూ వచ్చాడు. అతను నావేపే చూస్తున్నాడు.

'మి.. మ్మల్ని ఎక్కడో చూసినట్టు న్నాను.' అన్నాడాయన-ఆంగ్లంలో

ఆయన చూట్టం కాదు నేనే చూశాను. ఒకసారి ఆదిలాబాద్ అడవుల్లోంచి కార్లో వచ్చేస్తూ వుండే, ఒక చోట ఆయన కారు చెట్టుని గుద్దుకొని, అందులోవున్న నలుగురికీ ప్రమాద కరమైన దెబ్బలు తగిలి మూలుగుతూ వుండే, వాళ్ళని తీసుకొనివచ్చి హైదరాబాద్ హాస్పిటల్ లో చేర్చాను. ఆయనా, ఆయన భార్యా, తల్లీ తండ్రీ కూడా - నా చలవవల్ల కాక- డాక్టర్ల చలవ వల్ల బ్రతకారు. వాళ్ళు చాలా చాలా కృతజ్ఞతలు చెప్పుకొన్నారు అప్పుడు. వాళ్ళు ఈ ప్రాంతం వాళ్ళు




కారు. వ్యాపారరీత్యా హైద్రాబాద్ వచ్చే కోటీశ్వరులు.

అప్పటికీ యిప్పటికీ చాలా కాలం జరిగిపోయినా నేను గుర్తుండి పోతాను వాళ్ళకి. ఈ విషయం కొద్దిగా గుర్తుచేసే సరికి ఆయన, నన్ను కావలించుకుని కడుపులో పడిన విస్కీ నిషాల్లనేమో ఏడ్చేశాడు.

"సార్! ఆవాళ మీకు ఏం కృతజ్ఞతలు తెలపాలో తెలీలేదు ఇప్పుడు దొరికారు. ఇక మిమ్మల్ని వొదల్ను, మిమ్మల్నిప్పుడు మా కృతజ్ఞతల్లో ముంచెయ్యాలి రండి సార్" అని ఆంగ్లంలో అనర్గళంగా అనేసి తన దిలోకి లాక్కుపోయాడు.

గది ఏర్ కండిషన్డ్ అయినా సిగరెట్లూ, విస్కీల వాసల్తో పిచ్చిపిచ్చిగా పరవళ్ళు తొక్కుతోంది.

లోపల ఇద్దరు మగాళ్ళున్నారు.

ముగ్గురు అప్సరస లాంటి అంగనలు వున్నారు.

అంతా దాదాపు దిగంబరంగానే వున్నారు.

రెండుజతల ఆలింగనాల్లో, ఆంగ్లంలో ముద్దు ముద్దుగా తిట్టుకుంటున్నారు.

అందరూ బాగా తాగిన మైకంలోనే వున్నారు.

ఎదురుగా కొన్ని పాశ్చాత్య బూతు బొమ్మల పుస్తకాలున్నాయి.

పక్కన 8 యం.యం. ప్రొజక్టర్ వుంది.

అందులో ఫిల్మ్ వుంది.

అదేం ఫిల్మ్ అయివుంటుందో వూహించక పోలేదు నేను.

నన్ను లోపలికి తీసుకురాగానే నా ఏక్సిడెంటల్ మిత్రుడు నన్ను అందరికీ పరిచయం చేశాడు.

నా పేరు తెలీదు.

నేనెవరో తెలీదు.

హైసొసైటీలో పేర్లుండవ్.

మనుషులే వుంటారు.

తర్వాత అక్కడున్న అందర్నీ పరిచయం చేశాడు.

ఒకాయనపోలీస్ఆఫీసర్. మరొకాయన మరోరాష్ట్రపు పెద్దఆఫీసర్. వాళ్ళు నన్ను చూడలేదు, వాళ్ళల్లో వున్న 'విస్కీ' వాళ్ళ విజ్ఞతని పోగొట్టింది.

ముగ్గు రమ్మాయిల్లో ఒకామె ఒక కోటీశ్వరుడి కూతురు.

మరొకామె మహిళా సంఘ సభ్యురాలు.

మరొకామె పాశ్చాత్య వనిత !

నాఏక్సిడెంట్ మిత్రుడుకోటీశ్వరుడు. ఆయన దగ్గర స్థిరచరాస్తు లెన్నున్నాయో అంతకు మించిన ఆదాయపు పన్ను ఎగవేత వుంది.

పోలీసాఫీసర్ని తప్ప మిగతా వాళ్ళందరిదీ ఈ రాష్ట్రం కాదు.

ఆ ముగ్గురాడవాళ్ళకీ కూడా లక్షలక్షల ఆస్తివుంది.

ఆ స్తిని మించిన సిమెంట్ భవనపు అంతస్తులున్నాయి.

వీటన్నిటినీ మించిన సెక్స్ వుంది.

పక్కనే బ్లూఫిలిం వుంది.

వాళ్ళందర్లో చదువుంది.

యూనివర్సిటీ డిగ్రీలున్నాయి.

దానికి సంబంధించిన హై క్లాస్ సంస్కారంవుంది.

బ్లూఫిల్మ్‌ల్లో కూడా 'విజ్ఞానం'వుంది వాన్లో కూడా సంస్కారమేవుండాలి

కారణం : ఈ సంస్కారులు వరించినది గాబట్టి.

"సార్ ! బ్లూ ఫిల్మ్ చూద్దామా ?" అన్నాడు కోటీశ్వర సంస్కారి ఆంగ్లంలో

నేను బ్లూఫిలిమ్స్ గురించి విని వున్నాను. కానీ చూసే తీరికా, అవసరం సమయం అవకాశం ఎప్పుడూ చిక్క లేదు, చూడాలనే 'కుతి' లేకపోయినా, చూడాలనే పరిశోధనాకాంక్ష హెచ్చింది.

బ్లూఫిలిం మొదలయింది. పడగ్గదుల్లో చేసే శృంగార చేష్టలుకావవి.

కామ ప్రవృత్తి పైశాచిక రూపాన్ని 'ధరిస్తే', ఎంత వైకృత్యాల్లో బహిర్గతం అవుతుందో అంత విశృంఖలం గానూ వుంది.

ఫ్రాయిడ్ చెప్పిన 'ఇద్' ఎన్ని రకాలుగా, ఎన్ని అవతారాలు ఎత్త గలదో, అంతకు వేయి కోట్ల రెట్ల వికృతంగా చిత్రీకరించారు

తెరమీద ఆ వికృతచర్యలు పిచ్చిగా పచ్చిగాకనబడుతూ వుండే, విస్కీ తాగి మనోవైకల్యాన్ని పొందిన గదిలోని రెండు తెగల వారూ, అతిక్రమించినట్టు ప్రవర్తించసాగారు.

ఫిల్మ్ పది నిమషాలే 'ఆడింది'! కాని వీళ్ళు పది టుది పవరాఫ్ కోటి భంగిమల్లో పడ్డారు. నియాండర్ తల్ మానవుల్లోనైనా యిలాంటి చేష్టలుండవేమో !

అలసిపోయిన జంటలు నా మీద పడిపోయారు !

నేను లైటు వేశాను. వెలుతుర్లో వాళ్ళు ఆరుగురూ సంపూర్ణనగ్నత్వంతో, వానర జాతిలా వున్నారు.

వాళ్ళల్లో యిప్పుడు స్పృహలేదు. విస్కీ వాళ్ళను వమ్ముచేసింది. మానవ

స్త్రీలు కొద్దిగా స్పృహలో వున్నట్టున్నారు. ఒకామె తూలుతూ నా దగ్గరికి వచ్చింది.

"మీరీ గేమ్‌లో పాలుపంచుకోరా?" అంది కాన్వెంట్ ఇంగ్లీషులో.

తల వూపాను.

"దెన్ కమాన్" అని ఆమె నన్ను కావలించుకుంది.

నేను విడిపించుకుని ఆమెను ఎదుటి సోఫామీద చంటిపిల్లలా కూచోబెట్టాను.

"మీరు బాగాఅలసిపోయినట్టున్నారు" అన్నాను ఆంగ్లంలో.

"అలసిపోవడమా? నెవర్! నెవర్!! దేవుడు-అలసిపోయేందుకు ఈ కార్యాన్ని మనిషికి ప్రసాదించలేదు" అంది నిషా నిషాగా, మాటమాటకీ డేష్‌లు యిస్తూ.

"దేవుణ్ణి నమ్ముతారా ?"

"ఓ ! యస్....అంటే 'నో' అని కూడా. అంటే నమ్ముతాం నమ్ముతూ నమ్మం. నమ్మకుండా నమ్ముతాం. ఆఫ్టరాల్ దేవుడుకూడా సెక్స్‌కి దాసుడే. యూ సీ! శివలింగం దేనికి సింబల్ ? దానికింద చప్టా స్త్రీ మర్మావయానికి సంకేతం కాదా?"

ఈ అమ్మాయితో వాదించడం అర్థం లేని పని. వీళ్ళ అంతస్తులో వుండే వాతావరణం అలాంటిది.

"ఆయన మీకేమవుతారు?" అని, నా 'ఏక్సిడెంట్ మిత్రుడివేపు చూపించాను.

"యూ మీన్-రిలేషన్ ? ఏవీకారు. నా బాయ్ ఫ్రెండ్. దట్సాల్".

"మరి పెళ్ళి..."

నా మాట పూర్తికాకుండా పకపకా విస్కీ నవ్వు నవ్వింది.

"పెళ్ళా ? పెళ్ళంటే ఏవిటి ? ఎ లైసెన్స్ అన్నాడు బెర్నార్డ్‌షా ! పెళ్ళనేది మామూలు మనుషుల మొరాలిటీ అన్నాడు మరొకడు. మనిషి స్వేచ్ఛాజీవి. ఒకడితో వుండటం అంటే మన స్వేచ్ఛను అమ్మేసుకోవడమే అన్నాడు మరొకడు. ఇంతమంది మహానుభావులు యింతగా చెప్తున్నా మనం మూరేజో, మూరేజో అని ఒకరితోనే ముడిపడి వుండటం ఏవిటి ? నాన్సెన్స్. మనిషి ఎన్నో రకాల తిక్క తింటాడు. అలానే ఇదీను. వై డోన్ట్ యూ కమ్ అండ్ హగ్ మి ? ఆర్ ఇఫ్ యూ లైక్ డూ ఇట్..."

'షటప్' అని లేచిపోదామనుకున్నా. కానీ ఇంతమంది హైసొసైటీ జనం ముందు లేచిపోవడం నా సంస్కారం. కుసంస్కారమే అవుతుంది.

"చూడమ్మా!" అని మొదలు పెట్టబోతూవుంటే ఆమె నా నోరు మూసేసింది.

"ఓ డాడీ! డోన్ట్ బి సిల్లీ. అమ్మా మమ్మా జాన్తానై. కమాన్" అటూ నన్ను మీదికి లాక్కుంది.

ఈ 'శూర్పణఖ' లోహ బంధంనించి విడిపించుకునేసరికి నా తల సంస్కారం కాళ్ళల్లోకి వచ్చింది. ఆమెనువదిలించుకుని నా గదిలోకి పోయాను.

గడగడా ఐస్ వాటర్ తాగేశాను. ఇంతలో ఫోన్ మోగింది. రిసీవర్ ఎత్తాను. అవతలనించి ఒక స్వచ్ఛమైన స్త్రీ కంఠం వినిపించింది.

"అక్కడ రాంబాబు గారు లేరా ?" అందామె.

"మీ రెవరు ?"

"నేను...నేను...వారి...."



"శ్రీమతి గారా?" అన్నాను.

"కాను."

"మరి ?"

"ఎవర్నో ఎందుగ్గానీ, ఆయనక్కడ వుంటానని చెప్పారు. మీ దగ్గర వుంటే ఒకసారి రమ్మనమని చెప్పండి" అందామె.

"మీరెవరో చెప్పకుండా, ఎక్కడికి రమ్మనమని చెప్పమంటారు? అసలు మీరెవరో చెప్పండి."

ఆమె క్షణం ఆలోచించింది. తర్వాత "నాపేరు సుశీలాబాయి" అంది.

సుశీలాబాయి!! ఆమె పేరు విన్నాను.

ఒకానొకప్పుడు దేవదాసీలకు చెందిన వర్గం వారు!

ఇప్పుడు ఒకరితోనే 'వుండిపోయిన' ఉంపుడుకత్తె.

ఉంపుడు కత్తె కూడా కాదు, ఉపపత్ని. అది కూడా కాదు, కన్నెరికం చేసిన మొదటి మనిషితో జీవితాంతం 'బతికే' వారవనిత.

ఆమెతో మాటాడాలని పించింది.

"నన్ను రమ్మంటారా ?"

"ఎక్కడికి ? ఇక్కడికా ?" ఆమె కంగారు కంగారుగా అంది.

"అవును. మీ దగ్గరికే !"

"ఎందుకు?" అంది మరీ కంగారుగా.

"ఓం నమె జీ అద్యా, వేద ప్రతి పాద్యా" సంస్కృతంలో అని "ప్రధానమైన, ప్రధమ శ్రేష్ఠుడైన వ్యక్తికి నమస్సులు". అన్నాను. సంస్కృతంలో కావాలనే అన్నాను-ఆమె ఎలాంటిదో తెల్సుకోవాలని.

ఆమె నవ్వింది. "ధ్యానేశ్వర్ అన్న మాటలు అంటున్నారా ? ఆయనన్నది సర్వశ్రేష్ఠుడైన భగవంతుడు గురించండి నాలాంటి పుంశ్చలి గురించికాదు అయినా మీరు నన్ను చూడాలేదు, పెట్టాలేదు, ఎందుకు ఇలా నా దగ్గరకు రావాలని అనుకుంటున్నారు."

"ఉత్, త్వః శృణ్వన్ న శృణొత్యేనామ్-అంటే..." అని నేను అంటూండగా, ఆమె-"మనిషి వింటున్నాడు, కాని ఆమెను వినలేదు - అని ఋగ్వేదం అంటోందంటారు కదూ ?" అంది.

నేను నిజంగా ఆశ్చర్యపోయాను. ఇంత విజ్ఞానఖని యిలాంటి వేశ్యావృత్తిలోకి ఎందుకు దిగింది ?

"నా ప్రశ్నకు ఇంకా మీరు సమాధానం చెప్పలేదు. మీరు యిక్కడికెందుకు వస్తానంటున్నారు?" అందామె.

"విశ్వావామాని ధీమహి. అందమైన 'దాని' గురించి మనిషి యోచిస్తాడు" అన్నాను.

ఆమె నవ్వింది. "సుస్వాగతం" అంది.

నాకు ఎక్కడలేని హుషార్ వచ్చింది.

నేను వెంటనే ఆమె యింటికి బయలుదేరాను.

ఇల్లు మామూలు యిల్లు కాదు. పెద్ద భవంతి. ఆ భవంతిని వాళ్ళ అమ్మగారికి ఒక లక్షాధికారి కట్టించి యిచ్చాడు. అది ఆమెకి వంశపారంపర్యహక్కుగా వచ్చింది. దానిని రాంబాబుగారు అత్యాధునికంగా తయారు చేశాడు.(ట!)

ఆమెను చూడగానే నిజంగా నా నవనాడులూ జివ్వు మన్నాయి. ఆమెను ఏ లావణ్యమూర్తితో పోల్చినా, ఆమె దగ్గర లాభం లేదు. భూగ్రహం మీద యింతటి




సౌందర్యవతి వుంటుందా అని ఆశ్చర్య పోయాను. ఆమె గది చూశాక, ఆ పుస్తకాలు చూశాక మరింత ఆశ్చర్య పోయాను.

"కూచోండి బాబుగారూ" అందామె.

"నేనెవరో మీకు తెలుసా ?"

"వ్యక్తిగా తెలీదు. కానీ మీ వాక్కు విన్నాక సరస్వతీ పుత్రులనిపించింది. ఇప్పుడు చెప్పండి నాతో ఏం పని?"

"ఏం లేదు. చూడాలనిపించింది. అంతే."

ఇంతలో ఫోన్ మోగింది. ఆమె రిసీవర్ అందుకుంది. అవతలనించి మగ కంఠం కఠినంగా వుంది.

"ఇప్పుడు రావద్దు. రేపు రండి రాం బాబుగారూ!" అంది ఆమె మరీ ధీమాగా, దర్జాగా, కోపంగా.

"ఏం ?"

"ముఖ్యమైన అతిథి వచ్చారు."

"మగా ? ఆడా ?"

"మీలాంటి వారు కారు."

"అయితే వస్తా" అవతల నించి రాం బాబు కోపంగా అంటున్నాడు.

"రావడానికి వీల్లేదని చెప్పాను" అని ఫోన్ పెట్టేసింది.

నాకు ఒక రకంగా భయం పట్టుకుంది. "బావుండదు. నేను వెళ్ళొస్తాను" అని లేవబోయాను "కూచోండి బాబుగారూ! వాళ్ళువచ్చేది నా శరీరం కోసం. నాకో ఆత్మ వుంది" దానికి 'ఆకలి' వుంది. దాన్ని తీర్చుకోవాలని తపన నాకుండదు? జీవితంలో మొట్టమొదట కలిసిన వేదాంతి మీరు మీతో ఈ రాత్రంతా గడుపుతాను. ఐ మీన్ దైహిక వాంఛల వుపశమనం కాదు. మానసిక శాంతి కావాలి చెప్పండి."

"ఏమిటి చెప్పడం? నేను వెళ్ళొస్తా" అని వెనక్కి తిరగబోతూ ఆగాను. నాకు అమితమైన నిగ్రహశక్తి వుంది. నాకు తెలుసు. కానీ యింతటి సుకుమార సుందర మంజుల మేసకని చూసి, నా శక్తి విచ్ఛిన్నం అయిపోతే?

"ఏమండీ!" అందామె నా దగ్గరగా వచ్చి, నా కళ్లల్లోకి చూస్తూ "దేవుడు ప్రత్యక్షమయాడనిఆనంద పారవశ్యంలో వుక్కిరి బిక్కిరి అయిపోతున్న భక్తుడి వైనం చూసి, ఆ దేవుడు విసిగెత్తి మాయమైపోతే, భక్తుడెలా అయిపోతాడో వూహించలేరా?" అంది.

"నేను దేవుణ్ణి కానమ్మా' అనాలనుకుని, అనలేక 'అయితే ఏమిటమ్మా నా నించి నీకు కావలసింది?" అన్నాను.

"సలహా" అంది. వెంటనే "సలహా కాదండి. నా పరిస్థితినీ, స్థితినీ చెప్పకోవాలని వుంది" అంది.

"నేనేం ఆర్చేవాడినా తీర్చేవాడినా?" అన్నాను.

"రాతి విగ్రహంలో వున్న 'దేవుడు' మాత్రం భక్తుల కోర్కెలని ఆరుస్తాడా? తీరుస్తున్నాడా? కానీ మనిషే, ఆ విగ్రహాన్ని చూసి, అందు మీద తన భావాలని ప్రసరింపజేసి, ఆ వి తిరిగి తనే 'కేచ్' చేసి, మానసిక తృప్తితో 'బలవంతుడు' అవుతాడు. అలాంటిదే మీనించి నాకు కావాలి. 'నేను దేవుణ్ణి కాను' అని మీరనొచ్చు. కాని విజ్ఞానం మీలో వుంది. అదే దేవుడని నేను నమ్మాను. ఒక మాటలోనే అలాంటి అభిప్రాయం ఎలా కలిగింది? అని మీరు ప్రశ్నించకండి. నా నమ్మకం. ఆ నా నమ్మకమే మిమ్మల్ని దేవుడిగా వూహిం

చింది ఆ దేవుణ్ణి మన ఋషులుతండ్రిగా కొందరు భావిస్తే తల్లిగా మరికొందరు వూహించుకున్నారు. మరికొందరు కలడు కలడనేవాడు కలడో లేడో అని వూగిస లాడినా, పూజించారు. మరికొందరు 'కల్యాణీ ఖిర్ యువతి భిర్ నమర్యః' సౌందర్య స్త్రీల మధ్య తిరుగాడే యువకుడిగా పూజించారు. అంటే శారీరక అనుభూతి కాదు. సౌందర్యానుభూతి. అదే నా జీవితానికి మృగ్యమయింది బాబుగారూ"

నాకేమనాలో అర్థంకాలేదు. ఇంతలో మళ్ళీ ఫోన్. ఆమె రిసీవర్ అందుకుంది. ఈసారి చాలా కోపంగా కసిగా అరిచింది.

"మీరు రావద్దు రాకూడదు, కాదని వస్తే నేను రానివ్వను. సారీ, ఇక మాట్లాడకండి' అని ఫోన్ పెట్టేసింది.

ఫోన్ పెట్టేశాక క్షణం మాట్లాడలేదు. తర్వాత నిట్టూర్పు విడిచింది.

"నేను దేవదాసీలకులంలోపుట్టానండి.

సమాజంలో అన్ని విధానాలూ మారుతున్నాయి. కానీ మన కులవ్యవస్థ మారటం లేదు.

నాకు కన్నెరికం చేసి నాయన ఈ రాంబాబుగారు. అందుకని ఆయనకు నా మీద సర్వాధికారాలూ వున్నాయి. కులం పరంగా.

కానీ మనిషిగా, నా మానవ మనస్సు ఏం వూహిస్తోందో ఆయనకు అవసరం లేదు.

నాకు డాక్టరవాలని వుండేది. ఇంటర్ బాగానే మంచి మార్కుల్తో పాసయా. మెడికల్ కాలేజీకి వెళ్ళబోయాను.

కాని కన్నెరికం చేసిన రాంబాబు గారు వొప్పుకోలేదు. అందుకని లిటరేచర్ చదివాను.

సంస్కృతం మీద వున్న మోజు కొద్దీ, ఆ భాషా అభ్యసించాను.

నా విజ్ఞానం మరో వేపు వురకలు వేస్తోంటే, సమాజంలో నా కులం 'నన్ను' సాంప్రదాయాల తాళ్ళతో కట్టిపారేసింది.

నేను స్త్రీని.

నాకూ బిడ్డలు కావాలి.

వాళ్ళతో ఆడుకోవాలి.

వాళ్ళని పెంచి మామూలు స్త్రీలలా స్త్రీత్వాన్ని పొందాలని వుండదా బాబుగారూ?

సరే రాంబాబుగారే నా భర్త అనుకున్నా.

కానీ ఆయనకు పిల్లలు యిక అవసరం లేదు. అందుకని వేసక్టమీ చేయించేసుకున్నారు.

తను అగ్నిసాక్షిగా పెళ్లాడినభార్యకు మాత్రం పిల్లలు కలగాలి.

కానీ 'ఉంపుడుకత్తె'గా వున్న నాకు కలక్కూడదు.

కలిగితే, ఆ సంతానం ఆయన ఆస్తిలో భాగం అడుగుతారట.

వెధవ డబ్బు!

నా తల్లి గడించిందే లక్షలు వున్నాయి. ఈయన వాటా నా 'పిల్లలకి' ఎందుకు ?

అదీ కూడా కాదు.

నాకు పిల్లలు కలిగితే నాలో యవ్వనం పోతుందట.

ఎప్పుడూ నిత్య యవ్వనవంతురాలిగా వుండాలని ఆయన భావం!

నిత్య యవ్వనమే కావాలంటే, సైన్స్ యింత వృద్ధి చెందింది. ఏ హార్మోన్లు తీసుకున్నా నా శరీరం బిగి తగ్గదు.

 

'ఈస్ట్రోజెన్', ప్రొజెస్టిరోన్' లాంటి సెక్స్ హార్మోన్లు తీసుకుంటే ముఖ్యంగా ఈస్ట్రోజెన్ తీసుకుంటే యవ్వనం స్త్రీలో చాలా కాలం సడలకుండా వుంటుంది.

ఈ విషయాలు ఆయనకు తెలీవు. చెప్పినా అర్థం చేసుకోరు!

ఆయనకు కావలసింది రాజకీయాలు.

రాజకీయాలు సమాజాన్ని తీర్చి దిద్దడానికే గదా.

సమాజమంటే మనుషులు.

కానీ నన్ను మాత్రం ఆయన, సమాజంలో ఒక భాగమైన నన్ను మనిషిగా చూడరు.

సెక్స్ దాహాన్ని తీర్చే ఒక యంత్రంగా చూస్తారు.

నాలో వున్న విరహ తృష్ణను మాత్రం తీర్చరు. గార్వ కాలంలో మహారాజులకీ ఉంపుడుకత్తెలు వుండే



వారు. ఒక్కో సమయంలో ఈ దేవ దాసీలు ఉంపుడు కత్తెలు, రాజకీయాల్లో, రాజుల కే సలహాలిచ్చేవారు. కానీ ఇప్పుడు? ఎసంబ్లీల్లో, పార్లమెంటులో ముఖ్యాతి ముఖ్యమైన విషయం చర్చించబడుతూ వుంటే, వీళ్ళు గదుల్లో కామక్రీడలు సాగిస్తుంటారు. ఇక దేశం ం బాగుపడుతుంది?

కుల వ్యవస్థ ఎలా రూపు మాసిడుతుంది?

ప్లానులు వేసినంతలో సమాజబాగు పడుతుందా బాబు గారూ?

ఐ.ఏ.యస్. ఆఫీసర్లే నిజమైన పాలకులు. కానీ వాళ్ళ మాటని ఈ పాలకులు నొక్కివేసి సమాజాన్ని ఏకయిత్తంగా 'సుఖ రోగాల్లో' చంపి పారేస్తున్నారు.."

నాకు తెలిసిన విషయాన్నే, ఒక 'వేశ్య'గా పరిగణింపబడుతున్న సామాజికురాలు నాకు ఉపదేశిం వుందంటే, కోపం రాలేదు.

జనం మేల్కొన్నార

ఆలోచిస్తున్నారు.

ప్రశ్నిస్తున్నారు.

వీళ్ళ వైజ్ఞానిక ప్రశ్నలు-ఒకనాడు కూడ బలుక్కుని మూకవుమ్మడిగా, నాలుగు పందల కోట్ల కంఠాల నించీ వెలువడితే ?

నాలుగు వంద కోట్ల హైడ్రోజన్ బాంబులు పేలిపో?

అప్పుడీ సహజం ఎక్కడ ?

భూగ్రహం క్కడ ?

సౌరకుటుంబంలో ఒక భూగ్రహం మీదనే వుండే మానవుల మనుగడ ఏమవుతుంది '





ఆమెతో ప్రస్తుతం వాదించే స్థితిలో లేను. తర్వాత వస్తానని చెప్పి వెళ్ళిపోయాను.

ఆమె బంగళా బయట వరకూ వచ్చి వీడ్కోలు యిచ్చింది. మళ్ళీ తప్పకుండా రమ్మనమని నా చేత ఒట్టు వేయించుకున్నమరీ వదిలింది.

నేను బంగాళా దాటి సందుతిరుగుతూ వుండగా ముగ్గురు పోలీసులు వచ్చి పట్టుకున్నారు.

"రా మాతో" అని అరిచారు.

"ఎక్కడికి ?"

"నీ మొగుడింటికి !"

"ఎందుకు ?"

"లంజ లింటికి వెళ్ళి—ఎందుకనిమళ్ళీ ఎదురడుగుతావా ? నడు" అని స్వచ్ఛమైన తెలుగులో అని, నన్నీడ్చుకుంటూ తీసుకుపోయారు.

పోలీస్ స్టేషన్ కాస్త పెద్ద చిన్న స్టేషనే. అక్కడ రక్షణ అనేది లాఠీల రూపంలో, తుపాకుల రూపంలో వుంది.

నన్ను లోపలికి తీసికెళ్ళి సబినిస్పెక్టర్ ముందు నిలబెట్టారు.

ఎస్. ఐ. నన్ను ఎగాదిగా చూశాడు.

నన్ను పట్టుకున్న పోలీసుల్లో, రిషావాడిని ఝడిపించి డబ్బులాగిన పోలీసూ వున్నాడు.

కాలవ గుడిసెల భారత సోదరీమణుల దగ్గర నించి 'చందాలు' వసూలు చేసే ఫోర్ ట్వెంటీ భిక్షక భటుడు కూడా వున్నాడు.

బ్రాకెట్లాటదగ్గరకూచుని,తనేబ్రాకెట్లు కడుతూ, దుకాణదారుడి దగ్గరనించి చిల్లరా, నోట్లూ గుంజుకునే రక్షక భటుడూ వున్నాడు.

"నువ్వాయింటికి వెళ్ళావ్. అది లంజ

యిల్లని తెలిసే వెళ్ళావా ?"

నేను మాట్లడలేదు.

"ఇందాక కాలవగట్టు ఇంట్లో కి కూడా దూరాడు సార్" అన్నాడు భక్షక భటుడు.

"బ్రాకెట్ కూడా ఆడాడు సార్" అన్నాడు భిక్షక భటుడు.

"ఆ కుంటి ముండతో కులికాడు సార్" అన్నాడు భక్షకభటుడు.

"అవునా ?" అన్నాడు ఎస్.ఐ.

నేను మాట్లాడలేదు.

మాట్లాడక పోవడంతో, ఎస్.ఐ.గారి కోపం తారస్థాయి నందుకుని, నా ముఖం మీద బలంగా గుద్దాడు.

నేను కిందపడిపోయాను. పడిపోయిన వాణ్ణి, రక్షక, శిక్షక, భక్షక, భిక్షక భటులు ఒక్కసారిగా నా మీద పడి బూటు కాళ్ళతో తన్నేశారు.

"లాకప్‌లో ... లాకప్" లో అని అరిచాడు యస్.ఐ.

వాళ్ళు నన్ను జుట్టు పట్టుకుని ఈడ్చుకు పోతుండగా ఫోన్ మోగింది. యస్.ఐ. రిసీవర్ అందుకున్నాడు.

"నమస్కారం సార్! వాడు దొరికాడు...ఆఁఆఁ మీరు చెప్పాలా? వాడికి బుద్దెలా చెప్పాలో మాకు తెలుసు ... మీరేం లాఠీలు పంపనవసరం లేదు. స్టేషన్లో చాలానే వున్నాయి ... తాళ్ళు వున్నాయి ... బెల్టులూ వున్నాయి ... చాలు. వాడికి బుద్ధి చెప్పగలం...వాడు ఎవడైతే మనకెందుకు సార్...పరాయి ఊరి వాడే! వాడికి ఒళ్ళు హూనం చేసెయ్యడం మాకు తెలుసు సార్..రక్తమా? నానానా! ఇన్నాళ్ళ నించీ ఈ సర్వీస్ లో వున్నాం. రక్తం బయటకురాకుండా కుళ్ళబొడి చెయ్యడం మాకు తెలుసు... చావళ్ళేండి...ఒకవేళ చచ్చినా కమీషన్ ఏర్పాటు చేస్తారని భయం లేదు...మా డ్యూటీ మేం చేస్తున్నాం. ఒకవేళ చచ్చాడే అనుకుందాం .... మన పోలీస్ డాక్టర్ గారు వున్నారుగా ... గుండె జబ్బుతో గుండాగి చచ్చాడని రిపోర్ట్ యిస్తాడు! ... ఏమిటి రాంబాబు గారూ! మీరు మాకు శిక్షలు గురించి చెప్పాలా? మీరు నిశ్చింతగా వుండండి! ... పార్టీకి ఇప్పుడు రమ్మంటారా? ఆఁ వస్తా ... ఏమిటీ ఫారిన్ లిక్కర్ వుందా? వస్తా వస్తా...జీడి పప్పూ, రొయ్య పకోడీలు, బిర్యానీ-చికెన్‌ది తెప్పించండి ... నాకు కృతజ్ఞతలు ఏమిటి సార్? అలా గే అలాగే...ధబ్బొద్దు...బంగారం వుంటే ఇవ్వండి. అదైతే మంచిది...ఎస్సెన్.. దాన్దర ఆకాశంలోకే పోతూవుంటుంది ఎప్పుడూ. వుంటా, మీరేం కంగారుపడకండి. వాడి పని మేం చూస్తాం" అని ఫోన్ పెట్టేశాడు.

రక్షక, శిక్షక, భక్షక,భిక్షక భటులు నా వళ్ళు హూనం చేసేస్తున్నా, నాకా ఫోన్ మాటలు స్పష్టంగా వినిపిస్తూనే వున్నాయి.

యస్.ఐ. రాగానే వాళ్ళు పక్కకు తప్పుకున్నా, తాగి వున్న రక్షక భటుడు లాఠీతో ఇంకా నా డొక్కల్లో పొడుస్తూనే వున్నాడు.

"ఇదిగో ! వాడి కాళ్ళూ చేతులూ కట్టేసి, పై హుక్‌కి వేలాడదీయండి. రాత్రంతా అలా వుంచి, రేపు కూడా మిగతా పన్చేసి, ఛార్జి షీట్ తయారు చేద్దాం" అన్నాడు యస్.ఐ.

నలుగురు భి,శి,భ. రక్షక భటులూ తాళ్లు తీసుకొచ్చి, నా కాళ్లూ చేతులూ

వెనక్కి విరగదీసి కడుతున్నారు, పందుల్ని చంపే ముందు కసాయివాళ్లు, వాటిని విరగదీసి కట్టినట్టు.

ఇంతలో మరికొందరు రక్షక భటులు కొందరు ఆడవాళ్లని గొర్రెల్ని తోలుకొచ్చినట్టు, తోలుకుని వచ్చారు. పాతికమందివరకూ వున్న ఆ ఆడవాళ్ళు - రాంబాబులూ, వెంకటేశులు గార్లూ 'సోదరీమణులారా' అని సంబోధించిన 'ఓటు హక్కు' వున్న భారతీయ లలనలే!

వాళ్ళనందర్నీ ఎస్. ఐ.గారు పరిశీలనగా చూడలేదు. "వీళ్ళంతా పాత లంజలేనా?" అన్నారు.

"అవున్సార్" అన్నాడు కొత్తగా మందని తోలుకొచ్చిన హెడ్ రక్షకభటుడు.

యస్. ఐ. గారు వాళ్ళదగ్గరకొచ్చి

 

"ఏవే! కితంసారి పట్టుకుని కోర్టులో ఏభై య్యేసి రూపాయలు జుల్మానా వేసినా మీ వెధవబుద్ధి మాన్లేదా?" అన్నాడు.

"ఎల్లాగ మాన్తావ్ సార్! అలవాటడ్డ పేణాలం" అందొక సోదరీమణి.

"నోర్ముయ్యే నంజా! ఆరెవరను కున్నా వే-ఎస్సయ్యిగోరు" అనరిచాడు హెడ్డు ర.భ.

'తెలుసున్లేరా-ఆడూ నా దగ్గరకొచ్చి నోడే' అనాలనుకుందేమో, ఆ రాంబాబు, వెంకటేశులుగారి 'సోదరీమణి'.అనకండా చిర్నవ్వుతోనే ఆ భావాన్ని కనబర్చింది.

ఎస్సయ్‌గారు అందర్నీచూసి ఒక సోదరీమణి దగ్గరికొచ్చాడు. ఎగాదిగా, దిగాఎగా చూశాడు. ఇదెవర్తో కొత్త సరుకులాగుంది. ఆ పిల్లనలా ఎగాదిగా, దిగాఎగా ఎస్సయ్‌గారు చూస్తూవుంటే, హెడ్డు ర.భ.గారికి ఆ చూపులర్థం తెలిసి పోయింది.

"తీసుకుపోమంటారా సార్ ?" అన్నాడు మెల్లగా.

'ఓర్నా కొడకా! అంత గట్టిగా అంటా వేవిట్రా?' అన్నట్టు ఎస్సయ్‌గారు హెడ్ ర. భ. వేపు చూసి, పక్కకి పిలిచి, "ఆ డీలక్స్ లాడ్జికి తీసికెళ్లు. తర్వాత వొస్తా" అన్నాడు.

నాకా మాటలు చాలా స్పష్టంగా విని పించాయి.

నన్ను వాళ్ళంతగా చావచంపుతున్నా, ఈ మాటలు వినిపించడం విచిత్రంకాదు. కారణం?

ఆ అమ్మాయి - దేశ స్వాతంత్ర్యం కోసం బ్రిటిష్ సింహాన్ని ఎదిరించి, గడగడలాడించి, యూనివర్శిటీ ప్రొఫె సర్‌గా, హైకోర్టు ఎడ్వొకేట్‌గా, గవ ర్నర్‌ని చంపబోయిన వీరకిశోరంగా, గాంధీగారి అహింసా సిద్ధాంతాన్ని ఎది రించి, ఆయన ఆస్తికవాదాన్ని వాదంతో వోడించిన మహా మనిషిగా, చివరికి పట్టుబడి అండమాన్లలో దిక్కులేని చావు చచ్చిన రామలింగేశ్వరరావుగారి పుత్రిక.

ఈనాడు ఈ పాలకుల లోపభూయిష్ట మైన ప్లానులకు బలైపోయిన ఓటు హక్కున్న భారత మహిళ-సులోచన !

అన్నీ మరిచిపోయి అరిచేశాను.

"ఆ అమ్మాయినేం అనకండి ! ఆ అమ్మాయి మహాత్ముని అంశ. కూతురు. వద్దు వద్దు" అని అరిచాను.

అరవగానే అరవై దెబ్బలు పడ్డాయి నా శరీరంమీద.

ఆ అమ్మాయిని డీలక్స్ లాడ్జికి లాక్కు పోగానే నాకు స్పృహ తప్పిపోయింది.

అయిదేళ్ళకోసారి రాంబాబు, ఎంక టేసులుగార్లకి సోదరీమణులయిపోయే మిగతా సోదరీమణుల ఎనాటమీనీ, శరీరాన్నీ మిగతా రక్షక భటులు వంతుల ప్రకారం చూసేసుకుంటున్నారు.

ఈ సోదరీమణులంతా, ఆ రక్షక భటులకు 'తెలిసినవారే!'

చాలాసార్లు ఎఫేస్‌గా చవిచూసిన వాళ్ళే.

అయినా రూల్ రూలేగదా !

భార్యల్ని అనుభవించినట్లే వీళ్ళనీ ఎఫేస్‌గా అనుభవించేస్తారు.

కానీ వాళ్ళ భార్యల్నిమాత్రం పోలీసు స్టేషన్‌కి లాక్కురారు. అనక కోర్టుకి తీసుకుపోరు.

కారణం - వాళ్ళకి పెళ్ళి లైసెన్సు వుంది.

కోర్టులో న్యాయాధికార్లు వాళ్ళకి డబ్బు రూపంలో 'శిక్ష' వేస్తారు.

వాళ్ళల్లో ఎవరైనా 'బాబయ్యా

అదికాదు బాబయ్యా ! మేం ఇలాగ సెయ్యడం-'అని అనబోతే న్యాయాధికారి గారు వినిపించుకోరు.

యంత్రంలా 'అరవై రూపాయలు" అంటారు.

తిరిగి వాళ్ళు నోరు కదిపితే, న్యాయ మూర్తిగారూ నోరే కదిపి 'డెబ్బై' అంటారు.

ఈ ఫైన్ అలా నోటిద్వారా, పాద రసం బరోమీటర్‌లో ఎక్కిపోతున్నట్టు ఎక్కిపోతుంది తప్ప దిగదు.

దీన్నే 'జస్టిస్ ట్రాప్' అన్నాడు వేసీ దయ్యర్.

'ఔదార్యంలేని న్యాయం - షైలాక్ యొక్క న్యాయనిర్ణయం లా అపోయి తుంది' అన్నారు గాంధీజీ.

కానీ గాంధీగారి పటం కోర్టులో వేలాడబడుతున్నా, ఆ 'పటాన్ని' ఉరి తీసేస్తున్నట్టు ఎత్తుగా వేలాడదీస్తారు న్యాయస్థానంలో.

ఈ 'తప్పు' మానవస్త్రీ, మానవ పురుషుడూ 'చేస్తే' - అదే మానవుడి (న్యాయ శాసనం) శిక్షిస్తుంది. మరి జంతువులు యింత విచ్చలవిడిగా తిరుగు తాయే, వాటిని శిక్షించదేం న్యాయ శాసనం ?

న్యాయశాసనం నరుడికే పరిమితం.

అయితే ఒక పెంపుడు కుక్కని, మరో కుక్క కరిస్తే ఆ కుక్కని ఎందుకు శిక్షిస్తుంది మానవ న్యాయశాసనం?

పాము కరిస్తే, మానవ న్యాయం ఆ పాముని చంపేస్తుందెందుకు ?

నోరులేని జంతువుని శిక్షించే అధికారం మానవ న్యాయానికి వుందన్నమాటేగా ?

అటువంటప్పుడు ఇన్ని కోట్ల మాన వుల్ని, నోరులేని జంతువులుగా మార్చి పారేస్తున్న, అదే మహామానవుణ్ణి న్యాయ శాసనం ఎందుకు శిక్షించదు ?

నోరులేకండా, జంతువులుగా మారి పోతున్న మామూలు మనిషి, తప్పుచేస్తే ఈ నోరులేని మానవ జంతువునే శిక్షి స్తుంది గాని, పునాదుల్లో కుళ్ళు పురుగుల్లా సమాజాన్ని ఏకమొత్తంగా నాశనం చేసి పారేస్తున్న మానవ దస్యుల్ని శిక్షించేంత పెద్దశక్తి మానవ న్యాయశాసనానికి లేదా? వుంది !

కానీ,

ఈ న్యాయ శాసనానికీ, న్యాయ ప్రదా నానికీ మధ్య రాంబాబుల, వెంకటేశుల రాజకీయపు ఉచ్చు తాళ్ళున్నాయి.

పోల ట్రిక్కులున్నాయి.

పాల 'కుల' ట్రాన్స్‌ఫిగరేషన్స్ వున్నాయి.

రేపు ఈ సోదరీమణులని కోర్టుకి హాజరుపరిచేవరకూ వీళ్లని ఏంచెయ్యడం? లాకప్‌లో వుంచడమా?

'ఛఛ! అది 'మూర్ఖపు వెధవలు'చేసే పని' అన్చెప్పి, ఒక్క శి.భి.భ. రక్షక భటులు ఇద్దర్నీ ముగ్గుర్నీ మరో చీకటి ట్లోకి లాక్కుపోయారు.

తర్వాత సర్వజంతువిధి నిర్వహణ నిర్విఘ్నంగా కొనసాగించారు.

నన్ను తెల్లార్లూ చేతులు కాళ్లూ కట్టేసి, అలా దూలం హుక్‌కి వేలాడదీశారు.

నా శరీరం యావత్తూ నావశం తప్పి పోయింది. దాహంతో నోరు ఎండి పోయింది.

ఈ మధ్యలో ఒక భక్షక భటుడొచ్చి నా జేబులోవున్న డబ్బంతా లాగేసుకుని, అతని జేబులో కుక్కు కున్నాడు-పక్క




దేశాల మీదికి దండెత్తి, వాళ్ళనివోడించి, వాళ్ళ సర్వస్వాన్ని దోచుకున్న శత్రు సైనికుళ్ళా. నేనేం మాట్లాడలేదు.

ఈ పరిస్థితి మారాలంటే, ఈ యంత్రాంగంలో వుండే లోపాలు కింది నించీ మార్చుకు రావాలి.

ఈ పరిస్థితి యిలాంటిదని ఎవరికి తెలుసు ?

పాలకులు దిగిరారు, తెలుసుకోరు. తెలుసుకోవాల్సిన అవసరమూ లేదు.

'దిగిరండి దిగిరండి' అంటే, వాళ్ళకీ ధృతరాష్ట్రిభువి కనిపించదు. కనిపించినా వినిపించదు. వినిపించినా వినిపించుకోరు.

ఓట్లని అడుక్కొనేందుకు వచ్చే వాళ్ళకు, ఆ ధర్మం చేసే వాళ్ళ స్థితి గతులూ, అస్థిర గతుకులు వాళ్ళెందుకు తెలుసు కుంటారు ? తెలుసుకో వలసిన అవసరం ఏముంది? తెలుసుకున్నా. వీళ్ళు ఆర్చేవాళ్ళా, తీర్చేవాళ్ళా ?

ఆ స్థితి గతులూ, అస్థిర స్థితి గతుకుల్ని...

సులోచన చెప్పగలదు - విశ్లేషణ చేస్తూ.

పోలియో అమ్మాయి చెప్పుకోగలదు-దానికి విశ్లేషణ మనం చేసుకోవాలి.

దేవదాసీ అయిన పుంశ్చలి-పురాతన, ఆధునిక విజ్ఞానాన్ని విశదీకరించగలదు. వీళ్ళతో ఓ కమిటీ ఏర్పాటు చేస్తే-గుడి సెల్లో, కాటేజ్ ఇండస్ట్రీలా గుడిసేటి వ్యాపారం చేసే లక్షలాది 'హీన జంతువులు'-సంపూర్ణంగా బాగుపడతారు.

ఇక హోటల్లో తారసపడిన బ్లూఫిలిమ్ హైట్రోసొసైటీ - వీళ్ళని మార్చ డానికి మనస్తత్వ శాస్త్రం, ముఖ్యంగా 'కాపిటల్' పనికొస్తుంది.

అలానే చెయ్యాలి! ఆవిధంగా చేస్తేనే తప్ప మానవ సమాజం బాగు' పడదు.

ఇదే మానసిక పరిణామం - శిక్షక, భిక్షక, భక్షక భటుల్ని అసలైన రక్షక భటులుగా తీర్చిదిద్దు తుంది !

పోలీస్ స్టేషన్లో తెల్లవారే సరికి తొమ్మి దయింది.

ఇక్కడ తెల్లవారడం, చీకటి పడటం సూర్యుడితో సంబంధం లేదు. నిర్లక్ష్యం, నిర్లిప్తత, అర్థంకాని, అర్థంలేని అధికారం, తామే సర్వశక్తిమంతులమనే అహంకారంతో తెల్లవారు తుంది.

ఇలా 'పోలీసోదయం' కాగానే నన్ను కిందికి దింపారు. కాలకృత్యాదులు తీర్చుకోనిచ్చారు.

తర్వాత మళ్ళీ 'కొట్లో' పడేశారు. ఈసారి ఎందుకో కొట్టలేదు.

సులోచన ఏమయింది ? ఏమయింది? ఏమయింది ? అనే బాధ, భావంతో నా ఆకలి చచ్చిపోయింది.

పోలీస్ స్టేషన్లో కొత్త డ్యూటీ రక్షక భటులొచ్చారు. పాత ఎస్. ఐ. కూడా వచ్చాడు.

బయట ఇంతలో కారొచ్చి ఆగింది. అందులోంచి ఖద్దరు సిల్కు లాల్చీ, గ్లాస్కో పంచ, తలమీద ఖద్దరు టోపీ ఆయన దిగారు.

ఆయన రాజఠీవితో లోపలికి వచ్చాడు. పోలీసులు సెల్యూటులు చేస్తున్నారు. అది అందీ అందుకుంటున్నట్టు అందుకుంటూ ఆ ఖద్దరు శిల్కు, గ్లాస్కొపంచ, ఖద్దరు టోపీ ఆయన లోపలికొచ్చి ఎస్. ఐ ముందు కూచున్నాడు.

కూచోగానే ఎస్సయ్ లేచి సెల్యూట్ చేశాడు.

ప్రతి సెల్యూట్ చేశాను లేవోయ్. సిట్డవున్ అన్నట్టు చేత్తో కూచోమని సంజ్ఞ చేశాడు.

"వాణ్డేం చేశారు?" అన్నారు ఖద్దరు శిల్కు.

"లాకప్‌లో వుంచాం సార్."

"సన్మానం చేశారా ?"

"వూరుకుంటామా సార్ ?"

"ఉన్నాడా ?" అన్నాడు గ్లాస్కో పంచె.

"ఉన్నాడు" అన్నాడు ఖాకీ యూనిఫామ్. అంటే చావకండానే వున్నాడని

ఖద్దరు టోపీ గొణుగుతున్నాడు.

"వాడికెన్ని గుండెలయ్యా ?" అన్నాడు.

"ఒకటే సార్" అన్నాడు ఎస్సయ్, ఆ ఖద్దరు మనిషి మాట పూర్తి కానివ్వకండా.

నేను ఊచల వెనక నిలబడి వింటున్నాను.

"వాడు రాత్రి నా... నా... సుశీల బాయి యింటి కొచ్చి..."

"అందుకే కదా సార్... వాడికి బుద్ధి చెప్పాం." అన్నాడు ఎస్సయ్

"వాడికి ఎన్ని గుండెలుండి నాసుశీల యింటి కొస్తాడూ అంట! వచ్చి దాంతో ఏవేఁమి, మాటాడాడో— ఇంతకాలంనించి పోషిస్తున్న నా మాట కాదని నన్ను రావద్దంటుందా? నేను ఫోన్‌లో మాటాడుతుంటే సగంలో తుంచేస్తుందా ?"

ఎస్సయ్ అన్నాడు గదా "సార్! ఒక వేళ వాడు ఆమెకు తెలిసిన మనిషేమో మీరు మరోలా అనుకోకండి—"

"తెలసినోడూ కాదు, బంధువూ కాదు. దాన్నడిగాను. వాడి మాటలు విగ్యాన దాయకంగా వున్నాయంట. ఏంటి ? ఇన్నేళ్ళనించి దేశసేవలో వున్నవోణ్ణి, నాకంటే ఆ ఎదవ విగ్యానా? నాకున్నంత ఎక్సుపీరియనుసు వుందా ఆ ఎదవకి ?' అని ఖద్దరు వాణికి పోతున్నాడు ఎమోషన్తో

"ఏమో మరి! జవరాంద్ర చిత్తముల్..." అన్నాడు ఎస్సయ్ ఎక్కడో ఎప్పుడో విన్న 'మాట' గుర్తుకు తెచ్చుకుని.

"నిజవేఁ! కాని నా సుశీల అలాంటిది కాదనుకున్నానన్నయ్యా!"

"ఎస్సార్ ! కాకపోవచ్చు. కానీ వీడు ఏదన్నా వశీకరణం జల్లాడేమో !"

"మీ సన్మానాలతో వొదిలిపోయుంటుంది."

"మరి మీకూ దేశభక్తులని మెళ్ళో దండలు వేసి సన్మానాలు చేస్తున్నారు కదా, మీకూ దేశభక్తి జబ్బు వొదిలిపోయిందా సార్ ?"

అని ఎస్సయ్ అన్లేదు.

అనేంత 'విగ్యానం' అతనికుందో లేదో తెలీదు.

ఒకవేళ వున్నా, అంత మాటా అనేస్తే, అతన్ని అడవుల్లోకి—అతనికి దేశభక్తితో వచ్చిన అధికారం - తగలేస్తుందని భయపడి వుండొచ్చు !

అందువల్ల అతనేం అన్లేదు.

అలాఅనకండా "సార్ వాణ్ణిలాకప్‌లో వుంచాను. చూస్తారా ?" అన్నాడు.

"ఆ ఎదవని నేనెందుకు చూడాలి ?" అన్నాడు దేశభక్తుడు.

అతను అయిదేళ్ళకొకసారి మాత్రమే ఒక క్షణం మాత్రమే మనిషిని చూస్తాడు ఆదుకుంటాడు. అది అతని రాజకీయ నీతి ! దాన్ని శంకించరాదు; కూడదు;




కూడరాదు.

"చూడండి సార్ ! తమాషాకి," అన్నాడు ఎస్సయ్.

కాసేపు ఖద్దరుగారు,ఖద్దరు టోపీ తీసి ఖద్దరు బుర్రగోక్కుని, తిరిగి ఖద్దరు టోపీని, ఖద్దరు బుర్రమీద పెట్టుకుని "ఊఁ సరె.. ఎక్కడ వాడు?"

"ఇలా దయ చెయ్యండి సార్."

ఎస్సయ్ ముందు దారి చూపిస్తూ వుండగా, వెనక ఖద్దర్ నాయకుడు-

తేజో విరాజమాన చంద్ర కందర్ప సదృశ రూపరేఖాకళావిలాస భాసురుళ్లా,

అంత్యకాల దహన జ్వాలా ప్రచండుళ్లా,

నీలమేఘ విలసత్కాలాంజన కారుళ్లా,

ఘోర నిశాతోత్కటదంష్ట్రిళ్లా - వచ్చాడు.

కటకటాల వెనక తలొంచుకుని నిలబడి వున్నాను.

"వాడేనండి" ఎస్సయ్ చూపించారు.

ఖద్దర్‌గారు, కళ్ళజోడు సవరించుకుని చూశారు.

"తలెత్తవోయ్" అని గద్దించాడు ఎస్సయ్‌గారు.

తలెత్తాను. కళ్ళు కిందికి దించుకున్నాను.

ఖద్దరుగారికి హ్రస్వ, దీర్ఘ దృష్టులు రెండూ వున్నాయి. నా ముఖం చీకట్లో సరిగ్గా కనిపించ లేనట్టుంది.

"తలెత్తు" అన్నారు.

తలేకాదు కళ్ళుకూడా ఎత్తిచూశాను.

ఆయనా నన్ను చూశాడు.

కళ్ళ జోడు తీసీ చూశాడు.

మళ్ళీ పెట్టుకునీ చూశాడు - గొణుగుతూ, వొణుకుతూ!

"ఎక్కడో చూసినట్టున్నానే!" అన్నాడు,మళ్ళీ గొణుగుతూ వొణుకుతూ!

నాకు ఏమనాలో అర్థం కాలేదు. అతనికి మామూలు దృష్టేలేదు. ఇక దివ్య దృష్టి ఎక్కడ ?

నేను ఖద్దరు వేపు చూడకుండా ఎస్సయ్ వేపు చూశాను.

"మిష్టర్ సబిన్స్‌పెక్టర్! రాత్రి డీలక్స్ లాడ్జికి మీరు తీసికెళ్ళిన సులోచన ఇప్పుడెక్కడుంది?"-అన్నాను-చాలా ధైర్యంగా దర్జాగా, ఠీవిగా జాలిగా,బాధగా!

ఎస్సయ్ కంగారు పడ్డాడు. కోపం కూడా వచ్చింది-నా ప్రశ్నలో ధ్వనించిన అధారిటీకి.

"నీకెందుకురా ! ముందు వారి వేపు చూడూ" అని 'ఎస్సయ్ కోపం' ప్రదర్శించి, చెయ్యెత్తాడు.

"నేను మిమ్మల్నడుగుతున్నాను. ఆమెనేం చేశావ్ ?" అని దాదాపు అరిచాను. నన్ను గుర్తించ గలిగే ఖద్దరు నా ముందు వుందన్న ధైర్యంతో - ఏకవచన సంబోధనలోకి దిగిపోతూ.

"రాస్కెల్! నన్నడుగుతావట్రా?" అని ఊచల మధ్యనించి చెయ్యిచాచి నా జుట్టు పట్టుకున్నాడు.

ఖద్దరుగారు వణికి పోతున్నారు.

ఎస్సయ్ చేతి మీద ఛప్పున బలంకొద్దీ కొట్టి, నా జుట్టుని విడిపించాడు. ఎస్సయ్ ఆశ్చర్యపోయాడో, ఏం పోయాడో తెలీదు.

"కొంప ముంచేశావ్రా ? కొంపలంటుకు పోతున్నాయ్రా" అని పిచ్చిగా అరిచేశాడు ఖద్దర్.

"ఏవంయింది స్సార్?" అని ఎస్సయ్ అడిగే వీలు కలగ నివ్వకండా 'ఖద్దరు'

ఏడుపునీ, భయాన్నీ, వణుకునీ, ఇంకా ఇంకా చాలా చాలా చాలా మానవ బల హీనతల్ని కలిపేసి అరిచేశాడు.

"ఆయన...ఆయన..." ఖద్దరాయన నోరెండి పోతోంది. వాక్యం పూర్తి చేయ లేక పోతున్నాడు.

"సార్! సార్!"

ఎస్సయ్ వొళ్ళు ఎండి పోతోంది.

వొళ్లు వొణికి పోతోంది.

వొళ్లు భయపడి పోతోంది.

"నన్ను కాదురా సార్ అనవలసింది. ఆయన్ని" అని నావేపు చూపిస్తూ ఏడ్చే శాడు "కాదుకాదు! సార్‌కాదు. ఆయన్ని 'సార్' అనకూడదు!'' అని నా వేపు తిరిగి "మహాప్రభో! మన్నించండి మహా ప్రభో! మహాదేవా! మన్నించండి" అని ఊచల అవతలనించే సాష్టాంగపడిపోయి, అందని నా కాళ్ళకి మొక్కేస్తున్నాడు.

ఎస్సయ్ అర్థంగాక పిచ్చాసుపత్రి విశాఖలో వుందా, మద్రాసులో వుందా అని ఆలోచించడం మానేసి ఉరికంబం గురించి ఆలోచిస్తున్నట్టు కొయ్యబారి పోయాడు.

"వారు...వారు...వారెవరు ... ఖ... ఖ...ద్ద...రాంబాబూ ?" అన్నాడు ఎస్సయ్, రాంబాబుని ఏకవచనీయుడుగా మార్చేస్తూ.

"మీ మొగుడు! మన మొగుడు! మనందరికీ మొగుడు!" అని ఏడ్చేస్తు న్నాడు రాంబాబు. తల బాదేసుకుంటు న్నాడు. శోకాలు పెట్టేస్తున్నాడు. మూర్ఛొచ్చినట్టు గింజుకుంటున్నాడు 'ఖద్దరుగారు'.

నేనెవర్నో నాకా క్షణంలో గుర్తు రాలేదు!

సులోచన!

సులోచన!

సులోచన!

ఏవయింది? ఏవయింది? ఏవయింది?

"ఓ గాడ్ దిగిరా! దిగిరా! దిగిరా! దివినించి భువికి. దిగిరా–ఈ ధృతరాష్ట్రి భువికి! నాకు శక్తినివ్వు! శక్తినివ్వు భగవంతుడా శక్తినివ్వు" అని దేవుని ఉనికిని ఇన్నాళ్ళూ గుర్తించని నేను దేవుణ్ణి తలచుకుని ఏడ్చాను.

నా పాలరాతి పాలక భువన భవనంలో కూర్చుని 'ఏడ్చి' 'ఏడ్చి' 'ఏడ్చి' ఆలోచించ లేదు. నా హోదా, అంతస్తు అన్నీ మరచి పోయి, మామూలు మనిషినై పోయి ఆలోచించాను.

దేశంలో మానవ రక్తమాంసాలతో, నడపబడుతున్న భారీ పరిశ్రమ, కాటేజీ ఇండస్ట్రి గురించి-

ఈ జనమధ్యే ఆలోచించాను.

ఆలో-చించాను.

ఆలోచించాను.

కానీ సులోచన తిరిగిరాదు.

ఆమె గురించి కమిషన్‌ని వేయనా?

ఆమెను ఏదో చేసేసినవారిని కాల్చి చంపెయ్యనా?

కాల్చి చంపినా నా చర్యని న్యాయ స్థానం గర్హించలే

దానికంత పెద్దరికంలేదు.

నామీద చర్య చచ్చినా తీసుకోలేదు.

కానీ,

రాలేని లోకాలకి వెళ్ళిపోయిన ఆ అబల

బ్రతకడంకోసం, జీవితాన్ని తాకట్టు పెట్టేసుకున్న త్యాగమూర్తి. నేను నా హోదాతో ఏంచేసినా తిరిగి రాదు!

రాలేదు!





సాహస యాత్రలలో ప్రమాదాలు అడుగడుగునా తొంగి చూస్తూనే ఉంటాయి. సాహసవంతులకి ఈ ప్రమాదాలే ప్రమోదం కల్పిస్తాయి. క్రిందటి సంవత్సరం వేసవిలో, ఇటువంటి నలుగురు సాహస వంతులు, రెండు మోటారు సైకిళ్ళ మీద, లడఖ్‌కి బయలుదేరారు. మర్నాటికి ఈ బృందం జమ్ము - శ్రీనగర్ రోడ్డు మీద ఉన్న కుద్ గ్రామం చేరేసరికి, వాతావరణం చల్లగా ఉండి, అప్పటి వరకూ ఢిల్లీలోని వేడి, దుమ్ము, చెమటలతో విసిగిపోయిన వారి ప్రాణాలకి ఎంతో హాయి కొలిపింది. పత్నీ చేరేసరికి వర్షం కురియ మొదలిడింది. వాన కురుస్తున్నా, వీపులకి కట్టుకొన్న సంచులు జారిపోతున్నా ఆ పరిసరాలు, ప్రకృతి ఎంతో మనోజ్ఞంగా ఉండి ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి.

సాయంత్రం అవుతుండగా ఈ పార్టీ చీనాబ్ తీరానవున్న రాంబాణ్ గ్రామం చేరారు. అక్కడ వెచ్చగానే ఉంది. చీకటిపడ్తుండగా బనిహాల్ గ్రామం చేరేసరికి, అక్కడ కుండపోతగా వర్షం మొదలైంది. చలి వణికించేస్తుంది. జవహర్ టన్నెల్‌కి వెళ్ళే దారిలో వానా, గాలీ కూడా మరీ తీవ్రమయ్యాయి. ఒక మైలు దూరం అలాగే వెళ్ళారు. వాన శబ్దానికి తోడు వారి మోటారు సైకిళ్ళ శబ్దానికి వచ్చే ప్రతి ధ్వని, భయంకరంగా వినిపిస్తోంది. లోయలోకి వచ్చాక విపరీతమైన గాలి వీచ సాగింది. చీకటిలో ఏమీ కనిపించడంలేదు. మధ్య మధ్య మెరుపులు వచ్చినపుడు మాత్రం

చీనార్, పాప్లార్ వృక్షాలు కనిపిస్తు న్నాయి. పూర్తిగా తడిసి ముద్దయి పోవడంతో వారు గజ గజ వణికి పోతున్నారు.

శ్రీనగర్ చేరేసరికి అర్ధరాత్రి అయింది. ఒకరికి శీలమండకి దెబ్బ తగిలింది. నలుగురికీ జలుబు చేసి తెగ బాధ పెట్టింది. బాగా అలసిపోయా రేమో అదమరచి నిద్రపోయారు.

మర్నాడు గమ్యస్థానమైన లడఖ్ కి ప్రయాణం. వాతావరణం నిర్మలంగా ఉంది. డాల్ సరస్సునీ, మొఘుల్ గార్డెన్స్‌నీ దాటి, సింధు నది మీదుగా ప్రయాణం ఎంతో ఉల్లాసకరంగా ఉంది. కాన్‌గాం దాటిన తర్వాత మాత్రం దారి దారుణంగా ఉంది. సోనా మార్గ్ సౌందర్యం వర్ణనాతీతంగా వుంది. అక్కడ నుంచి ప్రయాణాన్ని ఎంత త్వరగా చేద్దామన్నా వాటికి మనసొప్ప లేదు. ప్రకృతి సౌందర్యం వారిని ఆకట్టుకుని, తడవ తడవకూ ఆగుతూ ఫొటోలమీద ఫొటోలు తీసేటట్లుచేసింది. ఆ తన్మయత్వంలో వారు ప్రయాణపు అలసటను కూడా మర్చిపోయారు. పది కిలోమీటర్లు వెళ్ళాక సుప్రసిద్ధమయిన జోజిలా క్లైంబ్ వచ్చింది. ఆ కొండ మార్గం మీద ప్రయాణం చేయడానికి, వారి శక్తివంతమైన మోటార్ సైకిళ్ళు మొరాయించసాగాయి. వాటి బాధ చూడలేక, కాసేపు వాటికి విశ్రాంతి ఇచ్చి, తామూ విశ్రాంతి తీసుకొంటూ పరిసర సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ, నెమ్మదిగా ప్రయాణం సాగించారు. పోను పోనూ అందమైన పచ్చని బయళ్లు కనుమరుగై బోడి కొండల మీద మంచు ముద్దలు దర్శనమిచ్చాయి.

ఉన్నట్లుండి వెనకాల నుంచి వేగంగా వస్తున్న ట్రక్కుల మోత వినిపించింది. వాటి కంటె ముందుపోవాలనే ఉత్సాహంతో, నలుగురూ మోటారు సైకిళ్ళ వేగాన్ని హెచ్చించారు. అయితే ఈ యాత్రికుల ఉత్సాహాన్ని తట్టుకోలేని ఎనిమిదేళ్ళ సర్వీసున్న ఒకరి మోటారు సైకిలు, మరీ వేడెక్కిపోయి, ముందుకి కదలనని భీష్మించింది. దానితో కుస్తీ పట్టేలోగా వెనకాల నుంచి, సైనిక శక టాలు వేగంగా వచ్చి వారిని దాటి పోయాయి. మొరాయించిన మోటారు సైకిలుని శాంత పరచి, కొంచెం ముందుకి సాగేసరికి ఓమోటార్ సైకిల్ కి క్లచ్ బ్రేక్ పాడయిపోయి, మళ్ళీ ఆగాల్సి వచ్చింది. ఇదీ మంచికే అయింది. మిలి టరీ ట్రక్కుల శబ్దానికి కొండమీదున్న పెద్దమంచుగడ్డ ఒకటి జారి,దొర్లుకుంటూ వచ్చి వారిముందే పడింది. అదే వారి మీద పడిఉంటే! ఊహించుకుంటేనే వళ్లు గగుర్పొడుస్తుంది.

జోజిలా సముద్రమట్టానికి 11,200 అడుగుల ఎత్తున ఉంది. ఇక్కడ 1948 లో పాకిస్థాన్‌లో భీకరమైన టాంకుల యుద్ధం జరిగింది. ఈ రోడ్డు చలి కాలంలో మంచుతో మూసుకుని పోయి ఉంటుంది. వేసవి రావడంతో, కొద్ది రోజుల క్రితమే ఆదారిని రాకపోకలకి తెరిచారు. కాని రోడ్డంతా రాళ్ళతోనూ, నీటి గుంటలతోనూ, చిన్న చిన్న వాగు లతోనూ నిండిఉంది. అటువంటి దారిలో మోటార్ సైకిళ్లను నడుపుకొంటూ, మధ్య మధ్య లాక్కుంటూ, తోసుకుంటూ ప్రయాణం సాగిస్తున్నారు ఆ నలుగురూ.

ఈ ప్రయాణం అలసట కల్పిస్తుంటే, ...హ రాన్ని ప్రవహిస్తోన్న, సింధునది యొక్క రెండు ఉపనదుల దృశ్యం, మన ...కి ఉల్లాసం కల్గిస్తోంది. చుట్టూ ఎటు ...సినా మంచూ, మంచూ గడ్డలూనూ. ...టితో కొట్టుకొచ్చిన దొర్లిపడిన మంచు ...ండలు, వాగులకి అడ్డంపడి వంతెనల ...గా ఉన్నాయి. ఆ దుర్గమమైన ...రిలో, కేవలం 14 కిలోమీటర్ల ప్రయా...ం చేయడానికి మూడు గంటలు ...ట్టింది.

సూర్యాస్తమయం కావస్తోంది. మిని ...ర్గ్ వైపు ప్రయాణం సాగుతోంది. ...ళ్ళీ పచ్చని భీళ్ళు కన్నుల పండువు ...స్తున్నాయి. లోయ అయితే విశాలంగానే ...ంది కాని, పోనుపోను ఇరుకైపోయింది. ...ంధునదికి ఉపనది అయిన ద్రాస్ ...క్కడే ఉంది. ఈ ప్రాంతం ప్రపం...ంలోనే మానవ నివాసం ఉన్న అతి ...తలమైన వాటిలో రెండవదట. పదివేల ...డుగుల ఎత్తున ఉన్న ఈ ప్రాంతంలో ...టు చూసినా, వర్ణనాతీతమైన సౌంద...ర్యంతో, కొండల్ని కప్పి రకరకాల ...కారాలలో, స్వచ్ఛమైన మంచు దర్శన...స్తుంది. ఆ మార్గంలో, టీ స్టాల్ కని...ంచడం, ఎడార్లలో ఒయాసిస్సులంత ...రుదుగా ఉంటుంది. అక్కడ జన...సాలే తక్కువ. అటువంటి చోట ఒక ... స్టాల్ దర్శనమిచ్చేసరికి ప్రాణం లేచి ...చ్చింది. అక్కడ కాసేపు ఆగి, టీ ...వించారు ఆ నలుగురూ. ద్రాస్ దాట...నే అమిత సౌందర్యంతో విలసిల్లే ...తీస్‌గ్రాం' గ్రామం దర్శన మిచ్చింది. ...క్కడనుంచే ద్రాస్‌నది విపరీతమైన వేగంలో ఉరకలువేస్తూ, భయం కల్పి స్తూంటుంది. అక్కడ నుంచి ప్రయాణం రెండు కొండల మధ్యన చాలా ఇరుకుగా ఉన్న దారిగుండా సాగింది. మధ్యాసియా జాతి లక్షణాలుకల ప్రజలున్న ఈ ప్రాంతం లడఖ్‌లోని మహమ్మదీయులు నివసించే ప్రాంతం. లేతవెన్నెలలో ప్రయాణం. కార్గిల్ వరకూ వున్న 60 కిలోమీటర్ల దూరంలోనూ కాస్త పచ్చగా ఉన్న ప్రాంతం కేవలం మూడు చోట్లే కనిపించింది. మిగిలినదంతా కొండలూ,బండలూమంచూనూ.కొంతదూరం పోయాక పాకిస్తాన్ వైపునుంచి వచ్చే షిగార్‌నది, ద్రాస్‌నదితో సంగమించడం కనిపిస్తుంది. మూడు దశాబ్దాల క్రితం ఇదంతా భారతీయులందరూ స్వేచ్ఛగా తిరుగాడ గలిగిన ప్రాంతం. కానీ దేశ విభజనతో ఈ నదులు ఇండియా, పాకిస్థాన్‌ల మధ్య సరుహద్దులుగా మారిపోయాయి. అటు తర్వాత ఒక పెద్ద సరస్సు వచ్చింది. దానిని అంటివెళ్తే టిబెట్‌లోకి వెళ్ళుంది. ఆ నలుగురికీ దానినంటి టిబెట్‌లోకి వెళ్ళివస్తే బావుంటుందని కోరిక పుట్టింది. కానీ చైనా అధీనంలో ఉన్న ఆ ప్రాంతంలో అడుగు పెట్టే, ఆపదలను కొనితెచ్చి పెట్టుకోవటమేనన్న విషయం జ్ఞాపకానికి వచ్చి ఊరుకున్నారు.

కార్గిల్ కూడా చాలా సుందరమైన ప్రాంతం. పైగా ఇక్కడ నేల చాలా సారవంతమైనది. సురు,వఖన్‌నదుల సంగమం దగ్గర ఉన్న ఈప్రాంతం, విల్లో పాప్లార్ చెట్లతో ఎంతో మనోజ్ఞంగా ఉంటుంది. ఆ రాత్రికి కార్గిల్‌లో విశ్రాంతి తీసుకుని మర్నాడు ఉదయమే తిరిగి, తమ యాత్ర మొదలెట్టారు. పోనుపోనూ చెట్లు




కనుమరుగై, అంతా బోడికొండలమయం కాసాగింది. ఎక్కడో ఓ చోట మాత్రం కాస్తంత పచ్చని నేల, విల్లో, పాప్లార్ చెట్ల మధ్య కనిపించేది. చలి అయితే చాలా తీవ్రంగా ఉంది. మరికొంత దూరం పోయేసరికి మోటారు సైకిళ్ళు కాస్తా బురదలో కూరుకు పోయాయి. అక్కడ రోడ్డుక్కి అడ్డంగా ఒకవాగు ప్రవహిస్తుంటుంది. దాంట్లో నీరు ఇంకి పోయి గుండెలోతున బురదగా మారి పోయింది ఆ వాగు. అదృష్టవశాత్తూ అక్కడికి దగ్గర్లోనే ఒక చిన్న గ్రామం ఉండడం, ఆ గ్రామస్థులు వచ్చి, సహాయం చేసి మోటారు సైకిళ్ళని బయటకి లాగడంతో ప్రాణాలు దక్కాయి.

సుందరమైన లూసన్ గ్రామందాటి, ఇరుకైన కనుమ గుండా ప్రయాణం చేశాక విశాలమైనలోయ వచ్చింది. ఈ ముల్ బేఖ్ లోయలోనే తొలిసారిగా లడఖ్‌లోని బౌద్ధ ప్రాంతం గోచరమయింది. ఇక్కడ ఒక దుర్గమమైన కొండ శిఖరంమీద, ఒక ప్రత్యేకమైన బౌద్ధారామం ఉంది. దీనివెనకనే సాహస వీరుడు జోరావర్ సింగ్ నిర్మించినకోటలు ఉన్నాయి. ఈయన నిటారుగా వుండే కొండ శిఖరాల మీద కోటలు నిర్మించడంలో అద్వితీయుడు. పైగా వాటిని, పరిసరాల్లోని కొండల్లో కలిసిపోయి,అవి స్వాభావికమైనవే అనిపించేటట్లు నిర్మించేవాడు. ఇక్కడే తొలిసారిగా, టిబెట్ దేశానికి ప్రత్యేకమైన, వాలుగోడల ఇళ్ళు కనిపిస్తాయి.

ముల్‌బేఖ్ అయిన తర్వాత, ఎటు చూసినా, గోధుమ వర్ణంతో ఉండే రాతి నేల, కొండలు కనిపిస్తాయే కాని,కాస్తంత పచ్చిక కూడా కనిపించదు. ఆ తర్వాత 12,300 అడుగుల ఎత్తున ఉన్న కనుమ గుండాపోతే నమిక్‌లా వస్తుంది. ఈ కనుమకి ఇరు ప్రక్కలా ఉన్న కొండల అందం వర్ణనాతీతంగా ఉంటుంది. నమిక్‌లాలో కొట్టవచ్చినట్లు కనిపించేది, ఆకాశం వైపు వ్రేలు చూపుతున్నట్లుగా ఉండేకొండ. ఈ ఆకారంవల్లనే నమిక్‌లా అనే పేరు వచ్చింది. ఆ తర్వాత కొంత దూరం దిగాక బోద్ ఖర్బూ వస్తుంది.



ఇక్కడ చలి, ద్రాస్ ప్రాంతంలో కంటే కూడా ఎక్కువగా ఉంటుందిట. ఆ తర్వాత దారి మళ్ళీ ఎత్తుగా పోతుంది. ఫోటూలా, శ్రీనగర్-లే(లడఖ్ ముఖ్యపట్నం) రోడ్డు మీద, అత్యధిక ఎత్తున (13,500 అడుగులు) ఉంది. ఇక్కడనుంచి కారకోరమ్ పర్వతాలలోని సియాచెన్, ముజ్‌తాగ్ కొండలు ఎంతో సుందరంగా కనిపిస్తుంటాయి. అక్కడనుంచి జలేబీ కొండల మీదుగా, నాలుగు వేల అడుగులుదిగాక, ఖల్సీ, సింధునదులు వస్తాయి. లే చేరే వరకూ వీటివెంబడే ప్రయాణం సాగుతుంది. ఈ మార్గంలో ఉన్న లమయూరులో ప్రాచీన బౌద్ధారామాలు చాలా ఉన్నాయి. అభేద్యమైన ఈ మంచు కొండలలోని గుహలలో ఎందరో బౌద్ధ సన్యాసులు ఉన్నారట. ఖల్సీ తర్వాత సస్‌పూల్ వస్తుంది. ఆ తర్వాత సింధు నది మీద ఒక విచిత్రమైన, పురాతన వంతెన మీదుగా ప్రయాణంచేస్తే ప్రఖ్యాత ప్రదేశం అల్చిగొంప వస్తుంది. అక్కడ నుంచి నిమ్ములోయ దాకా, భీతి గొలిపే విశాలమైన ఎడారి వంటి ప్రాంతం వస్తుంది. నిమ్ము దాటిన తర్వాత రెండు పెద్దనదులు జమ్‌స్కార్ - సింధునదుల సంగమం వస్తుంది. లేకి వెళ్ళేదారిలో కొండపై నుంచి కనిపించే ఈ దృశ్యం ఎంతో మనోజ్ఞంగా ఉంటుంది. సగటున 30 కిలో మీటర్ల దూరంలో ఉండే గ్రామాలు లేపట్నాన్ని సమీపిస్తున్న కొద్దీ మరీ దూరదూరంగా ఉంటాయి. ఇక్కడి ప్రాంతం ఎడారిలాగా అనిపిస్తూంటుంది. ఎంతో దూరాన ఉన్నవి కూడా దగ్గరే ఉన్నట్లనిపిస్తాయి. తీరా వెళ్ళాక కాని అసలు దూరం తెలియదు. 20 కిలోమీటర్ల దూరాన ఉన్న 'లే' పట్నం, ఐదు కిలోమీటర్లే వున్నట్లనిపిస్తుంది. సాయంత్రానికి ఆ నలుగురూ 'లే' పట్నం జేరుకొన్నారు. మర్నాడు విశ్రాంతి, లేలోని సుందర ప్రదేశాలకి యాత్ర, మోటారు సైకిళ్ళని సర్వీసింగ్ చేయించుకోడంతో సరిపోయింది. ఈ చోటికి వచ్చే విదేశీ పర్యాటకుల సంఖ్య నానాటికీ పెరుగుతుండడంతో 'లే'లో వ్యాపార సరళిలో దుకాణాలు, హోటళ్లు, బార్‌లు వెలిశాయి. కానీ ఊరు మాత్రం పాత రూపంలోనే ఉంది. అభివృద్ధి విషయంలో ఈ ప్రాంతం చాలా వెనుకబడి ఉంది. జిల్లా కలెక్టర్ ఆఫీసు దగ్గర తప్ప ఊరిలో ఇంకెక్కడా వీధి దీపాలు కూడా లేవు. ఇంక 'లే' పట్నం వదిలి మిగిలిన ప్రాంత ప్రజల విషయంచూస్తే, నూరు సంవత్సరాల క్రితం వారి పరిస్థితి ఎలా ఉండేదో, ఇప్పటికీ అలాగే ఉంది.

17,579 అడుగుల ఎత్తున ఉన్న ఖాంగ్‌లాల్ తర్వాత వెళ్ళాలంటే అధికారుల అనుమతి కావాలి కష్టం మీద, మోటార్ సైకిళ్ళు లేకుండా, ఆ ప్రాంతానికి వెళ్ళడానికి అనుమతి దొరికింది. కాని దేవుడు వరమిచ్చినా, పూజారి అడ్డుపడ్డట్లు, సైనిక అధికారులు ఇందుకు అడ్డుపడ్డారు. అంతటితో ఆ ప్రయత్నం ఆపుకోవలసి వచ్చింది. దీనికి బదులు 18,400 అడుగుల ఎత్తున ఉన్న ఖర్దుంగ్‌లాకి మోటారు సైకిళ్ళపై వెళ్ళడానికి ఒప్పుకున్నారు. కాని 16,000 అడుగుల ఎత్తు వెళ్ళేసరికే చీకటి పడిపోడంతో, నిరుత్సాహంతో తిరిగి రావలసి వచ్చింది.

ఇంక ఆ యాత్రలో, అతి ఎత్తున ఉన్న ప్రాంతమయిన చుషూల్ కి






ప్రయాణం మొదలైంది. ఆ రోజు జూన్ 6వ తారీఖు. ఆ ప్రాంతాన్ని అంతకు ముందు చూసిన వారు, ఆ నలుగురిలో ఉండడంవల్ల ఎన్నో మనోహరదృశ్యాలు చూడడం పడింది. జింగ్రాల్ చేరుకొనే సరికి, అక్కడఉన్న ఒక ఆర్మీ రిలీఫ్‌కాంప్ వారు, ఛాంగ్‌లా ప్రాంతం అంతా దట్టమైన మంచుతో ఉందని హెచ్చరిక చేశారు. అక్కడికి పోవడానికి అనుమతి సంపాదించి చాంగ్‌లా చేరేసరికి, ఎటు చూసినా మంచే. సల్త్రాక్ సరస్సు కూడా పూర్తిగా మంచుతో కప్పబడిపోయింది. అప్పటి ఈ పార్టీ వారు హిమాలయాల్ని దాటి, కారకురం కొండల్ని చేరారు. షోక్ నది, అక్కడి నుంచి కేవలం 15 కిలోమీటర్ల దూరంలో ఉంది. దర్బగ్ దాటిన తర్వాత, తాంక్సే వచ్చింది. ఇక్కడ 10వ శతాబ్దానికి చెందిన సిరియక్ క్రైస్తవ అవశేషాలున్నాయిట. ఇక్కడ నుంచి పరిసరాలన్నీ టిబెట్ సంస్కృతిని ప్రదర్శిస్తూ ఉంటాయి.

తాంగ్సే నుంచి, పాంగజాంగ్‌సో మీదుగా లుకుంగ్ చేరారు. ఈ పాంగ జాంగ్‌సో, ఒకప్పుడు నేల కనిపించనంతటి విశాలమయిన మంచి నీటి సరస్సుట. ఈ సరస్సులో మూడవ వంతు భాగమే, భారత దేశంలో ఉంది. మిగిలినది చైనాలో ఉంది. ఉషోదయ సమయంలోనూ, సంధ్యా సమయంలోనూ ఈ సరస్సు వద్ద దృశ్యం అత్యంత మనోజ్ఞంగా ఉంటుంది. సాయం సమయంలో ఆ ప్రాంతం నుంచి తిరిగి ప్రయాణం సాగింది.

లుకుంగ్ నుంచి ఖుసూల్‌కి 70 కిలోమీటర్లు. ఇందులో 45 కిలోమీటర్లు పాంగ్‌జాంగ్‌సో వెంబడే ఉంది. దారి పొడవునా ఎన్నో అందమైన దృశ్యాలు ఫొటోలు తీయించేటట్లుగా ఉంటాయి. ఎన్నితీసినా తనివి తీరదు. 13000 అడుగుల ఎత్తున ఉన్న ఈ సరస్సు ఒక చిన్న సముద్రంలాగా ఉంటుంది. ఒకప్పుడు మంచినీటిసరస్సైన ఇది, ఈనాడు ఉప్పునీటితో నిండిపోయింది. ఇందుకు కారణం, చుట్టుప్రక్కల కొండలనుంచి ఎన్నోవాగులు వచ్చి ఇందులో కలియడం. ఇంత గంభీరంగా ఉండే ఈ సరస్సు, శీతాకాలంలో చాలా

మందంగా గడ్డ కట్టేస్తుంది. ఈ సరస్సుకి నైరుతీ దిశన 'పాంగ్ జాంగ్ సో' పర్వతాలున్నాయి. వీటిల్లో అతి పెద్ద శిఖరం ఎత్తు 22,060 అడుగులు. 1972లో చైనీయులు ఈ సరస్సు మీదుగా నౌకలలో వచ్చి, మాన్, మెరక్, కక్ స్టైలో గ్రామాలలో భారతదేశానికి వ్యతిరేక ప్రచారమున్న కరపత్రాలు పంచిపెట్టారుట. తమాషా ఏమిటంటే, ఈ గ్రామస్తులెవ్వరికీ చదవడం రాదు. మరి ఏ ప్రయోజనాన్ని ఆశించి చైనావారు ఈ పని చేశారో !

సరస్సు దాటాక ఒక కనుమ. అది దాటి గోమ్‌కొండని చుట్టి వెళ్తే ఖుసూల్ వస్తుంది. 14,230 అడుగుల ఎత్తున ఉన్న ఈ పీఠభూమి నుంచే చైనా మొదలవుతుంది. ఇక్కడి వాతావరణం ఎంత స్వచ్ఛంగా ఉంటుందంటే, ఎంతో దూరాన ఉన్నవి కూడా, ఎంతో స్పష్టంగా కనిపిస్తాయి. ఇక్కడ ఉన్న చిన్న విమానాశ్రమం మీద, భారత చైనా యుద్ధ సమయంలో, చైనావారు బాంబులు కురిపించారుట. ఇక్కడినుంచి దూరాన, 16,800 అడుగుల యెత్తున ఉన్న 'సేక్‌లా' కనిపిస్తూంటుంది. టిబెట్‌లోని ఈ భూభాగాలన్నీ చైనా ఆక్రమణలోకి వెళ్లిపోయాక, అంతుకుముందు స్వేచ్ఛగా సాగుతుండిన రాకపోకలు ఆగిపోయాయి.

మర్నాడు ఏడవ తారీఖు 20,000 అడుగుల ఎత్తును ఒక శిఖరాన్ని అధిరోహించాలని, సంకల్పించారు ఈ సాహస యాత్రీకులు. కాని వారి దగ్గరున్న మ్యాప్‌లో, ఈ శిఖరానికి వెళ్ళేదారి స్పష్టంగా లేనందువల్ల, ఆ ప్రయత్నం మాని, దాని దిగువనున్న, 18,980 అడుగుల ఎత్తునున్న మరో శిఖరం ఎక్కాలని సంకల్పించారు. మర్నాటి ఉదయమే ఇద్దరు స్థానికులని సహాయంగా తీసుకుని, వారు పర్వతారోహణకి బయలుదేరారు. తమగమ్యం తెలియక వాళ్ళు, వారిని, అతిదగ్గర, అతి నిటారుగా ఉన్నదారి వెంబడి తీసుకు వెళ్ళారు. గంటల కొద్దీ ఎక్కడం సాగుతూనే ఉంది. ఊపిరాడనంతగా అలసట కలిగినప్పుడు మాత్రమే వారు కొద్దిగా విశ్రాంతి తీసుకున్నారు. ఆ తర్వాత, ఎవరి శక్తి ప్రకారం, వాళ్ళు ఎక్కడం మొదలెట్టారు. వారిని దారిలో వదిలిపెట్టి, స్థానిక సహాయకులు వారిదారిన వారు వెళ్ళిపోయారు. శిఖరం జేరడానికి మరో గంట ఉందనగా, తీవ్రమైన మంచు తుఫాన్ వచ్చింది. మంచు ముద్దలు వేగంగావచ్చి, వాళ్ళకి గట్టిగా తగల సాగాయి. అది తగ్గాక ఎలాగైతేనేం వారు శిఖరం చేరగలిగారు.

శిఖరం మీద అరగంటసేపు గడిపిన తర్వాత మంచు, తుఫాను పూర్తిగా తగ్గి తెల్లని మబ్బులు, మెల్లగ విచ్చుకోడం ప్రారంభించాయి. బ్రహ్మాండమైన వెండి తెర వలె ఉన్న ఆ మబ్బు విచ్చుకున్నాక, పాంగ్ జాంగ్ సో సరస్సు మళ్ళీ దర్శన మిచ్చింది. మరి కొంచెం సేపటికి, మబ్బులు పూర్తిగా విచ్చుకున్నాక, టిబెట్‌లోని స్పాన్‌గూర్ సో సరస్సు కూడా ఎంతో మనోజ్ఞంగా కనిపించింది. రెండు పాయలుగా చీలిన ఈ సరస్సు చుట్టూ, పసుపు,గోధుమ వర్ణం, నీలి రంగుల కొండలు ఉన్నాయి. ఈ కొండల శిఖరాళ్ళు, మేఘాలతో తేలి

యాడుతున్నాయి. ఆ యాత్రీకులు చూసిన దృశ్యాలన్నింటిలోకీ ఇది అత్యంత మనోజ్ఞంగా ఉంది. ఈదృశ్యపు నేపథ్యంలో వాద్య గోష్టితో, నృత్యం జరుగుతుంటే ఎంత అద్భుతంగా ఉంటుంది! ఇటువంటి దృశ్యాన్ని చూసేనేమో, మిల్టన్ కవి తన 'పారడయిజ్ రిగెయిన్డ్' కావ్యాన్ని వ్రాసింది! అని హించింది.

దిగుడు ప్రయాణం, శిబిరం దిగువనున్న ఒక కనుమ దాకా, ఏ అడ్డంకి లేకుండా జరిగిపోయింది. ఈ లోగా ఇద్దరు లదఖీ సహాయకులు తిరిగి కలుసుకున్నారు. కనుమని చేరేసరికి, తిరిగి మరో పెద్ద తుఫాను వచ్చింది. అంతటి అల్లకల్లోలంలోనూ, వాళ్ళు వారికి ఏదో సిరప్ని, టీని కాచి ఇచ్చారు. దాంతో పుంజుకుని ఎల్లాగైతేనేం ఖుసూల్ జేరుకున్నారు. నఖ శిఖ పర్యంతం-మంచు, మంచు ముక్కలతో నిండి, తెల్ల భూతాలలాగా తయారయ్యారు.

10వ తారీఖు ప్రొద్దున్నే 'లే'కి తిరుగు ప్రయాణం. ఆకాశం స్వచ్ఛంగా ఉంది. వాగులు మాత్రం గడ్డకట్టుకుపోయి ఉన్నాయి. లుకుంగ్ని చేరేసరికి, మబ్బులు 19,999 అడుగులు ఎత్తున్న ఒక శిఖరాన్ని తప్ప అన్నిటినీ కప్పివేశాయి. ముగ్లిప్ దగ్గర చిత్తడి నేలల్లో అరుదుగా కనిపించే నల్లని వలయాలు ఉండే బాతులు కనిపించాయి. తారక్సే జేరేసరికి, చాంగ్లా వద్ద నాలుగడుగుల ఎత్తున మంచు కురిసిందనీ అందువల్ల ఆ రోజుకి దారిని మూసేశారని తెలిసింది. మర్నాడు అతి ప్రయాసతో, ఏదో వాహనం ఎక్కి ఛాంగ్లాని దాటారు. ఆ తర్వాత మోటారు సైకిళ్ల ఎక్కి తిరుగు ప్రయాణం. అయితే వచ్చేటప్పుడు కంటే, వెళ్ళేటప్పుడు, వాన, మంచువాన, హిమపాతం వంటి వాటి వల్ల, రెట్టింపు సమయం పడుతూవచ్చింది. జోజిలా దగ్గర 70 మంది వున్న మిలిటరీ శకటాన్ని ఓవర్ టేక్ చేసే ప్రయత్నంలో ఈ యాత్రికులల్లో ఒకరి మోటార్ సైకిల్ చెడిపోయింది. మిలిటరీ వాళ్లు నవ్వుకుంటూ సాగిపోతే వీళ్లు ఉసూరు మంటూ ఉండిపోయారు.

ఆరు రోజుల తర్వాత, 'అపర స్వర్గానికి యాత్ర' ముగించుకొని, తిరిగి దుమ్ము, వేడి, చెమట ఉన్న ఢిల్లీ నగరాన్ని జేరుకున్నారు సాహస యాత్రికులు.

—కె.ఆర్. కె. మోహన్



చతుర కథలు

# పుట్టినరోజు

ప్రొద్దున ఎనిమిది గంటలయింది. పబ్లిక్ గార్డెన్స్ బస్‌స్టాప్‌వద్ద నిలబడ్డాను.

"సార్... బూట్ పాలిష్" అంటూ వచ్చాడో పధ్నాలుగేళ్ళ కుర్రాడు.

"వద్దులే" అన్నాను విసుగ్గా.

"సార్... మీ బూట్లకి పాలిష్ చేసినందుకు పైసాకూడా ఇయ్యొద్దు సార్" అంటూ పాలిష్ పెట్టె కిందకి దింపాడు.

ఆశ్చర్యంతో నా చెవులను నేనే నమ్మలేకపోయాను.

"ఆశ్చర్యపడకండి సార్. ఈరోజు నా పుట్టినరోజు. ప్రతి పుట్టినరోజుకీ మొదటచేసిన పాలిష్‌కి నేను డబ్బు పుచ్చుకోను. ఆ మహారాజులు ఇచ్చే దీవెనలవల్ల ఆ ఏడాదంతా మంచి గిరాకీ తగుల్తుంటుంది" అన్నాడు చిరునవ్వుతో.

"బాగుంది నీ నియమం. చేసేది పాలిష్, జరుపుకునేది పుట్టినరోజు పండుగలూనా?" అన్నాను.

"అలా అనకండి సార్. ఒకప్పుడు మాదీ పెద్దగా కలిగిన కుటుంబమే. కాలం కలిసిరాక ఈ స్థితికి వచ్చాం."

వాడి మాటలతీరు చూస్తుంటే నిజంగానే వాడు బతికి చెడ్డ కుటుంబంలోంచి వచ్చినవాడనే అనిపించి జాలివేసింది.

వాడు పాలిష్ చేయడం పూర్తిచేసి, "సార్...వెళ్ళొస్తాను. పెద్దలు మీరు మనస్ఫూర్తిగా నన్ను దీవించండి" అన్నాడు.

వాడి వినయానికి నేను పరవశించిపోయాను. "కష్టపడి వృద్ధిలోకిరా" అని మనస్ఫూర్తిగా దీవించాను. జేబులోంచి రూపాయి నోటు తీసి - "నీ పుట్టినరోజు అన్నావుగా దీనితో మిఠాయి కొనుక్కో" అని ఇచ్చాను.

'వద్దుసార్' అని వాడన్నా, బలవంత పెట్టి ఇచ్చాను. వాడు నమస్కారం చేసి, పెట్టె భుజానికి వేసుకుని వెళ్ళిపోయాడు.

'ఇటువంటివాళ్ళలో కూడా ఎంతటి సంస్కారవంతులు ఉంటారు!'

నెలరోజులు గడిచాక, ఓ రోజున సికింద్రాబాద్ స్టేషన్‌కి పనిమీద వెళ్ళి, బస్‌స్టాప్‌వద్ద నుంచున్నాను. అదికూడా ప్రొద్దుటి సమయమే. అనుకోకుండా అక్కడ ఆనాటి బూట్‌పాలిష్ కుర్రవాడు, ఎవరికో పాలిష్ చేస్తూ కనిపించాడు. అప్రయత్నంగా వాడి సమీపానికి వెళ్ళాను.



వాడు పాలిష్ చేయడం పూర్తిచేస్తే, "సార్...వెళ్ళొస్తాను. మనస్ఫూర్తిగా దీవించండి సార్. మీరిచ్చే పుట్టినరోజు దీవెనలే నాకు జయం సార్" అన్నాడు.

ఆ మాటలు వింటూనే కొయ్యబారిపోయాను.

— మోహన్

# పూలచెండు

సుధ తన బోయ్ ఫ్రెండ్ ప్రకాష్‌ను కలుసుకొని "రేపు నా బర్త్ డే! నీవు సాయంత్రం అయిదింటికల్లా ఫంక్షన్‌కి తప్పక రావాలి మర్చిపోవుగా !" అంది.

"మర్చిపోవడమే: వచ్చేటప్పుడు నీకో మంచి కానుక కూడా తెస్తాను ... అది ఏమిటో చెప్పుకో !" అన్నాడు ప్రకాష్.

"ఊహూ! నీవే చెప్పు!" అంది సుధ.

"రేపటికి నీకు ఎన్నో సంవత్సరం వస్తుందో అన్ని గులాబీ పూలతో పుష్ప గుచ్ఛం తయారుచేయించి నీకు కానుకగా ఇస్తాను...ఎలా ఉంది మన ఐడియా ?" అన్నాడు ప్రకాష్ గర్వంగా చూస్తూ.

"చాలా బాగుంది. ఇది నిజంగా కొత్త రకం కానుకే" అంది సుధ.

తన ఇంటి దగ్గరే ఉన్న ఒక పూల కొట్టులో ఇరవై రెండు గులాబీలతో అందమైన చెండును తయారుచేసి రెడీగా ఉంచమని ఆర్డరిచ్చేడు ప్రకాష్.

కుర్రాడు చెండు కడుతుండగా ఆ కొట్టు యజమాని వచ్చి "అబ్బాయ్! ఆయన మనకి బాగా తెలిసినాయన. అప్పుడప్పుడూ పూలు పట్టుకెళుతుంటాడు. ఓ అయిదారు పూలు ఎక్కువేసి చెండు బాగా కట్టు" అన్నాడు. కుర్రాడు అలాగే చేశాడు.

రెండో రోజు సాయంత్రం ప్రకాష్‌కి అనుకోకుండా అర్జెంటు పనొకటి తగిలింది. టిప్ టాప్‌గా తయారైపూలచెండుని ఎంతో నాజూగ్గా పట్టుకొని వెళ్ళి ప్రేమ ఒలకపోస్తూ సుధకి అందించి, తన అర్జెంటు పని విషయం చెప్పి గబ గబా వెళ్ళిపోయాడు ప్రకాష్.

ప్రకాష్ తీసుకురాబోయే కానుక గురించి విశేషంగా తన స్నేహితురాళ్లతో చెప్పిన సుధ ఆ చెండు నుండి ఒక్కొక్క గులాబీ తీసి పళ్ళెంలో వేస్తూ గట్టిగా లెక్క పెడుతుంది. స్నేహితురాళ్ళు ఆమెతో శృతి కలిపారు. లెక్క పెట్టటం పూర్తవగానే స్నేహితురాళ్ళు ఘొల్లున నవ్వారు. సుధ అవమానంతో కుంచించుకుపోయింది.



ఆ నాటి నుండి సుధ తనతో ఎందుకు మాట్లాడటంలేదో ఇంతవరకూ అర్థం కాలేదు ప్రకాష్‌కి.

—సి.వి. లత

# ఓట్లు

ఎలిమెంట్రి స్కూలు టీచర్ త్రినాథ మూర్తికి ఓటర్ల జాబితా తయారు చేయాల్సిన బాధ్యత మీద పడింది. ఇంటింటికీ తిరిగి ఓటరుల పేర్లు, వివరాలు

సేకరించాలి. కాస్త శ్రమతో కూడుకున్న పనే అయినా చాలా హుషారుగా చేసుకుపోతున్నాడు త్రినాథమూర్తి. సగానికి పైగా పని పూర్తయింది. త్రినాథమూర్తి చాలా రకాల మనుష్యుల్ని చూశాడు. అదొక అనుభవం అని తృప్తిగా నవ్వుకున్నాడు కూడా !



ఆ రోజు ఉదయమే బయలుదేరాడు. నిన్నటివరకు వివరాలు సేకరించిన ఇంటి తర్వాత నుండి మొదలెట్టాడు జాబితా వివరాలు రాయడం.

ఇలా రాస్తూ ఒక ఇంటి ముందు కొచ్చి ఆగి చూసేలోగా, ఆ ఇంటి యజమాని కళ్ళజోడు సరిజేసుకుంటూ వచ్చి "కూర్చోండి సార్" అని వసారాలో ఉన్న కుర్చీని చూపించాడు.

"నా పేరు ఆర్. రామ్మోహనరావు ఎఫ్. ఎస్‌సి,. మా ఆవిడ పేరు ఆర్. రాజేశ్వరి, యమ్. యస్సీ. మా పెద్దబ్బాయి పేరు ఆర్. సుధాకర్, బి. యస్సీ" అని చెప్పి మిగతా పిల్లల పేర్లు చెప్పాడు పేర్ల జాబితా అడిగిన త్రినాథమూర్తికి.

త్రినాథమూర్తి ఆసక్తిగా అతనివైపు చూసి "నాకెంతో సంతోషంగా ఉందండి. మీ భార్యాభర్తలకూ, అబ్బాయికీ అందరికీ డిగ్రీలున్నాయి. మీ ఫామిలీ అంతా విద్యావంతుల్లాగే ఉన్నారే!" అన్నాడు అభినందనగా.

ఆ ఇంటాయన ఫక్కాల్న నవ్వి "మీరు పొరబడుతున్నారు ... మా ఇంట్లో ఎవరికీ డిగ్రీల్లేవు. నిజానికి మేం ముగ్గురమూ ఏమీ చదువుకోలేదు. నా పేరు తర్వాత ఎఫ్.ఎస్.సి. (ఫాదరాఫ్ సెవెన్ చిల్డ్రన్) అంటే ఏడుగురు పిల్లలకి తండ్రిని. మా ఆవిడ పేరు తర్వాత యమ్. యస్. సి (మదరాఫ్ సెవన్ చిల్డ్రన్) ఏడుగురు పిల్లలకి తల్లి. ఇక మావాడి పేరు తర్వాత బి.ఎస్.సి. (బ్రదర్ ఆఫ్ సిక్స్ చిల్డ్రన్) ఆరుగురు పిల్లలకి అన్నయ్య అని. అర్థం వివరించాడా పెద్ద మనిషి.

—కొండూరి కమలకుమారి

# ఆఖరి ఉత్తరం

జోగారావు, తమ్ముడు అరుణాచలాన్ని పట్నంలో చదివిస్తున్నాడు. జోగారావుకి తమ్ముడంటే వల్లమాలిన ప్రేమ. తల్లితండ్రీ పోయినప్పటినుంచీ తమ్ముణ్ని కన్నబిడ్డ కన్నా మిన్నగా చూసుకుంటున్నాడు. జోగారావు భార్య జోగులాంబకు కూడా మరిదిమీద ఆపేక్షజాస్తి.

అన్నా వదినల గారాబంవల్ల చెడిపోకుండా అరుణాచలం చదువుల్లో ఫస్టు వస్తూ, హైస్కూలు చదువు అయిపోగానే ఉన్న ఊళ్ళో కాలేజీ లేనందువల్ల

పట్నంలో కాలేజీ గడపెక్కాడు. ప్రస్తుతం అరుణాచలం బియ్యే ఆఖరి సంవత్సరంలో ఉన్నాడు.

అరుణాచలం కాలేజీ సెలవులిచ్చినప్పుడల్లా ఊరికి వచ్చేస్తుంటాడు. మధ్యమధ్య జోగారావు పట్నానికి వెళ్ళి ఆరోగ్యం, చదువు, సావాసాలు గురించి



తమ్ముడికి పదేపదే జాగ్రత్తలు చెప్పి, డబ్బిచ్చి వస్తుంటాడు. తను వారానికి రెండు ఉత్తరాలు రాస్తాడు. అలాగే అరుణాచలం కూడా వారానికి తనకి రెండు ఉత్తరాలు రాయాలని నియమం పెట్టాడు. తమ్ముడు బద్ధకిస్తాడేమోనని, తానే సొంత అడ్రసు రాసిన ఉత్తరాలను అరుణాచలానికిచ్చి, క్షేమం రాసి పోస్టులో పడెయ్యమని చెప్తుంటాడు.

ఓ రోజున అరుణాచలం దగ్గరినుంచి వచ్చిన ఉత్తరం చూసి జోగారావు పిడుగుపడ్డట్లు కూలిపోయాడు.

"అన్నయ్యా!......పరీక్షలు జరుగుతున్నాయి. బాగానే రాస్తున్నాను. ఒక పేపరు అంతబాగా రాయలేదు. ఇంతే సంగతులు. అన్నయ్యా! అన్నట్లు ఇదే ఆఖరు ఉత్తరం".

తన గారాల తమ్ముడు, ఆశాదీపం, వెధవ పరీక్షొక్కటి సరిగా రాయలేదని ఏమి అఘాయిత్యం చేసుకుంటాడోనని జోగారావు తక్షణం పట్నానికి పరుగెత్తాడు.

అక్కడ అరుణాచలం నిక్షేపంలా హుషారుగా ఉన్నాడు. అన్నగారు హఠాత్తుగా రావడం చూసి తను కంగారులో పడిపోయాడు.

జోగారావు తమ్ముడి చేతులు పట్టుకుని 'పరీక్షలు సరిగా రాయకపోయినా సరే, ఏ అఘాయిత్యం చేసుకోనని మాట ఇవ్వమని కన్నీళ్ళతో ప్రాధేయపడ్డాడు. అరుణాచలానికి అంతా అయోమయంగా అనిపించి, అసలు విషయం చెప్పమని అడిగాడు.

"మరి...ఇదే ఆఖరు ఉత్తరం అని ఎందుకు రాశావు ?"

అన్నగారి కంగారు, భయం చూసి అరుణాచలానికి నవ్వాగలేదు.

"అన్నయ్యా! ఆ మధ్య సెలవులకు వచ్చినప్పుడు నువ్వు ఇరవై కార్డులిచ్చావు రాస్తుండమని ... గుర్తుందా? వాటిలో మొన్న రాసింది ఆఖరుది" తన ఉద్దేశం వివరించాడు అరుణాచలం.

—ఓరుగంటి శ్రీహరి

# అభిమానులు

ఆ రోజున నగరానికి ప్రఖ్యాత విజ్ఞాన వేత్త ప్రొఫెసర్ కామేశ్వరం వస్తున్నట్లు వర్తమానం అందింది. వెంటనే

నగరంలోని ప్రముఖులు, ఇతర శాస్త్ర వేత్తలూ హడావిడిగా ఆయనకు స్వాగత సన్మానాలు ఏర్పాటుచేసి, రిసీవ్ చేసుకునేందుకు రైల్వే స్టేషనుకెళ్ళారు. పత్రికా విలేఖరులు, ఫొటోగ్రాఫర్లు రైలు వచ్చేందుకు అరగంట ముందరే ప్లాట్‌ఫారంమీద గుమిగూడారు.అంతలో



రైలు వచ్చింది.ప్రొఫెసర్ కామేశ్వరంగారి కోసం వచ్చిన పెద్ద లందరూ ఆత్రంగా ఫస్టుక్లాస్ కంపార్టుమెంటువైపు కదిలారు. అంతలో ఫస్టు క్లాసు పెట్టె ద్వారంవద్ద అన్నిరకాల ప్రజల ఆరాధ్య నటీమణి 'అవయవశ్రీ' దర్శనమిచ్చింది. సుతారంగా చలువ కళ్ళద్దాలుతీసి, ఓ లిప్‌స్టిక్ చిరునవ్వు విసిరి, జనాన్ని చూసి, వాళ్ళంతా తనకోసమే వచ్చారను కుని చెయ్యి ఊపింది. అంతే, తమ ఆరాధ్య నటిని గుర్తు పట్టేసిన జన సమూహం, పొలోమని మూగి, ఊపిరి సలపకుండా అవయవశ్రీని ఉక్కిరి బిక్కిరిచేశారు. ప్రొఫెసర్ కామేశ్వరంగారి కోసం తెచ్చిన దండలు 'అవయవశ్రీ' కంఠసీమనలంకరించాయి. ప్రొఫెసర్ కామేశ్వరం రైలుదిగి ప్లాట్‌ఫారం మీద కొచ్చినా; ఆయన సంగతి పట్టించుకునే నాథుడెవడూ కనిపించలేదు. అంతలో ఓ పెద్దమనిషి ఆయన దగ్గరకెళ్ళి నమస్కారం చేసి, మెళ్ళో దండవేసి స్వాగతం పలికాడు. ప్లాట్‌ఫారం మీది గుంపును, కోలాహలాన్ని చూపిస్తూ, "అదేమిటని" అడిగాడు ప్రొఫెసర్ కామేశ్వరం.

"ఇదే రైల్లో ఓ సినిమా నటీమణి దిగిందిలెండి. మీకోసం వచ్చిన ప్రముఖు లందరూ, మిమ్మల్ని మర్చిపోయి ఇప్పుడు ఆవిడచుట్టూ మూగారు" ఉక్రోశంగా చెప్పాడతను. ప్రొఫెసర్ ముఖంలో చిరాకు కనిపించింది. 'ఛీ... ఈమనుషులకి అసలు బుద్ధనేదే లేదు. విజ్ఞానం కంటే వీళ్ళకి విలాసమే ముఖ్యం. నాలుగు రోజులు తెరమీద వెలిగే ఈ తారల మీద వీళ్ళకెంత వ్యామోహం! అందుకే దేశం ఇట్లా తగలడింది' అనుకున్నాడు. తనని గౌరవంగా రిసీవ్ చేసుకున్న ఆ ఒకే ఒక్క పెద్ద మనిషివైపు ఆశ్చర్యంగా చూస్తూ "మరయితే... మీరు కూడా అక్కడికే వెళ్ళి మందలో కలవకుండా, నా కోసం వచ్చేరే? మీకు సినిమా వాళ్ళ మీద వ్యామోహం లేదా?" అడిగాడు కామేశ్వరం, కనీసం ఈయన కొక్కడికయినా తనపట్ల గౌరవం ఉందిగదాని మురిసి పోతూ.

ఓ క్షణం తటపటాయించి "నేనెలా వెళ్ళను సార్!... ఆవిడగారి మాజీ మొగుణ్ణి నేను. మొన్ననే విడాకులిచ్చే సింది నాకు..." నసిగాడు పెద్దమనిషి.

—ఎన్.ఎన్. నాయకర్







షెర్లాక్ హోమ్స్ కథలు చదివిన వారికి డిడక్షన్ అంటే ఏమిటో బాగా తెలుసు. ఒక మనిషిని చూడగానే అతను ఏ ప్రాంతంలో ఉంటాడో, ఏం పని చేస్తాడో, అతని భార్య ఎలాంటిదో, అతని సమస్యలేమిటో ఇట్టే చెప్పెయ్య గలడు హోమ్స్. సిగరెట్ పీకనుచూసి దాన్ని పారేసిన ఆసామీ గుణగణాలను ఏకరువు పెట్టగలడు. వినడానికి విడ్డూరంగా తోచినా, తన అభిప్రాయాలకు కారణభూతమైన 'క్లూ'లను నిత్యసందేహి వాట్సన్‌కు చెప్పి, 'ఓస్ ఇంతేనా' అని పిస్తాడు. నేరం జరిగిన స్థలం చూసి నేరస్థుడు ఎవరో పోల్చుకోగలడు షెర్లాక్ హోమ్స్.

అయితే ఇవన్నీ సాధ్యమయేది కథల్లోనేనా? నిజ జీవితంలో జరిగే నేరాలను పరిశోధించడానికి ఈ పద్ధతులు పనికొస్తాయా? మామూలు పోలీసు అధికారి ఎవరినైనా అడగండి-బొత్తిగా పనికిరావంటారు. నేరం జరగ్గానే, ఫలానా వారు నేరంచేసి ఉండవచ్చని వారూ వీరూ చెప్పేదాన్నిబట్టి ఒక నిశ్చయానికి వచ్చి, ఆ ఫలానావారిని 'లోపల' వేసి చావమోది, బహుశా నేరం తామే చేశామేమోనన్న అనుమానం వారికి కలిగించి, అదేమాట వారితో పలికించి, నేరం 'ఒప్పుకున్న' ముద్దాయిని కోర్టులో పెట్టి, ముద్దాయి నేరం చెయ్యడం అదే సమయానికి పనిగట్టుకుని అక్కడే వున్న తాము కళ్ళారా చూశామని, పోలీసుల తైనాతీలతో పలికించి—

మామూలుగా పోలీసుల దర్యాప్తు ఇదే విధంగా ఉంటుంది. అందుకే పట్ట పగలు జరిగిన హత్యల కేసులు కూడా కోర్టులో సాధారణంగా నిలబడలేవు.

ముద్దాయి తప్పించుకోవడానికి చాలా వరకూ పోలీసుల పద్ధతులే కారణం. ఈ మాటంటే వారికి బోలెడు కోపం. 'మీ కళ్ళముందే హత్య జరిగిందనుకోండి. మీరువచ్చి సాక్ష్యం చెప్తారా? కనీసం సమాచారమైనా ఇస్తారా?' అని అడుగుతారు పోలీసులు. నిజమేమరి. కోర్టుల చుట్టూ తిరిగి, లాయర్ల ప్రశ్నల వర్షాన్ని తట్టుకుని పౌరధర్మాన్ని నిర్వర్తించడం అంటే ఎవరికి ఇష్టం ఉంటుంది. అందుకే తమ చెప్పుచేతల్లో వుండే 'ఆస్థాన సాక్షుల'మీద ఆధారపడతారు పోలీసులు.

అయితే నేరస్తుడి నేరం రుజువయ్యేది ఎవరు ఎక్కువ పకడ్బందీగా సాక్ష్యాలను బనాయిస్తారనే దానిమీదేనా ఆధారపడేది? ఇంతకన్నా శాస్త్రీయమైన పద్ధతులేవీలేవా?

ఎందుకు లేవు ఉన్నాయి. ఎటొచ్చీ వాటికి ప్రాచుర్యమేలేదు. నేరదర్యాప్తులో శాస్త్రీయ పద్ధతులను తెలియజెప్పడానికి మన దేశంలో కృషిచేస్తున్న మూడు సంస్థల్లో ఒకటి హైదరాబాద్‌లో ఉంది.

పోలీసు ఉన్నతాధికారులకు ఇచ్చే శిక్షణలో శాస్త్రీయ విధానాల గురించి విపులంగా తెలియజెప్తున్నా, దర్యాప్తులో వారు ప్రత్యక్షంగా పాల్గొనరు.

ఈ విషయం దృష్టిలో ఉంచుకునే పధ్నాలుగేళ్ళకిందట హైదరాబాద్‌లో స్థాపించిన సెంట్రల్ డిటెక్టివ్ ట్రెయినింగ్ స్కూలులో వివిధ రాష్ట్రాలనుంచీ ఎన్నికచేసిన మెరికల్లాంటి యస్.ఐ.లకు, ఎ.యస్.ఐ.లకు మూడు నెలలపాటు ఒక జట్టు తరవాత ఒక జట్టుకు శిక్షణ ఇస్తున్నారు. పోలీసు శాఖలో కనీసం అయిదేళ్ళ అనుభవం ఉండి, నేరాలు దర్యాప్తులకు సంబంధించి ప్రాథమిక పరిజ్ఞానం ఉన్నవారినే ఇందుకు ఎంచుకుంటారు.

మూడు నెలల శిక్షణ కాలంలో వారికి నేరాలకు సంబంధించిన చట్టాల గురించి దర్యాప్తులో అవలంబించవలసిన పద్ధతుల గురించి, శాస్త్రీయ పద్ధతులను అవలంబించే విధానం గురించి బోధిస్తారు. శిక్షితులను జట్లుగా విభజించి, ఒక్కో జట్టుకు ఒక్కో శిక్షకుడు నేర్చుకున్నదానిని ఆచరణలో పెట్టిస్తారు.

ఒకగదిలో హత్య జరిగింది. అక్కడ దొరికే 'క్లూ'లు ఏమిటి? వేలిముద్రలు ఎక్కడ దొరుకుతాయి? పాదాల గుర్తులు ఎక్కడ లభిస్తాయి? వాటిని డెవలప్ చేయడం ఎలా? తుపాకీ గుండువల్ల హత్య జరిగితే గుండు ఎక్కడ ఉండవచ్చు? దాన్నిబట్టి ఆ తుపాకీ ఏ రకందో ఎలా నిర్ణయించడం? ఏ కత్తితోనో బాదడంవల్ల హతుడు చనిపోయి ఉంటే, ఆ మారణాయుధాన్నిబట్టి ఏమి తెలుస్తుంది. శవం ఉన్న భంగిమబట్టి ఏం తెలుస్తుంది. హత్యకు కారణమేమిటో ఎలా తెలుస్తుంది? ఇలాంటి ఎన్నో సూక్ష్మ విషయాలను ప్రాక్టికల్‌గా బోధిస్తారిక్కడ.

ఇక్కడ ఇన్‌స్ట్రక్టర్‌గా ఉన్న ఉమాశంకర్ జోషీ సిగరెట్ పీకకు అంటిన లాలాజలాన్నిబట్టి ఆ సిగరెట్ తాగిన వారి రక్తం ఏ గ్రూపుదో తెలుసుకోవచ్చన్నారు. పాదాల గుర్తులు, వేలిముద్రలు, ఇంకా మరెన్నో 'క్లూ'లు నేరస్తుడిని పట్టిఇస్తాయన్నారు ఆయన. ఎటొచ్చీ తార్కికంగా ఆలోచించే శక్తీ, దొరికిన 'క్లూ'లలో అప్రస్తుతమైన వాటిని వేరు చేసే సామర్థ్యమూ ఉండాలని అన్నారాయన.

ఈ స్కూలులో ఉన్న మ్యూజియంలో రకరకాల నాటు తుపాకులు, నాటు బాంబులు, దొంగ నోట్లు, రైల్వే ప్రమాదాలను విద్రోహులు ఎలా కలిగిస్తారనేది, వేషం మార్చినా వేలిముద్రలు బట్టి ఎలా పోల్చుకోవాలనేది, మానవ శరీరంలోని భాగాలను సులభగ్రాహ్యంగా ప్రదర్శించారు.

సినిమా ప్రదర్శనలద్వారా, అతిథులుగా వచ్చే ప్రవీణుల ఉపన్యాసాల ద్వారా, ఇష్టాగోష్ఠుల ద్వారా ట్రెయినీలను విజ్ఞానవంతుల్ని చేస్తారు. ఇక్కడ శిక్షణ ఇచ్చేవారు వివిధ రాష్ట్రాలకు చెందిన డి.ఎస్.పి. స్థాయి పోలీసు ఆఫీసర్లు. 'రీతేన సత్యం విన్దేమ' (సక్రమ పద్ధతిలో సత్యాన్ని చేరదాం) అనేది ఈ సంస్థ ఆశయం. విధి నిర్వహణలో చట్ట విరుద్ధమైన అక్రమ మార్గాలను విడనాడాలని ట్రెయినీలకు ఉద్బోధిస్తారు

అయితే ఇది ఆచరణ సాధ్యమేనా? సబ్-ఇన్‌స్పెక్టరు దర్యాప్తుకు బాధ్యుడు. కోర్టులో కేసును నిలబెట్టవలసింది అతనే అయినా పోలీసు శాఖలో అతను ఒక్క ప్రాణి. నేరం తీవ్రతను బట్టి ఇన్‌స్పెక్టరు, డి.ఎస్.పి., ఎస్.పి ఇంకా ఆ పైవారు యథాశక్తి దర్యాప్తులో తమ చేయీ ఉందనిపిస్తారు కదా? సబ్-ఇన్‌స్పెక్టరు ఇక్కడ నేర్చుకున్న శాస్త్రీయ పద్ధతులలో నిష్ఠగా పరిశోధన జరిపి, నమ్మకం కుదిరాకే నిందితుడిని తీరిగ్గా అరెస్టు చేస్తానంటే వారు ఊరుకుంటారా? ప్రజలూ, నాయకులూ మాత్రం ఊరుకుంటారా?

ఆచరణలో ఇలాంటి ఇబ్బందులు ఎదురవుతున్న మాట నిజమే నన్నారు తలపండిన వైస్ ప్రిన్సిపాల్ ఎన్.ఎం. సప్నేకర్. అందుకే 'మీరు పై అధికారులు అయాక మీ కిందివారిని అలా చూడ వద్దని' ట్రెయినీలకు చెబుతామనీ శాస్త్రీయ విధానాలు మనవారిలో జీర్ణించ డానికి మరి కొంతకాలం పడుతుందనీ అన్నారాయన. తగు మాత్రం శిక్షణకు మూడునెలల వ్యవధి సరిపోదని కూడా ఆయన అంగీకరించారు. అయితే వ్యవధి తగ్గడంవల్ల ఎక్కువమందికి శిక్షణ ఇవ్వ గలుగుతున్నామని అన్నారు సప్నేకర్. గత పధ్నాలుగేళ్ళలో 41 జట్లుగా మొత్తం 1045 మందికి శిక్షణ ఇచ్చారు.

ప్రస్తుతం శిక్షణ పొందుతున్న 27 మందిలో కర్నాటక నుంచి వచ్చిన హరి రామ్ భండారీ అవసరమైన సామగ్రి తమకిస్తే ఇక్కడ నేర్చుకున్న దాన్ని అమల్లో పెట్టగలమనీ, 'ఫొటో ఎలా తీయాలో, వేలి ముద్రలు ఎలాతీయాలో మేం నేర్చుకున్నాం. ఈ పనులు మేం సొంతంగా చెయ్యగలం. అయితే పోలీసు స్టేషన్లో కెమెరా, వేలి ముద్రలు తీసే సరంజామా ఉండదు కదా!' అన్నా రాయన. ఇంతవరకూ తన రాష్ట్రంవరకే, తెలుసనీ, ఇప్పుడు పొరుగు రాష్ట్రాలలో తన సహచరుల పని విధానం గురించి కూడా తెలుసుకున్నాననీ ఆయన అన్నారు.

పన్నెండేళ్ళ సర్వీసు ఉన్న మధ్య ప్రదేశ్‌కు చెందిన హెచ్.ఆర్. వర్మకు వేలి ముద్రల నిపుణుడు అని అందరూ కలిసి బిరుదు ఇచ్చారట. ఇక్కడికి వచ్చాక తనకు తెలిసింది ఎంతస్వల్పమో తెలుసుకున్నా నన్నారు. ఇంతవరకూ



పైఅధికారులు ఏమి చెబితే అది చెయ్యాలనే అనుకున్నాననీ, ఇప్పుడు సత్యం కోసంపై అధికారులను కూడా ఎదిరించే స్థైర్యం ఏర్పడిందని ఆయన అన్నారు. ఏది సక్రమమో ఏది అక్రమమో ఇక్కడికి వచ్చాకే ఆయన తెలుసుకున్నారట.

శ్రీకాకుళం నుంచి వచ్చిన కె.వి. చంద్రరావు రాజ్యాంగం గురించి, చట్టం గురించి, శరీర తత్వశాస్త్రం గురించి ఎన్నో విషయాలు తెలుసుకున్నానన్నారు. పోలీసు ట్రెయినింగులో ఇవన్నీ చెప్తారు కానీ, ఇంత విపులంగా చెప్పరట.

'కానీ ఈ ట్రెయినింగువల్ల మాకొచ్చే గుర్తింపు ఏమిటి? మేమూ, ట్రెయినింగు పొందని సబ్ - ఇన్‌స్పెక్టరూ డిపార్టుమెంటు దృష్టిలో ఒకటే కదా!' అన్నారు ఒక ట్రెయినీ.

'కోర్సు కాగానే ఫైనల్ పరీక్ష ఉంటుంది. అందులో ఉత్తీర్ణతకు 60 శాతం మార్కులు రావాలి. 75 శాతం కన్నా ఎక్కువ మార్కులు వచ్చినవారు 'డిస్టింక్షన్'తో ఉత్తీర్ణులైనట్టు ప్రకటిస్తాం, మా పరీక్షలో పాసుకావడాన్ని ప్రమోషన్లు ఇచ్చే సందర్భంలో ప్రత్యేక అర్హతగా పరిగణిస్తారు' అని చెప్పారు ప్రిన్సిపాల్ ఆర్.డి. భూపాల్ మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, గుజరాత్ రాష్ట్రాల్లో ప్రమోషన్‌కు ఈ శిక్షణ సర్టిఫికెట్ పొందడం తప్పనిసరి అన్నారాయన.

సబ్‌ఇన్స్పెక్టర్ల బ్యాచి శిక్షణ పూర్తి చేయగానే ఇన్స్పెక్టర్లకు 20 రోజులు ఓరియంటేషన్ కోర్సును ప్రారంభిస్తారు.

దర్యాప్తులు పర్యవేక్షించే విధం, పోలీసు పనిలో సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించేతీరు, పరిశోధనా విధానాల గురించి బోధిస్తారు. ఇంతవరకూ 12 బ్యాచిలుగా 276 మందికి శిక్షణ ఇచ్చారు.

ఈ రకమైన శిక్షణ విధానానికి 1957లో కలకత్తాలో కేంద్ర ఫోరెన్సిక్ సంస్థల స్థాపనతో అంకురార్పణ జరిగింది. ఇన్స్పెక్టర్ జనరల్ హోదా కలిగిన కమాండెంట్ ఆధ్వర్యంలో ఉంటే ఈ సంస్థల్లో సెంట్రల్ డిటెక్టివ్ ట్రెయినింగ్ స్కూలు, సెంట్రల్ ఫోరెన్సిక్ సైన్స్ లాబొరేటరీ, సెంట్రల్ ఫింగర్ ప్రింట్ బ్యూరో, అనుమానాస్పద పత్రాలను పరీక్షించే విభాగం, అంతర్భాగాలు- ఇవి తొలుత ఇంటలిజెన్స్ బ్యూరో కింద ఉండేవి. 1973లో పోలీసు రిసెర్చి డెవలప్మెంట్ బ్యూరో వీటిని చేపట్టింది.

ఈ సంస్థల రెండవ శాఖ హైదరాబాద్‌లో 1974 సెప్టెంబరులో ప్రారంభమైంది. ట్రెయినింగ్ స్కూల్ తోబాటు ఫోరెన్సిక్ సైన్స్ లాబొరేటరీని, పత్రాలను పరిశీలించే కార్యాలయాన్ని కూడా తరవాత ఇక్కడ నెలకొల్పారు. దేశంలో మూడవ ట్రెయినింగ్ స్కూలును చండీగఢ్‌లో 1974 జనవరిలో స్థాపించారు. హైదరాబాద్‌లోని సి.డి.టి.ఎస్.కుగాను కేంద్ర ప్రభుత్వం ఏడాదికి ఆరులక్షల రూపాయలు ఖర్చు పెడుతున్నది.

ఈ ట్రెయినింగ్ స్కూల్లోని ప్రిన్సిపాల్ శ్రీ ఆర్.డి. భూపాల్ ఐ.పి.ఎస్,కు చెందినవారు. వైస్ ప్రిన్సిపాల్ ఎస్. ఎం. సప్నేకర్ ఎస్. ఐ. స్థాయి నుంచి స్వయం కృషివల్ల సూపరింటెండెంట్ స్థాయికి చేరినవారు. నలుగురు ఇన్స్ట్రక్టర్లు డి.ఎస్.పి. క్యాడర్ వారు.



ఇద్దరు జూనియర్ ఇన్స్ట్రక్టర్లు ఇన్స్పెక్టరు హోదా ఉన్నవారు.

ఈ సంస్థ ప్రస్తుతం నిలోఫర్ ఆస్పత్రి ప్రాంతంలో అద్దె భవనాల్లో నడుస్తున్నది. ట్రెయినీలకు బంజారా హిల్స్ వద్ద అద్దెకు తీసుకున్న భవనంలో వసతి సౌకర్యం కల్పించారు. వారికి నివాసం, వైద్యసదుపాయం ఉచితం. భోజనం ఖర్చును సహకార పద్ధతిని భరిస్తారు. సంస్థలోని గ్రంథాలయంలో నేరాలు, చట్టాలకు సంబంధించిన ఆధునిక గ్రంథాలు ఎన్నో ఉన్నాయి. మొత్తం 5000 పుస్తకాలు ఉన్నాయి.

హాస్టల్ ఆవరణలో అరగంట వ్యాయామంతో ట్రెయినీల రోజువారి కార్యక్రమం మొదలవుతుంది. తరవాత వ్యాన్‌లో స్కూలుకు వస్తారు. ఉదయం ఎనిమిదిన్నర నుంచి మధ్యాహ్నం 1-45 ని. వరకూ ఇన్‌డోర్ పాఠాలు వింటారు. ప్రతి బుధవారం ప్రాక్టికల్ అభ్యాసాలు ఉంటాయి. ఇంటి దొంగతనం, హత్య, దోపిడీల వంటి నేరాలు జరిగినప్పుడు వేలిముద్రలు, పాదముద్రలు తీయడం, నేరస్థలాన్ని చిత్రంలో చూపడం, పరిస్థితిని తార్కికంగా అధ్యయనం చేయడంవంటి విషయాలను ప్రాక్టికల్‌గా చేయిస్తారు.

పోలీసుల విధి నిర్వహణకు సంబంధించిన అంశాలపై వారానికొకరోజు సినిమా ప్రదర్శన ఉంటుంది. ట్రెయినీలు స్వేచ్ఛగా తమ భావాలను వ్యక్తపరచడానికి గాను వారు 15 నిమిషాల సేపు ఇచ్చిన అంశంపై మాట్లాడవలసి

ఉంటుంది. ఈ విధంగా వారిలో సభా కంపాన్ని, బిడియాన్ని పోగొడతారు.

ఆరవ వారం ఆఖరులో టెర్మినల్ పరీక్షను నిర్వహిస్తారు. పన్నెండవ వారంలో ఫైనల్ పరీక్షను లిఖితపూర్వకంగానూ, మౌఖికంగానూ నిర్వహిస్తారు. ఇరవై రోజుల కోర్సు పొందిన వారికి శిక్షణ పూర్తి కాగానే పరీక్ష ఉంటుంది.

అయిదేళ్లకు తగ్గకుండా, పదిహేనేళ్లకు మించకుండా పోలీసు శాఖలో పనిచేసిన వారినే ట్రయినింగుకు ఎంచుకొంటారు. ఇందుకూ ఒక కారణముందన్నారు సప్నేకర్.

అయిదేళ్ళ అనుభవం ఉన్న వారి అభిప్రాయాలను సులభంగా మార్చవచ్చు అదే ఇరవైఏళ్ళ సర్వీసు గడించిన వారికి కొన్ని నిశ్చితాభిప్రాయాలు ఏర్పడతాయి. వారి నమ్మకాలను మార్చడం వారితరం కాదు అంటారాయన.

1957లో సెంట్రల్ డిటెక్టివ్ ట్రెయినింగు స్కూలును ప్రారంభించినప్పుడు శిక్షణ కాలం 13 వారాలు ఉండేది. హెండెన్ వంటిచోట్ల విదేశాల్లో ఉన్న డిటెక్టివ్ శిక్షణ సంస్థల పాఠ్య క్రమాలను, మన దేశంలోని రాష్ట్రాల పోలీసు ఐ.జి.లు చేసిన సిఫార్సులను దృష్టిలో ఉంచుకొని సిలబస్‌ను తయారు చేశారు. మొదట కొన్ని బ్యాచిల శిక్షణ కాగానే, ప్రాక్టికల్ అభ్యాసాలకు వీలు కలిగిస్తూ శిక్షణ కాలాన్ని 14 వారాలకు పొడిగించారు. 1975లో ఈ సిలబస్‌ను తిరిగి సమీక్షించి, 12 వారాలకు దీన్ని కుదించారు. ఇన్స్పెక్టర్లకు 20 రోజుల ఓరియంటేషన్ కోర్సును అన్ని సి. డి. టి.ఎస్.లలో 1975లో ప్రారంభించారు.



# ఫోటోలు ఏం చెప్తున్నాయి?

ఆ గదిలో ఓ ట్రంకు పెట్టె ఉంది. అందులో విలువైన నగలున్నాయి. వాటిని తీసుకుని దొంగ పారిపోతుండగా ఆ చప్పుడుకి మేల్కొన్న ఆ ఇంటిలో ఉన్న వ్యక్తి దొంగను అటకాయించాడు. దొంగ కత్తితీశాడు. ఆత్మ రక్షణకోసం దొంగ తలమీద కర్రతో బాదాడతను. ఆ ఘర్షణలో టేబిల్ మీదున్న అలారం టైమ్ పీస్ నేలమీద పడి పగిలింది. దొంగ చాకచక్యంగా అతని ఛాతీమీద కత్తితో పొడిచి, దాన్నక్కడే పారేసి హడావుడిగా పారిపోయాడు. ఆ తొందరలో హతుడి ఛాతీ మీది గాయంలోంచి కారిన రక్తంలో కాలుపెట్టాడు. దీని కథాకమామీషు తేల్చడానికి పరిశోధకులు రంగంలోకి దిగారు.

1. హతుడి ఛాతీమీద గాయం ఎలాంటిదో పరిశీలించారు. హత్య జరిగినచోట పరిశోధకులకు దొరికే ఆధారాలు అయిదు ఉన్నాయి. వాటిని 1, 2, 3, 4, 5 అని గుర్తులు పెట్టినచోట చూడవచ్చు.

మొదటిది ట్రంకు పెట్టె దాని మీద హంతకుడి వేలి ముద్రలు దొరుకుతాయి.

రెండోది హత్యకు కారణమైన కత్తి. దాని మీదా వేలి ముద్రలుంటాయి. మూడోది హతుడు ఆత్మరక్షణకు ఉపయోగించిన కర్ర, దానిమీద ఉన్న హంతకుడి తల వెంట్రుకలు, అతడి తలపై తగిలిన గాయం తాలూకు రక్తం అనుమానితుల రక్తం, తల వెంట్రుకలతో పోల్చి చూడాలి. నాలుగోది రక్త సిక్తమైన పాదం గుర్తు, దాన్ని కాగితం మీద ట్రేస్ చేయాలి. అయిదోది పగిలిన టైంపీసు.

2. హతుడి ఛాతీమీది గాయాన్ని ఒకరు ఫొటో తీయగా, మరొకరు ట్రంకు పెట్టె మీది వేలి ముద్రల్ని జాగ్రత్తగా పరిశీలించారు.

3. ట్రంకు పెట్టె తెరిచారు. ఖాళీ నగలపెట్టె కనపడింది. దాన్ని బట్టి నగల కోసమే హత్య జరిగిందని పరిశోధకులు నిర్ధారణకు వచ్చారు. నగలపెట్టె మీద హంతకుడి వేలిముద్రలు ఎలాగూ ఉంటాయి. (చేతికి గ్లోవ్స్ తొడుక్కుని ఉంటే తప్ప) వాటికోసం ఒకరు వెతుకుతుండగా, పెట్టెలోని వస్తువుల జాబితాను రాసుకున్నారు మరొకరు.

4. టేబిల్ మీదినించి క్రింద పడి పగిలిన అలారం టైమ్‌పీస్‌ను పరిశీలించారు. అది ఆగిపోయిన సమయాన్ని బట్టి హత్య ఎన్నిగంటలు ప్రాంతంలో జరిగిందో అంచనా వేయవచ్చు.

5. ఉత్తర ప్రదేశ్ నుంచి ఇక్కడ శిక్షణ పొందడానికి వచ్చిన ఆఫీసర్ గ్లాసుమీది వేలి ముద్రలు ఎలా తీస్తున్నాడో గమనిస్తున్నారు ఇన్‌స్ట్రక్టర్. తర్వాత టేబిల్ మీదున్న సాసర్, చెంచాలపైగల వేలిముద్రలు తీయాలి.



6. బల్లమీద ఉన్న పెట్టెలో వేలి ముద్రలు తీసే సరంజామా ఉంటుంది. కావలసిన వస్తువుమీద ఆటోమైజర్‌తో సీసాలోని పౌడరుచల్లి, కేమెల్ బ్రష్‌తో తుడిస్తే వేలిముద్ర రేఖలతోసహా ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. తెల్లటి ప్రదేశంలో ముద్ర తీయటానికి బ్లాక్ పౌడర్‌ను, తెల్లనివి కాని ప్రదేశాల్లో ముద్రలు తీయటానికి యూనివర్సల్ గ్రే పౌడర్‌ను వాడతారు. కరెన్సీ కాగితంలాంటి రంగు రంగుల వస్తువులమీద ప్రింట్స్ తీయడానికి ఎంత్రసిన్ పౌడర్ వాడతారు. గాజు గ్లాసుమీద ఆటోమైజర్‌తో పౌడర్ చల్లుతున్నాడు ఆఫీసర్. పౌడర్ చల్లాక బ్రష్‌చేస్తే వేలిముద్ర బయటపడుతుంది. దాన్ని తర్వాత ఫొటో తీస్తారన్నమాట.

7. నేరం జరిగిన స్థలంలో దొరికిన వేలిముద్రను అనుమానితుడి వేలిముద్రతో పోల్చినప్పుడు సరిపోతేనే అతడు ముద్దాయి అని నిర్ధారణకు వస్తారు-పరిశోధకులు. అలా సరిపోల్చడానికి మామూలు కన్ను సరిపోదు మైక్రోస్కోపుతో ఆ పని ఎలా చేయాలో ఇన్‌స్ట్రక్టర్ ట్రెయినీలకు వివరిస్తారు. చిత్రంలో వెనుక ఉన్న పటాల్లో మానవ శరీరంలోని భాగాలను చూడవచ్చు ఎక్కడ ఏ నరం ఉంటుందో, ఏ ఎముక ఉంటుందో పోలీసు అధికారికి తెలియక పోతే కోర్టులో లాయర్లముందు బిక్క మొగం వెయ్యాలి.

8. దొంగనోట్లను గుర్తించటం గొప్ప ఆర్ట్. నూటికి నూరుపాళ్ళు నిజం

నోటులాగే ఉన్నా వాటర్‌మార్క్ లేకపోవటం, సెక్యూరిటీ థ్రెడ్ లేకపోవడాలే దొంగనోటును పట్టిస్తాయి. బీరువాలో నోట్లవెనుక ఉన్న పరికరం నాణేలను పోతపోయడానికి ఉపయోగించేది. దాని ప్రక్కనే రకరకాల 'విషం' సీసాలు ఉన్నాయి. ఏవిషాన్ని ఎలా ప్రయోగిస్తారో, మరణించాక దాని ప్రభావం మనిషి శరీరంలో ఏవిధంగా ఉంటుందో వివరిస్తారు ఇన్‌స్ట్రక్టర్.

గోడకు తగిలించి ఉన్న పటాలలో వేషాలు ఎలా మారుస్తారో చూడవచ్చు. ఎడమ వైపు పటం పై వరుసలో ఉన్న నలుగురూ నిజానికి ఒకరే. అయితే వేషం మార్చినా వారి వేలిముద్రల్లో తేడా ఉండదు.

9. కన్నపు దొంగలు చాలా చిత్రమైన సాధన సామాగ్రిని ఉపయోగిస్తారు. ఎలాంటి నమ్మకమైన తాళాలనైనా ఇట్టే తీసేయగలరు. ఎంత పటిష్టమైన గొళ్ళేలనైనా సునాయాసంగా ఊడబెరకగలరు. చిత్రంలోని సాధనాల మధ్యలో అడ్డంగా ఉన్న రెండూ తాళాలు తీయడానికి ఉపయోగించేవి. మిగతావి తాళం ఉండే ప్రాంతాల్లో, గొళ్ళేలదగ్గరా కన్నం వేయడానికి దొంగలువాడే పరికరాలు.

10. ట్రెయినీల ఆలోచనా శక్తికో పరీక్ష ఉంటుంది. ఒక గదిలో అచేతనంగా పడిఉన్న శరీరాన్ని పరిశీలించి' పరిశోధించి అది హత్యా? ఆత్మహత్యా? అనే విషయాల్ని నిర్ధారించి అందుకు సంబంధించిన 'క్లూ'లను సేకరించాలి.

శవం చేతిలో రివాల్వర్ ఉన్నంత

మాత్రాన దాన్ని ఆత్మహత్య అనడానికి వీల్లేదు. ఆత్మహత్యే గనక అయితే పిడికిలి బిగుసుకుపోయి ఉండేది. రివాల్వర్‌ను హంతకుడే శవం చేతిలో పెట్టాడని ఎందుకనుకోకూడదు!

శవం కణత మీదున్న బుల్లెట్ గాయంవల్ల, గదిలో టేబుల్ మీది సిగరెట్ పెట్టె, అగ్గిపెట్టె, యాష్‌ట్రే, డైరీపైన దొరికే వేలిముద్రలవల్ల ఏమైనా ఆధారాలు దొరుకుతాయేమోనని ట్రెయినీలు పరిశీలిస్తారు.

11. చూడడం వేరు, గమనించడం వేరు. అపరాధ పరిశోధకుడికి గమనించే నైపుణ్యం, పరిశీలనాశక్తి చాలా అవసరం.

ఒక కేడీ వేషధారిని ట్రెయినీల మధ్య నిలబెడతారు. అతడు ఒక్కొక్కరి వద్దకు వచ్చి నిల్చున్నప్పుడు అయిదు నిముషాల్లో అతడిని క్షుణ్ణంగా పరిశీలించాలి. తరువాత వారి దృష్టిని వేరే విషయాల మీదికి మళ్ళించి ఆ కేడీలో వారు గమనించిన విషయాలేమిటో రాయమంటారు. ప్రతివారిలోనూ కొన్ని ప్రత్యేకతలుంటాయి. నడక, నిలబడే తీరు, ముఖం చిట్లించడంవంటి అలవాట్లు, ఒకొక్క మాట అనే పద్ధతి, పుట్టుమచ్చలు, గాయాల చారికలు-ఇలా ఎన్నో. వేషం, భాష ఎంతగా మార్చినా పైన గమనించిన విషయాలే మనిషిని పట్టిస్తాయి. వాటిని చూడగానే పసికట్టి, గుర్తుపెట్టుకొనే శక్తిని పెంపొందించడం సి.డి.టి.ఎస్. శిక్షణలో ఓ భాగం.

ఇలా శిక్షణ పొందిన వారిప్పుడు దేశ వ్యాప్తంగా [redacted] కేంద్రాలలో తమ విధుల్ని నిర్వహిస్తున్నారు. ప్రజ్ఞా పాటవాల్లో, పరిశోధనా నైపుణ్యంలో వీరెవరికీ తీసిపోయే వారు కారు. దీనికి తగినట్లుగా వీరికి నిత్యపరిశోధనలలో అత్యవసరమైన సాంకేతిక పరికరాలను అత్యంతాధునికమైన లాబొరేటరీలనూ కూడా సమకూరిస్తే వీరి సేవలు సద్వినియోగం కాగలవు.



Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, [illegible] Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly ... 500 004,

Regd No. H/ HD /402